బుద్ధిరాజు పేరయప్రధానవిరచిత

# సాత్త్వికబ్రహ్మవిద్యావిలాసనిరసనము.

బ్రహ్మశ్రీ కల్లూరి - వెంకటరామకవివర్యవిరచిత

వంశముక్తావళీసహితము.



ఇది

మాతృకాప్రత్యనుసారమ్ముగా

బ్రహ్మశ్రీ ములుకుట్ల - విశ్వనాథశాస్త్రులవారిచే

సరిచూడబడి

రాజమహేంద్రపురవాస్తవ్యులును బ్రహ్మశ్రీ

మహారాజశ్రీసంపన్నులునగు

నందివాడ - భైరవమూర్తిగారిచేత

లోకోపకారంబుగ

పిడుగు - సుబ్బరామయ్యఅండుసన్ గార్ల

శారదానిలయముద్రాక్షరశాలయందు

అచ్చుకూర్పించి ప్రకటింపబడెను.

చెన్నపట్టణము.

౧౮౯౭ సం॥ ఏప్రల్ నెల.

శ్రీ రస్తు.

## వంశముక్తావళీవిషయసూచిక.



వంశముక్తావళీవిషయసూచిక సమాప్తము.

## సాత్వికబ్రహ్మవిద్యావిలాసనిరసనగ్రంథవిషయసూచిక.

సాత్వికబ్రహ్మవిద్యావిలాస నిరసనవిషయసూచిక సమాప్తము.

శ్రీరస్తు.

# వంశముక్తావళి.

ఇది

రాజమహేంద్రవరమందలి టౌనుస్కూలులో

సంస్కృతోపాధ్యాయుఁడగు

కల్లూరి - వేంకటరామశాస్త్రిచే

రచింపఁబడి

మ-రా-రా-శ్రీ అడివి శ్రీరామపంతులవారిచేతను

చెన్నపురి

పిడుగు-సుబ్బరామయ్య అండ్ సన్స్ గారి

శారదానిలయ ముద్రామందిరమున

భద్రముద్రాక్షరములచేత

ముద్రితమయ్యెను.

శాలివాహనశకాబ్దములు ౧౮౧౦ సర్వధారిసం॥

మాఘమాసము.



మ॥ విషుఁడీ వేంకటరామనామమునన్ జేర్కొందు
మాపెద్దల। ర్చన చేభానుని బండికల్లుతమయూర
న్శిల్పఁగాఁజాలియా । ఘనుకూర్మిన్ గొనుటన్
మహార్యమహితుల్కల్లూరివారైరి మే।లన నేనుం
దుమఁగోటిలింగభువినిష్ఠా పేరిటన్ జేర్వడన్॥

శ్రీరస్తు.

---

## వంశముక్తావళి ప్రారంభః.

పరబ్రహ్మణేనమః.

౧॥శా॥ శ్రీవాణీశిబిరాభఁగుంభములురంజిల్లంగవీనుల్వతా । కావ
స్త్రంబులనెన్నఁగామదపయఃకాసారసంభిత్తిమైఁ । బోవం
జూచుర్వురంబొనాఁగఁగరముంబొల్పొందఁగానద్భుతగ్రావం
బోయనిపించువిఘ్నపతిపేర్రాజోత్తముంబ్రోవుతన్ ॥

౧॥ మూలగ్రంథకర్తచేత నే కష్టస్థలముల వ్యాఖ్యానము సంక్షిప్త
ముగా రచింపఁబడును.

శ్రీవాణీ...రంజిల్లగన్ = లక్ష్మీసరస్వతుల శిబిరములకాం
తివంటికాంతిలో, కుంభస్థలములుప్రకాశింపఁగా, వీనుల్ ... నెన్నఁ
గా=చెవులుధ్వజవస్త్రములను పోలియుండఁగా, మదపయః...పొ
ల్పొందఁగా=మదోదకసరస్సులగూడికచే,పోవుచున్నప్రవాహమో
యనునట్టుతుండముప్రకాశింపగా, అద్భుత...విఘ్నపతి=వింతయ
గుపర్వతమో అనిపించెడు విఘ్నేశ్వరుఁడు లక్ష్మీసరస్వతులను,
విజయమును, పావనత్వమును, ఒసంగి రక్షించుగాక అని స్ఫురిం
చుచున్నది.

౨॥మ॥ పణితవ్యాంతజటోదయంబునుమహాపర్ణా [illegible]బున్ఫణి
ద్గణసేవ్యంబునుస్వచ్ఛశీతకరమున్గాంతోత్తమస్కం[illegible]బునుక్
బ్రణిపాతేష్టవినాయకంబునయియావాలప్రవద్వారిచేఁ।
బ్రణుతంబౌశివచందనద్రుమముపేర్రాజోత్తముంబ్రోవుతన్॥

౨॥ ఈపద్యమునందు శివునకును, చందనవృక్షమునకును పోలిక, కావున విశేషణములు రెండుపక్షములను అన్వయించును- మొదటిది శివపరార్థము, రెండవది, చందనవృక్షార్థము.

పణిత...దయంబును=స్తుతింపఁదగినకొనలుగల జటలవృద్ధిగలవాఁడు, స్తుతింపఁదగినకొనలుగలవేళ్లయుత్పత్తిగలది, మహాపర్ణాఁశ్రితంబున్=పూజ్యురాలగు పార్వతిచేపొందఁబడ్డవాఁడు, గొప్పాకులచే నాశ్రయింపఁబడ్డది, ఫణీద్గణసేవ్యంబును=సర్పశ్రేష్ఠములచేతను, ప్రమథగణములచేతను సేవింపఁదగ్గవాఁడు, సర్పశ్రేష్ఠములసమూహముచే సేవింపఁదగ్గది, స్వచ్ఛశీతకరమున్=నిష్కళంకుఁడగుచంద్రుఁడుగలవాఁడు, అచ్చచలువనుచేయునది, కాంతోత్తమస్కంధమున్=భార్యయొక్కశ్రేష్ఠమగుమూపుగలవాఁడు (అనఁగా అర్థనారీశ్వరుఁడుగాన, ఒకమూపుభార్యదిఅని తాత్పర్యము,)సుందరమగుశ్రేష్ఠమగుప్రకాండము (అడుగుబోదెగలది) ప్రణిపా... వినాయకంబును=ప్రణిమిల్లుటయందునిష్టుఁడగు, విఘ్నేశ్వరుఁడుగలవాఁడు,వాలఁగోరెడుపక్షిశ్రేష్ఠములుగలది, ఆవాల...వారిచేన్=అల్లతలవెంట్రుకలయందుఁ బారుచున్న జలముచే (గంగాధరుఁడు అనితాత్పర్యము) పాదునందుఁబారుచున్నజలముచే) ఈ యర్థమందు "ఆవాలము" పాదువడు.

3॥మ॥ కనఁగావింతయనంగమూర్తినలమంగాఁజాలినయ్యగ్గియా।
రనిచోనీరసమొందుస్థాణువునుస్పర్శంబొందియేపర్వతా।
వనిరాడ్భూలతపల్లవప్రకృతిశోభంగూర్చెనోయాలతా।
గ్రణిచింతామణిధన్యఁజేయుతనుబేర్రాజోత్తమామాత్యునన్॥

3॥ ఈపద్యమునందు పార్వతికిని చింతామణిలతకును,సాంబమూర్తికిని శుష్కించినకఱ్ఱకును ఉపమానోపమేయము- మొదటఁ బార్వతీపరార్థము, రెండవది చింతామణిపక్షార్థము.

వింత ..య్యగ్గి=ఆశ్చర్యమగుమన్మథస్వరూపమును ఆక్రమింపఁ జాలినయాయగ్ని,శివనేత్రాగ్నియనిభావము(పా-ప)ఆశ్చర్యమనున(ట్టికఱ్ఱ)స్వరూపమందు ఆవరింపసమర్థమయిననిప్పు(చిం-ప),ఆరనిచో=వెల్గుచుండఁగా, స్పర్శంబొందిఅనుచోటికినన్వయము, నీరస...స్థాణువును=శృంగారహీనుఁడగుశివుని(పా-ప), శుష్కించిన మొద్దును (చిం-ప) పర్వతా...లత=హిమవతుకుమారియనెడులత (లతలకుస్త్రీలకునుపమానోపమేయముప్రసిద్ధము) హిమవత్పర్వతమందుమొలిచినతీగె (చిం - ప) పల్లవ...శోభన్=విటస్వభావుని శోభను (పా - వ) చిగుర్చుస్వభావముగలదానిశోభను(చిం-ప) అనగా మందుచున్నయగ్గిగల రసహీనస్థాణువునకుఁ బల్లవశోభఁ గూర్చినదిగావున, చింతామణిలతయనిభావము. హిమవత్పర్వతమందు మహిమగల యోషధులున్నవని ప్రసిద్ధమైనవిషయమే.

4॥ఉ॥ దీప్తదివాకరేందులనుదివ్వెలవెల్గెడుచక్రవాళప।
ర్యాప్తవసుంధరావలయరంగముపైబహుతారమౌక్తిక।
వ్యాప్తనభోవితానమునువాసిగఁగూర్చిసమస్తభూతపా।
త్రాప్తి [illegible] ముచ్ఛభ్రమల్॥

౪॥ దీప్త…ఇందులు=ప్రకాశించు సూర్యచంద్రులు, చక్ర…రంగముపై=చుట్టుకొండచే వ్యాప్తమగు భూవలయమనెడిరంగస్థలముపై, బహు…వితానమును=బహునక్షత్రములనెడిముత్యములతోఁ గూర్పఁబడిన యాకాశమనెడి మేలుకట్టును; సమస్త…ఆప్తిని=సర్వజంతువులనెడి పాత్రములు (ఆడెడివారు) లబ్ధిచే ; సూత్రధారుఁడు = జగన్నాటకి సూత్రిధారుఁడని భావము.

౫॥ మ॥ ప్రథితస్వాన్వయగోళులైతమరుసూర్యాచంద్రముల్నాన్దిశా। గ్రథితంబైనగవాళిఁగుండినులకర్థస్ఫారకుల్గాఁగహ్వా। త్పథమందుంతునృసింహదీక్షిత గురుంభాష్యాబ్ధిసర్వంకషున్। బృథుమేథాచుళుకీకృతాఖిలకలున్వీరావధానింగురున్॥

ఈపద్యమందుసగోత్రులగుగురువులప్రార్థన.

౫॥ ప్రథితస్వాన్వయగోళులు=ప్రసిద్ధమగు నావంశమనెడు గోళముగలవారు; (అనఁగాసూర్యచంద్రులుఖగోళమందున్నట్టునావంశగోళమందున్నారనిభావము); సూర్యచంద్రముల్ =ఇచ్చట, దేవతాద్వంద్వేచ, అనుసూత్రముచేఆనజ్జువచ్చినది. దిశాగ్రథితంబు=దిగంతవ్యాప్తమగు ; (కిరణవాక్పక్షమందుసమానార్థము) ; ఆపంచైవహలంతానామ్;అనుటచేదిశాశబ్దముఆకారాంతము; గవాళిన్=వాక్సమూహముచె(గురుపక్షము) (కిరణసమూహముచే); (సూ - చ); కుండినులకు=కాండిన్యసగోత్రులకు;ఇచ్చట॥ఆగస్త్యకౌండిన్యయోరగస్తికుండినచ్" అనుసూత్రముచేకుండినులనిరూపము;అర్థస్ఫారకుల్=(గ్రంథముల) అర్థము తెలియఁజేయువారు; (గురుపక్షము) ; ద్రవ్యము

లుకనబలుచువారు, (సూ - చ); ఇచ్చట ణ్యంతంబగుస్ఫురధా
తుతునకు "చిస్ఫురోణౌ" అనుసూత్రమున నాత్వము; భాష్యా ..
కమున్ = భాష్యసముద్రమః యావత్తుతరచినట్టు; విష్ణ వ్వంశసం
భూతుడని యాధ్వన్యర్థము; ఇచ్చట "సర్వకూలాభ్రికరీషేషుకష" అనుసూత్రమున ఖచ్చు రాఁగాము మాగమ ప్రాప్తి చేసర్వం
కష అని రూపము; పృథు ... కలున్ = గొప్ప మేధ చేపుడిసిలింపఁబ
డినసమస్తవిద్యాసముద్రము గలవాఁడు। ఇచ్చట, అఖిలాని కాని
వారీణి లాతిగృహ్ణాతీతి అఖిలకలః; "ఆతోనుపసర్గేకః" అను
సూత్రమునక ప్రత్యయము; సముద్రఇతిధ్వన్యతే; అనఁగా సము
ద్రమును, అగస్త్యుఁడు త్రావినట్లు విద్యలను అనాయాసముగా గ్రహిం
చెనని తాత్పర్యము.

౬॥ మ॥ ధ్వనితాంత ప్రతిపర్వవర్థితరసోదంజన్మహాభారతా।
బ్ధినిస్వజ్ఞానతరిం దరించుచు స్వయంతీర్ణః పరాన్ తారయే।
త్తనులోకోక్తిస్ఫురింపనాంధ్రవిషయవ్యాప్తాఖిలార్థంబు సే।
సినసాంయాత్రికులందలంచెదవచఃసింధుం దరింపింపఁగాఁ॥

ఈ పద్యమందు భారతమాంధ్రీకరించిన కవులకు సముద్రపు

వర్తకులకునుపమానోపమేయము.

౬॥ ధ్వని ... అబ్ధిని = అలంకారములచే వ్యాప్తమయినట్టియు, ప్రతి
పర్వమందు వృద్ధిపొందిన శృంగారాదిరసములచే ప్రకాశించున
ట్టియు అని భారతార్థము. శబ్దముచేత వ్యాప్తమయినట్టి, ప్రతిప
ర్వదినమందు పొంగిన జలముచేత ప్రకాశించునట్టియు, అని అబ్ధి
పక్షము। స్వ ... తరించుచు = తమ తెలివియనెడు నోడచేదా
టుచు; ఆంధ్ర ... అర్థంబు = ఆంధ్రమందు విస్తరింపింపఁబడిన

యర్థముగలది(భారత) ; ఆంధ్రదేశమందువిస్తరింపఁజేయఁబడ్డ వస్తువులుగలది ; అని (అబ్ధిపక్షము) ; సాంయాత్రికులు=ఓడ వర్తకులు ; వచస్సింధుః=వాక్కుల నెడుసముద్రమును ;

తా॥ భారతము తెనిగించినందున తమరుమాత్రమే తరించుటకాక, అందుమూలమునసులభముగాబోధించి యితరులనుగూడఁగృతకృత్యులనుజేసిరనిభావము.

౭॥ వ॥ అనియిష్టదేవతా స్మరణంబును, సుకవిస్తుతియును, ఒనర్చి ప్రసన్నాంతఃకరణుండనై సన్నిధిఁగూర్చుండు సమయంబున.

౮॥ సీ॥ రాజితభూరిగోత్రసముఁడౌనెవ్వాఁడుభవముచేమూర్తివైభవముచేత । రాజనామాన్వర్థరంజకుండెవ్వాడునయముచేసతతోన్నయముచేత। సర్వజ్ఞసత్క్రియాసాధకుండెవ్వాఁడు యమముచే । దనమహాద్యమముచేత । కల్పితమాధుర్యకంతుడౌనెవ్వాఁడుద్రాక్షచేశుభదరుద్రాక్షచేత॥

౯॥ తే॥ సర్వగోత్రోద్ధరణుఁడన్న సౌమ్యకీర్తి। వాహివైభవిదైవవశాహమహిమఁ। బ్రబలునెవ్వడాయట్టిపేరాజమంత్రి।యధికకౌతుకమునసుండునవసరమున॥

౮॥ భవముచేఁ=జన్మముచేత;మూర్తివైభవముచేతఁ=దేహసౌష్ఠవముచేత;రాజిత...సముఁడు=ప్రకాశించు గొప్పవంశమునకుతగినవాఁడు (అనగావంశమునకు తగినవాఁడు పుట్టినాడనిభావము) ; భూరిగోత్రమనగా బంగారుపర్వతముఁగాన, ప్రకాశించుమేరువుతోసమానుఁడు (దేహౌన్నత్యసువర్ణతాదులచేమేరువునుబోలినవాడనిభావము);(కాంత్యామేరురివస్థితఃఅనికాళిదాసుడుదిలీపమహారాజును వర్ణించెను, నయము చే=నీతి

చేతను, సత్కలోన్నయము చే=యోగ్యమగువిద్యలనెడు చం
ద్రకళలయతిశయము చేతను, రాజా...రంజకుండు=తనపేరు
లోనున్న రాజశబ్దమును బొందినయర్థమును ప్రకాశింపచేయు
వాఁడు రాజశబ్దమును సార్థకపఱచెనని భావము, రాజశబ్దము
నకు,చంద్రుడుకూడనర్థమున్నది. (అనగా రాజనీతిమంతుడును
చంద్రునింబోలె నాహ్లాదకుండును) యమము చేక్=నియమము
చేత,తనమ హాత్మ్యము చే=తనయాపచ్ఛక్తి చేతను,సర్వ
జ్ఞ... సాధకుండు=ఈశ్వరపూజనొనర్చు వాడునుసమస్తపండి
తులసత్కార్యముల నెరవేర్చువాడును,ద్రాక్ష చే=ద్రాక్షామ
ద్యము చేతను,శుభదరుద్రాక్ష చేత,కల్పిత...కంఠు=రచింపఁబ
డినమాధుర్యముగలవాఁడు, ఇచ్చట కంఠశబ్దమునకుకంఠ స్వర
మంచులక్షణ, "ద్రాక్షాద్రాక్ క్షారభావంభజతిసముచితం"
అనిసాహిత్యరత్నాకరమందువాక్కునకు ద్రాక్షామద్యమునకు
నుపమానము చెప్పఁబడెను,ద్రాక్షయంబోలె,కంఠస్వరముమ
ధురమని భావము.మాధుర్యశోభావహమగుననియర్థము, రు
ద్రాక్షధారియనిభావము, సర్వ...ద్ధరణుఁడు=సర్వవంశమును
ద్ధరించువాడు,సమస్తభూమినెత్తినవాడు(ఆదివరాహపక్షము)
దైవ...మహిమన్=దైవమగువరాహమూర్తిలీల, అదృష్టము
చేత శ్రేష్ఠములగు రోజులప్రభావము చేతననియుఁదోచుచున్న
ది, ఈయర్థమందు, వర—అహన్=వరాహఅని "రాజా
హస్సఖిభ్యష్టచ్" అను సూత్రము చేత,అకారాంతమయ్యెను.

౧౦॥సీ॥ మాలిన్యశూన్యమామహనీయకాచపాత్రలు నీటిపైబుద్బు
దములనంగ । కుడ్యమందునమర్చుకస్తూరి,పుత్రికలెల్లజలజం

తుధర్మంబు వెలువరింప। కుట్టిమంబున వెల్గునట్టి యాదీపంబు
నౌర్వాగ్నివిస్ఫూర్తిననుకరింప । పఱచినట్టితివాసిపలురం
గులుంగూడిమణిమరీచులతోడనైతిసలుప ॥ తే ॥ సితసు
ధాపుష్కరంబులఁజేసిమంట। పంబుక్షీరాబ్ధిశయనాభిపద్మ
గర్భవాసకమలాసనుని తేజఃప్రౌఢివలన । విష్ణుపదియఁబ
యస్సులువెలుపడిన।సంకుచితదుగ్ధవారిధిచాయఁదెగడ॥

ఈపద్యమందు కచ్చేరిచావడి, చిన్నయాకారము (size) లోని
కిఁదెచ్చిన పాలసముద్రముగా, ఉత్ప్రేక్షింపఁబడినది.

౧౦॥ కాచపాత్రలు = గులేబులు మొదలగువస్తువులు బుద్బుద
ములు = నీటిబుగ్గలు (అనగా చావడిగులేబులు సముద్రపు
నీటిబుగ్గలన్నట్టున్నవి,) కుడ్యమందు = గోడయందు, కూర్మి
పుత్రికలు = ప్రేమాస్పదమగు బొమ్మలు (సముద్రపక్షము
న) ఆడుతాబేటిముద్దుపిల్లలు (అనియుతోచుచున్నది), జలజం
తుధర్మంబు=నీటిజంతువులగుణమును“ లడయోరభేదాత్ ”
జడజంతుధర్మంబు (అనియుతోచుచున్నది) : ప్రాణములేని
జంతుగుణము, కుట్టిమంబు=చప్టానేల, సిత ... పుష్కరంబు
ల = తెల్లనగుగచ్చనెదుపాలను, ఆకాశమనునీటెని,ఇచ్చటసు
ధాపుష్కరశబ్దార్థములుశ్లిష్టరూపకములు, సంకుచిత...ధారి
త=చిన్నయాకృతిలోనికివచ్చినపాలసముద్రము (అనఁగాసము
ద్రశాయియగు విష్ణునాభిపద్మమందు బ్రహ్మయున్నాడుగావు
న అతనివాహనమగు హంస, నేర్పుచే వెలుపఱచిన నీరువలె
కచ్చేరి చావడి యాకాశమును, పాలవలె చావడిగచ్చునుఉ
న్నవియనిభావము.

౧౧॥ తే॥ అందునొక రేయిబుధులుతన్నాశ్రయింప।



...ప్రవిమలస...త్తితోఁగూరుచుండి।

శేషశయ్యనుడిగ్గిన శేషశాయి।
యనఁగఁ దేనియలాలఁగాననిమెనన్ను॥

౧౧॥ బుధులు = విద్వాంసులు, దేవతలును(శేషశాయిపక్షమున) అనఁగా దిందు శేషునివలెను, ఈయన శేషశాయివలెనుఉండె ననిభావము.

౧౨॥ మ ॥ చతురాస్యుండవు నాభిభూతుఁడవునీ చారిత్ర మెన్నంగ భారతి చేపట్టినవాడవంచునొక కార్యం బందుముదిరించుచుం। డితిశైవంబొక గ్రంథమందు మొదటన్ గీర్తించిమా వంశసం। తతియో వేంకరామపండితవరాధన్యంబుగాఁ జేయవె॥
ఈపద్యమందు కవికి బ్రహ్మసామ్యము ధ్వనించుచున్నది.

౧౨॥ చతురాస్యుండవు= నేర్పుపలుకులుగలవాఁడవు, ఆస్యశబ్దమందు వాక్కర్థమయినప్పుడు లక్షణ, యద్వా, ఆస్యేభవం=ఆస్యం = వాక్కు-శరీరావయవముగానయత్ప్రత్యయము రాఁగా, హలోయమామనుసూత్రమునయలోపము. నాలుగు మోములుగలవాడనియుదోచుచున్నది, నాభి ..ఎన్నంగ=నీచరితగణింపఁగా, అనింద్యుడవు (అనింద్యచరిత్రుఁడవుఅనిభావము) ఇచ్చటని షేధార్థకనశబ్దముతోనై కథా మొదలగురూపములందుఁబోలె, సహసుపా అనుసూత్రమున సమాసము. పొక్కిలియందుపుట్టినవాడవని యుదోచుచున్నది. (బ. ప) భారతి...వాడవు= సరస్వతిన్నీ చేపట్టినదనియర్థము, ఇచ్చట “కర్మాదులకుకర్తృత్వవివక్షయందు” అనుసూత్రము, సరస్వతి చెయిపట్టినవాడవనియు దోచుచున్నది- (పాణిగ్రహణముచేసికొనుట) ఒకకార్యంబందున్= ఒకపనిచెప్పె

దను, నీతోనని శేషపదము, ముద్రించుచుండితి=అచ్చు వేయిం
చుచుంటి, వంశ్యందిగాదిగాన యత్రప్రత్యయము. ధన్య. ధన
గణంలబ్ధా అనుసూత్రము- ఈశబ్దమునకిచ్చట కృతార్థతలా
క్షణికార్థము.

౧౩॥ మఱియునది సాత్త్వికబ్రహ్మవిద్యావిలసన నిరసనమను నా
మధేయంబునఁ గర్ణరసాయనంబై పరగుచుండు- ఈశ్వరప్ర
భావప్రతిపాదకంబులగు పెక్కుగ్రంథంబుల న్యంబులున్న
ను, పుణ్యక్షేత్రంబులలో వారాణశియుంబోలె నిదినామె
డఁ గరంబభీష్టతమంబు. కావుననీవలన నాగ్రంథామృతంబు
శ్రోత్రపేయంబు గావించుకొనవలతుననిన, సకలబ్రహ్మాండ
వ్యాపకుండైనను పరమేశ్వరునకుఁ గైలాసనివాసంబ నవర
తం బాశాస్యంబుగావున నదియట్టిదేకాని బ్రహ్మాదులకైన
ను వచింపనశక్యంబగు నాపురారాతి ప్రభావంబతిశయంబు
గావాక్రువ్వ నేనెంతవాఁడ. అయిననుజహ్నుకుమారికి నా
త్మీయ వారిపూరంబున నే యర్ఘ్యపాద్యంబు లొసంగునట్టు
లాభవానీపతికటాక్షవీక్షణ లబ్ధంబగువచః పుంజంబాతని పు
ణ్యచరిత్రనే వివరింపంజూచి వినియోగించుకొనియెద, మఱి
యు మదభీష్టంబొండుగలదు. తమయుల్లంబున వెల్లి విరియు
కరుణారసోల్లాసకల్లోలిని యస్మదృథాముఖీనమైసదావర్తి
ల్లం బ్రార్థించెదనని మహాప్రసాదంబంగీకరించి తదీయవంశ
కథోపోద్ఘాతంబునకుఁ గూటస్థునన్వేషింపనించుక కాలంబు
స్తిమితమీనంబగు హ్రదంబునుంబోలె నిమీలితనయనంబుల
నిశ్చలహృదయుండై ధ్యానించి సర్వలోకవిఖ్యాతయగు నా

సరస్వతీ వల్లభుని నభివర్ణింపఁ గల్గెనుగదా యని మనమున నువ్వి
ళ్లూరుచు నిట్లనఁ దొడంగితి.

౧౩॥ యథాముఖీన = ముఖప్రతిబింబదర్పణము- నాకభిముఖమై
యనియర్థము, యథాముఖసమ్ముఖస్య దర్శనః ఖః అని సూత్ర
ము, యథాముఖీనస్సీతాయాః పుప్లవే బహులోభయర్ణా అ
ని మారీచవర్ణనమందు భట్టి, హ్రదము = మడుగు.

౧౪॥ సీ॥ ఎనలేక తండ్రికి ద్వనుదొల్చికొని నచ్చఁ బొడిచెనెంతయు
మొట్టమొదట నెవఁడు। భూజనుల్ దాతనాఁ బొక్కిలిఁ బం
గారుపెట్టుక పుట్టెనే వేల్పు పెద్ద। నలుగడఁదలవాకిళుల శుద్ధి
సేయనై మవరాలు సెల్లునే దొరకు నెపుడు। తానాసఁ జేకొం
చుఁ దగు హంసవిడనాడ కాలోకగమనుఁడై యలరు నెవఁడు॥

౧౫॥ తే॥ అతని ముఖవర్ణమునఁ దత్తదంశలంది।
నందివాడాఖ్యవంశంబునందుఁ బుణ్య।
నరులు ముక్తాఫలంబులనంగఁ జాలి।
జననమొందిరి పెక్కండ్రు జనులు వొగడ॥

ఈపద్యమునందు బ్రహ్మను కూటస్థునిగా నెంచి యాతనిగుణ
ములు శ్లేషార్థములవల్ల ఈవంశస్థులకు సాధింపబడును.

౧౪॥ ఎన... మొట్టమొదట, విష్ణునాభిపద్మమందు పుట్టినవాడనుట
(తండ్రికినతి ప్రేమాస్పదుఁడని యానుదోచుచున్నది) ఇచ్చట
తండ్రిశబ్దము తల్లికికూడనుపలక్షణము, తాతయని దాతయని
రెండువిధములపదవిభాగము, తాత=బ్రహ్మ, దాత=త్యాగి
(రెండవయర్థము) పొక్కిలి...పుట్టెను, (హిరణ్యగర్భుఁడ
నుట) ఆగర్భశ్రీమంతుడని యాఁదోచుచున్నది) నలుగడతల

వాకిళులనే=నాల్గువైపులముఖములను, శుద్ధిసేయనే= పవిత్రముసేయుటకు, అయిదువరాలు = ముత్తైదువ(సరస్వతి) (తలవాకిళ్లుశుద్ధిసేసినప్పుడెల్ల నయిదువరాలగుననియు తోచుచున్నది) ఆసఁజేకొంచు=అభిలాషతో, తగు...గమనుఁడు=హంసవాహనమునువదలక, అల్లభువనసంచారి, తా, నాసఁజేకొంచు=ముక్కు-పట్టుకొని. హంస...ఆడక=శ్వాసవదలక, ఆలోకగమనుఁడు= పరబ్రహ్మను పొందినమనస్సు గలవాఁడు- "ఆలోకగ" అనుచోట "అన్యత్రాపిదృశ్యతే" అనడప్రత్యయము(సమాధిచే బ్రహ్మధ్యానము చేయువాఁడని యుఁదోఁచుచున్నది) అతనిముఖవర్ణమున = బ్రాహ్మణవర్ణమున "బ్రాహ్మణోస్యముఖమాసీత్" ॥ శ్రుతి,తత్తదంశలు= పూర్వోక్తములగు నయ్యాయాంశములను (తలిదండ్రుల కతి ప్రేమాస్పదత్వము, ఆగర్భశ్రీమత్త్వము, మహాభోగానుభవమును, బ్రహ్మధ్యానమును అనిభావము) వంశమునందు= కులమునందు, వెదురనియుధ్వనించుచున్నది, ముక్తాఫలంబులు=ముత్యములు, అనఁగావంశమునందు ముత్యములుపుట్టుటసహజమనితాత్పర్యము.

౧౬॥ తే॥ అట్టివంశంబుధర్మాత్మమమలగుణము।
చెన్నుమీఱంగదానసుశ్రీకపచుఁడు।
శరమువీరార్యుఁడుదయంబుగాంచిప్రబలె।
హతపరాక్రముఁడైలోకులఁబ్రమొంద॥

ఈపద్యమునశూరునకి, వీరన్నగారికిని, ఉపమానోపమేయత్వగావునరెండర్థములు.

౧౮॥ అమలగుణము = నిష్కళంకగుణములుగలది,(వంశపక్షము), మంచినారిగలది (ధనుఃపక్షము), ధర్మాత్మము=పుణ్యస్వరూపము, ధనూరూపము, వంశంబు = కులము, వెదురు, దాననే=ఆవంశమందు, అట్టిధనూరూపమగు వెదురుచేతను, సుశ్రీకవచుఁడు = సొంపగుపలుకులుగలవాఁడు, శేషాద్విభాషేతి కప్, నకపి,అనిహ్రస్వమురాదు, శోభావహమగుకవచముగలవాఁడు (శూ - ప), ఇచ్చటగంధసింధురమన్నట్టుశ్రీశబ్దమునకన్వయము, యద్వాపుల్లింగకవచశబ్దముతోబహువ్రీహియగుసు శ్రీశబ్దమున వీరార్యుఁడు=వీరన్నగారు, ఇచ్చట (వీరకన్వయము,అర్యుఁడు), శూరుఁడగుప్రభువు “ అర్యస్స్వామి వైశ్యయోః” అనిసూత్రము, ఉదయంబు=జన్మమును, వృద్ధిని(శూ - ప) హతపరాక్రముఁడు = కొట్టఁబడ్డవిక్రమముగలవాఁడు, హతశౌర్యుడుప్రబలుటయాశ్చర్యమనివిరోధము,కొట్టివేసిన పరులయక్రమములు గలవాఁడని యాభాసము.

౧౭॥ సీ॥ రాజమహేంద్రపురంబు భాగంబుననేఫస్టుకలెక్టరైప్రణుతిఁగాంచి। ప్రముఖుఁడౌ బెంజమీన్ బ్రాన్‌ఫిలుదొరగారుస్థితియుతుండైయాటితేటియున్న। గోపవర్ణముకన్నఁగొంచెపువర్ణంబులోజనించుటయాత్మలోనఁదలచి। యవతారవశవర్తివై తెల్ల। చాటినవిష్ణుదేవతనాఁగ వెలికిఁదోప॥

౧౮॥ తే॥ తాఁబ్రపంచముఖంబునఁదనరిభూతి।
సర్వమంగళాస్పదతలుచాలమెఱయ।
నమలసుప్రతీకాకృతినధివసించి।
ధరణిఁదేజరిల్లెశిరస్థచారుఁడనఁగ॥

౧౭॥ స్థితియుతుండు=ఉనికిచేస్థిరుఁడు (విష్ణుపక్షమునపరిపాలనచే నిర్ణీతుఁడనియు స్ఫురించుచున్నది), ప్రపంచముఖంబున=లోకముఖమందు (అనగాలోకమందు) ప్రకృష్టములయినయాయి దుముఖములచేతననియు ధ్వనించుచున్నది, భూతి ... స్పద తలు = ఐశ్వర్యమునకును, సమస్తకల్యాణములకును స్థానమగుట, అణిమాద్యష్టైశ్వర్యములకును, పార్వతికిని, స్థానమగుట (శివునిపక్షము), అమలసుప్రతీకాకృతి=సుందరావయవములుగలదేహమును, స్వచ్ఛమగుసుప్రతీకమను నేనుఁగుయొక్క దేహమును,(శి-ప), అధివసించి=ఎక్కి,(శి-ప) శిరస్థదారుఁడు=శిరసునందున్నభార్యగలవాఁడు, ఈశ్వరుడనిభావము.

తా॥ నామమాత్రమునకే కలెక్టరుగాని యీయన యేపరిపాలన చేసెనని భావము.

౧౮॥ తే॥ భోగిశేఖరుఁడైనతాముస్నకీనకుఁ।
బుడమిబ్రహ్మోత్తమునియర్చలెడపినట్టి।
రట్టుమాన్చుకయార్జించెఁబ్రబలయశము।
నవనిబ్రహ్మోత్తమార్చలనాచరించి॥

౧౮॥ భోగిశేఖరుఁడు=భోగవంతులలోశ్రేష్ఠుఁడు, సర్పములుశిరోభూషణముగాగల, ఈశ్వరుఁడనిస్ఫురించుచున్నది, బ్రహ్మోత్తమునియర్చలు, ఇచ్చట, ఉత్, తమః=ఉత్తమాఃఅనిసాంతమమీద తత్సమము, అజ్ఞానవంతుఁడైన బ్రహ్మపూజలు, ఈశ్వరస్వరూపముసూచి రాఁజాలుదుమనివిష్ణువును, బ్రహ్మయుశపథముసేసి మూలమును, విష్ణువును, శిరస్సును బ్రహ్మయు పరిశీలింపఁజెర కాల్లముగ మనము సేసితాను సమర్థులు

కారైరి, విష్ణువుయథార్థముగా నామహేశ్వరుని యెదుట, తనయసమర్థతను, మనవిసేసెను, బ్రహ్మజూచితి ననియస త్యమాడఁగా, భూమియందు బ్రహ్మకుఁ బూజార్హతలేకపో గాక యనిశపించెనన్న పురాణగాథయిచ్చట స్మరింపఁద గ్గది, అసత్యముపలికినాడుగాన, అజ్ఞానవంతుఁడనికవితాత్ప ర్యము, బ్రహ్మోత్తమార్చలు = బ్రాహ్మణశ్రేష్ఠులపూజలు, మిక్కిలిబ్రాహ్మణపూజయొనర్చెనని భావము.

౧౯॥ క॥ వెరవరితనమ్మునఁగలె।
క్కరుగాఁదగిమొగలితొట్టుఖండమ్మునఁదా।
స్థిరుఁడై సామ్యూల్సికిన్న।
ద్దొరగారాపైనఁగొన్నిరోజులపిదపన్॥

౨౦॥ క॥ గురుతమహిమవంతుఁడునా।
సరసులచేశ్లాఘ్యుఁడౌచుస్వయముగనాస।
ద్వరుఁదనదుహితమనంచా।
దరమునవరియింపఁబిల్చెఁదనతావునకున్॥

ఈపద్యమందు దొరగారుతనయొద్దకువీరన్నగారి నిశిరస్థదా రుగా పిలిపించుకొనుటయు, హిమవంతుడు కన్యాదానార్థ ము ఈశ్వరుని పిలుచుటయు రెండర్థములు స్ఫురించును.

౨౦॥ గురుతన్ = గౌరవముతో, మహిమవంతుఁడునాన్ = ప్రభావ ముగలవాఁడనునట్టు, రెండవయర్థమందు, గురుతమహిమవం తుఁడు అని ఏకపదము = గొప్పవాడగుహిమవంతుఁడనునట్టు, సరసులచేఁ = రసికులచేత, చెలువులచేతను (రెం) ఆసద్వ రున్ = అల్లసత్పురుషశ్రేష్ఠుఁడగువీరన్నగారిని, ఆయోగ్యుఁడగు

పెండ్లికుమారుని, తనదుహితమనంబు = తనుయిష్టపడిన మనస్సు, తనకొమా ర్తెమనస్సు(రెం - అ).

౨౧॥ చ॥ మనుగుడుపాది గాఁగలుగు మాన్యపుఁగార్యములొప్పుచున్నచో। దినములుగొన్ని వేడ్కఁగడ తేర్చుచుఁ బూర్వపుఁజెల్మి రాజరా।జనగరిమండలాధికృతిశాలమునందుశిరస్థదారుఁడై। ఘనతవహించిమించెనలకాపురమెన్నడువీడకుండుచున్॥

ఈపద్యమందునుబూర్వసందర్భముగా రెండర్థములుస్ఫురించును.

౨౧॥ మనుగుడుపు=భూమియొక్క-అనుభవము. ఈయనచ్చటశిరస్థదారుగానున్నప్పుడు సుభిక్షముగానున్నదనుట, క్రొత్తల్లుఁడత్తవారియింటఁ జేయుభోగము అనియు తోచుచున్నది, మాన్యపుఁగార్యములు=పాలములపనులు, పూజ్యమగుపనులు (రెం - వ) పూర్వపుఁజెల్మిక=వెనుక రాజనరేంద్రపురమునపనిచేసినమక్కువతో, బాల్యస్నేహమున, అర్థాంతరము, (కుబేరునకు నీశ్వరునకు స్నేహము ప్రసిద్ధము), రాజరాజనగరిగా = రాజరాజ నరేంద్రపట్టణమందు, నామైకదేశేనామగ్రహణమ్మను సూత్రమున నిచ్చటనీయర్థము, కుబేరునిపట్టణమందనియు నర్థాంతరము, మండలాధికృతిశాలమునందు=జిల్లాకోర్టునందు, “ ఆజ్ఞప్తోస్మి అధికరణభోజకైః, ” అనిమృచ్ఛకటికయందు వ్యవహారమంటపమును అధికరణమనిచెప్పెను, అధికరణం=విచారాలయః అనివ్యాఖ్య, అధికృతి శాలమన్నచోఁగూడఁ బదద్వయ సమభివ్యాహారమందు, ఆయర్థము వాచ్యమగును, “ విభాషాసేనాసురా[illegible] శాలాశ

బ్దమునపుంసకము, భూమండలమందునధికవుణ్యాత్ముని యిం
టను, ప్రకరణముంబట్టి (కుబేరునియింటననితోఁచుచున్నది);
శిరస్థదారుఁడు=ఆయధికారముగలవాఁడు, శిరసునగంగను
ధరించినయీశ్వరుఁడు. అలకాపురము=అల్లరాజనరేంద్రపు
రమందు కాపురము, అలకాపట్టణమును,

౨౨॥ క॥ సకలోత్తమాంగుఁడాతం।
డకుటిలచిత్తుండుభద్రమాంబికవల్లన్।
బ్రకటితవైభవుగురురా।
జకుమారున్శక్తిధరునిసౌమ్యునిగాంచెన్॥

౨౨॥ సకలోత్తమాంగుఁడు=సమస్తమగు మేలయిన యవయవము
లుగలవాఁడు, (శివునిపక్షమునందు) చంద్రకళతోఁగూడినశిర
సుగలవాఁడు, భద్రమాంబికవల్లన్=భద్రమ్మవల్లను, (భద్ర
మ్మయనుపార్వతియందని యాస్ఫురించుచున్నది) గురురాజ
కుమారున్=గురురాజనుపుత్రుని, గురురాజనుకుమారస్వామి
ననియాస్ఫురించుచున్నది, శక్తిధరుని=సమర్థుని, శక్తియను
నాయుధమునుధరించినవానిని, (కుమారస్వామిపక్షమున,)
సౌమ్యుని=శాంతుని, సోమపుత్రుడనఁబోవువానిని(కు,ప,)
ఇచ్చట "వటుముపనయేత్" అనునట్లుసంధర్భించు కొన
వలెను.

౨౩॥ క॥ ఆతఁడాత్మోపయనునా।
శ్రుతిపండితకోటికెల్లఘురియింపంగా।
పితృకాలంబుననేసం।
తతమునసింహాసనస్థదారుండనుచున్॥

౨౪॥ చ॥ కరకరిఁ దానుదాతయొకకంటనెయర్థిలిఁ జూచునాకలె। క్కరులభుజద్వయంబయనఁగా । దగికాలమఁకొంతయే గసం । భరమునమండలాధికృతి మంటపమందు శిరస్థ దారుఁడై । నరులశుభంబులారయదినంబులుగొన్నియు నేఁగఁబిమ్మటన్॥

౨౪॥ ఒకకంటనె=సమానదృష్టినే.

౨౫॥ మ॥ కరమెలూరనుమండలంపుమున సద్ధానిశ్చితుండైనయో। ద్ధరణంబేర్పడఁగొన్నియేళ్లమరఁజేయఁజూచితర్వాతశం। కరపాదాంబుజచింతనైకపరుఁడై కాలంబునెల్లంజరా। మరణాతీతయశశ్శరీరమును సంపాదించెసర్వంసహా॥

౨౬॥ సీ॥ బలిమిహేలాపురీ ప్రముఖశైవక్షేత్రముల నాత్మభక్తి విస్ఫూర్తినెగడ । మహనీయరుద్రాక్షమంటపంబులు పేర్మిస్థాపించెఁగీర్తిపుంజంబుతోడ । లలితరుద్రాక్షకల్యాణమంటపయోగ్య మలరీతినందివాహనముతోడ । స్వామికింబెదపాటి సోమేశ్వరునకెంతో యతిభక్తితోను పహారమిచ్చె॥

౨౭॥ తే॥ మఱియుఁబుణ్యహేలాపురీమణినివాసు। డైనజ్వాలాపహారీశునంఘ్రియొద్ద। నందివాహనమర్పించినప్రముఁడైన। యతనిజన్మంబుగొనియాడనలవియగునె॥

౨౭॥ హేలాపురి=ఏలూరు, అలరీతినందవాహనము=ప్రసిద్ధమైన యుత్తడినందివాహనము, ఉపహారము—కానుక.

౨౮॥వ॥సత్త్వప్రకృతులైలక్ష్మీభవానీయువరాజ్ఞులనందగిభాసిల్లురా ణ్యలక్ష్మమ్మల్లమాంబానామధేయాత్మీయవధూటులందు.

౨౮॥సత్వప్రకృతులు=సత్వగుణస్వభావముగలవారు,శుద్ధసత్వప్ర ధానయను ప్రకృతివంటివారనియానర్థాంతరము, ఇందునవా రికినెక్కుడుజ్ఞానవతీత్వమును, భర్తకునీశ్వరోపమానమును ధ్వనించుచున్నది, యువరాజ్ఞులన్నచో రాజ్ఞీశబ్దముతోయు వతీశబ్దమునకుసమాసముగానటచ్ ప్రత్యయమురాదు,శ్రీమా తాశ్రీమహారాజ్ఞీయన్నచోటువలెనూహించుకోఁదగ్గది - వ ధూటి=యౌవనవిశిష్టురాలు.

౨౯॥ తే॥ అష్టలోకపాలాంశలనైనవాఁడు।
గాననతనికిబుద్ధులకల్మిదిశల।
నేలఁజాలినవెరవులనెఱిఁగినట్టి।
యష్టపుత్రులుపుత్రీద్వయమ్ము వ్రేడమ॥

అష్టాభిర్లోకపాలానాం। మాత్రాభిర్నిర్మితోనృపః అను శాస్త్రము॥

సుబ్రాజుగారు దిక్పాలకాంశనుబుట్టినందువనే, దిక్కుల నేల జాలినకుమారులనుగనెననిభావము.

౩౦॥ ఆ॥ రాజ్యలక్ష్మినాఁగరంజిల్లునలభార్య।
కడుపునంజనించుకొడుకులెల్ల।
పూర్ణమూర్తిపుణ్యపుంజంబులోనాఁగ।
శ్రౌత్రలౌకికత్వశాలియశులు॥

౩౦॥ శ్రౌత్ర...యశులు=శ్రోత్రియత,లౌకికత్వములచే బ్రకాశిం చుకీర్తిగలవారు, శ్రోత్రియశబ్దమునకు, “హాయనాంతయు వాదిభ్యోఞ్జే, అనుసూత్రమున, అణ్ప్రత్యయమురాఁగా,

శ్లో॥ శ్రోత్రియస్యయపలోపశ్చ అసియలోపము, లోకఃప్రయోజనమస్యలౌకికః, ప్రయోజనమితిఠక్॥

వ॥ కులమహీధరాయమానులగు సకుమారులందఱిలో,

౩౧॥ సీ॥ ఆనందవనముఖ్యయాత్రాసుకృతి సత్యమూర్తియౌ భైరవమూర్తిమంత్రి । నిర్మలజ్ఞానధునీగాహిచిత్తుండు మల్లిఖార్జుననామమంత్రివరుఁడు । ఆత్మస్వరూపుఁడౌ నాత్మీయజనకుసత్యజ్ఞానములునాఁగ నలరుచుండ । అచ్ఛిన్నమాతదీయానందరాజీసముద్రమౌమఱివీరభద్రమంత్రి॥

౩౨॥ తే॥ మహిమవాటిల్లసంపదమహినటించి।
సమ్మదంబునఁబుత్రరత్నమ్ముఁబడసి।
బ్రహ్మమందుస్వరూపసంబంధముననుІ
లీనుఁడయ్యెనుదానసమానవృత్తి॥

౩౧॥ టీ॥ సత్యము, బ్రహ్మజ్ఞానము, ఆనందము, క్రమముగాసహజధర్మములుగాఁగల, భైరవమూర్తి, మల్లిఖార్జున, వీరభద్రమంత్రులను, పరమాత్మస్వరూపుఁడౌ తమతండ్రియొక్క సత్యజ్ఞానానందములనుగాను ఉత్ప్రేక్షించుచున్నాఁడు - ఆనందవనముఖ్య= కాశి రామేశ్వరముమొదలగు, అలరుచుండ=ప్రకాశించుచుండ, జీవించుచుండఁగాననిభావము బ్రహ్మమందు...వృత్తి=పరమాత్మలోనైక్యమయ్యెననిభావము, ఇతనినిబ్రహ్మానందమునకు,పోల్చుటచేదోషరహితుడనిస్పష్టముగుచున్నది.

౩౩॥ మ॥ ప్రథితుండాతనిపుత్రసత్తముఁడుసుబ్రహ్మణ్యాసన్మంత్రిసత్తమపుణ్యాత్మపురాణమాధవమహాత్మద్వంద్వసంద

శ్రీయన్ । వ్యథమానాత్ములతోడు నీడజనకుండానం
దరూపాత్ము యు । నల్పార్థకల్పస్మిత శీలశాలితమహాం
కంబౌచువగ్గిల్లెడున్॥

33॥ సుబ్రహ్మణ్య మంత్రికి నైసర్గికమైన చెలునవ్వును, "ఆత్మా
వైపుత్రనామాసి" అనుశ్రుతిచిత్తమున స్మరించి, ఆత్మానం
దస్వరూపుండైన తండ్రియానందాంశ సంబంధమైనట్టు తేప్రి
క్షించుచున్నాడు, సత్పథసంచారి = సన్మార్గవర్తి। రామలిం
గ...సందర్శి = రామేశ్వరయాత్రచేసెననియర్థము, వ్యథ
మాన...నీడ=భీతాత్ములకుసహాయుఁడు, అల్ప...శాలిత=
కొద్దిగానవ్వుటకుహేతువైనస్వభావముతో ప్రకాశించుటచే.
మహాంకంబు=గొప్పగుఱుత్తు.

34॥ సీ॥ పూర్వోక్త భైరవమూర్తిసన్మంత్రిగర్భాబ్ధ్య మణీసుంద
రాంబపుత్రి । చెలుకువాడాన్వయసింధురాకాకైర వాప్తుం
డురాజత్కళాస్వాంతుడు। దేవభూదేవభక్తిపరుండునైనసీతా
రామమంత్రికిందరుణియగుచు । రామేశ్వరాదియాత్రలుదా
నుభర్తయున్ సల్పిరోహిణినానెసంగుచుండి॥

35॥ తే॥ యార్యమోగాధికశ్రీమహార్యమహితు।
మంగళాప్తనిగవిబుధమహిమదాయు।
నాకలితసమబుద్ధిసుధాకరోక్తి।
భర్తసేవించుచుండునప్పరమసాధ్వి॥

36॥ టీ॥ ఈకారాంతమణీ శబ్దంబునుగలదు, సురరాజమణీశ్యా
మస్థిరావరసుతావతిః అని సాహిత్యరత్నాకరము, కళా=
విద్య, చంద్రకళ, ఆర్య=పెద్దలు, బృహస్పతియును, పెద్దల

సహవాసముగలవాడని తాత్పర్యము, గురుసంబంధము చంద్రునికిశుభమనిజ్యోతిశ్శాస్త్రము, మహార్యమహితున్ = గొప్పరాజులచేపూజితుడు, అర్యమ, హితున్ = సూర్యునికిమిత్రుని, మంగళాప్తున్=శుభప్రదమిత్రులుగలవాని, కుజునకు మిత్రుని, కవిబుధమహిమదాయున్=కవీశ్వరులకు పండితులకు పూజనిచ్చువానిని అనిభావము, శుక్రబుధులకు ప్రభావమునిచ్చువానిని,"చంద్రగ్రహేణసహితౌ,బుధశుక్రౌగురూపవమౌ"అని జ్యోతిశ్శాస్త్రము, ఆకలితసమబుద్ధిన్=ఒప్పునట్టిసమబుద్ధిగలవానిని, చంద్రునకు శత్రుగ్రహములు లేరనిజ్యోతిశ్శాస్త్రము, సుధాకరోక్తిన్=అమృతమునకు స్థానమగుపలుకులుగలవానిని, సుధాకరుడని శబ్దముకలవానిననియు దోచుచున్నది.

౩౬॥ వ॥ మఱియు భ్రమరాంబానామధేయయగు మల్లిఖార్జునమంత్రికుమారీ రత్నంబు.

౩౭॥ తే॥ కాశికాముఖతీర్థముల్ గనియావీర।
లక్ష్మీదేవ్యంబమఱిధవళగిరినిల్పి।
నట్టిసత్రముజరుపుచునమలకీర్తి।
వడయునామెకుఁగోడలైవఱలుచుండి॥

౩౮॥ ఈదృశపుత్రులుపౌత్రులు।
శ్రీదౌహిత్రులుసమృద్ధిఁజెన్నారమనో।
మోదతరంగితమైగం।
గోదంచితరాజ్యలక్ష్మియున్విలసిల్లున్॥

౩౯॥ ఆ॥ రత్నగర్భనాఁగఁబ్రథనెమ్మిఁగాంచిన।
యల్లపెద్దభార్యమల్లమాంబ।
ప్రీతిమీఱఁగఁగన్నపీరలక్ష్మీదేవి।
సుబ్బరాయమంత్రిసుగుణతంత్రి॥

౩౯॥ టీ ॥ నెమ్మిన్=శాంతముచె, రత్నగర్భనాఁగన్ = భూమిదేవియనునట్టు రత్నములవంటి సంతతిగనియెనుగాన సుఖముగా రత్నగర్భయని కీర్తిసంపాదించెననియు దోఁచుచున్నది. సుగుణతంత్రి=సుగుణపరివారముగలవాఁడు.

౪౦ ॥ వ॥ వారిరువును లక్ష్మీకువలయాప్తుల లీలదినదిన ప్రవర్థమానులగుచుండనంతఁ గొంతకాలంబునకునక్కమారికృత్తివెంట్యన్వయాలంకారియు, నచ్యుతగుణుండునగు సుబ్బరాయామాత్యునకీఁబడినదై.

౪౦॥ అచ్యుతగుణుండు=నిర్దోషగుణములుగలవాఁడు, విష్ణుమూర్తియొక్క వర్తనవంటి వర్తనగలవాఁడనియు దోఁచుచున్నది.

౪౧॥ ఆ॥ దేహళీప్రదత్తదీపంబుభాతిని।
బుట్టినిల్లుమఱియుమెట్టినిల్లు।
లలితసౌవసుకరలక్షణంబులనామె।
మేరమీఱునట్టుమెఱయజేసె॥

౪౧॥ దేహళీ—దీపంబు = గడపనందుంచబడనదివ్వె, లలిత...లక్షణంబులన్=సుందరమయినట్టియు, తనయొక్కఅనాయాసలభ్యమగుగుణములచే, స్వశబ్దముమీద శైషికాణ్ణురాగా “ద్వారాదీనాంచ” అనుసూత్రమున, ఐజాగమప్రాప్తిచె, సౌవ, అనురూపము,యద్వా,సువసుకరలక్షణములె సౌవసుకరలక్షణ

ములు=యోగ్యమయినట్టియు, భాగ్యకరములగు లక్షణముల చేత, యోగ్యమగు కాంతిగల కిరణములను చిహ్నములచేత, (దీ - ప).

తా॥ గడపమీదనుంచిన దీపములోపల వెలుపల వెలుఁగిచ్చినట్టు, జన్మించినకులము, అత్తవారికులము ప్రకాశింపఁ జేసెనని భావము.

౪౨॥ వ॥ మఱియు.

౪౩॥ శా॥ వేదోక్తవ్రతశీలఖ్యాతవిలసద్విజ్ఞానయావీరల।
త్రీమ్మ దేవ్యంబప్రయాగముఖ్యసుకృతక్షేత్రాటనాఖండపు।
ణ్యాదానంబెసఁగంగశ్రీధవళిగిర్యాఖ్యంబురిన్ సత్రమా।
మోదింపన్ జనులెల్లనిల్పిజగముంబూరించుకీర్తింగనెన్॥

టీ॥ పుణ్యాదానంబు=పుణ్యప్రాప్తి,

౪౪॥ తే॥ భూమిలోన శేషశ్రీలుపొదలుచుండఁ।
బ్రబలిపొగడొందునాసుబ్బరాయమంత్రి।
అబ్ధిమేఖలదేవిఁగైసేసెఁదనదు।
కీర్తికఁచుకమాకల్పపూర్తిసేయ॥

ఈపద్యమందు "సుబ్బరాయుడుగారు" అను నామధేయము నుబట్టి, శేషునిపరముగా రెండవయర్థము స్ఫురించును.

౪౪॥ అశేషశ్రీలు=సమస్తసంపదలు, రెండవయర్థమందు, భూమిలోనన్, శేషశ్రీలు అని పదవిభాగము, శేషునిశోభలు, కీర్తికంచుకము=యశస్సనురవిక, ఇదికట్టువస్త్రమునకుఁగూడనుపలక్షణము, ఆకల్ప=వేష

౪౫॥ క॥ కలినిఁక్ వలపించినుణం।
బులరాజన రేంద్రనామపురమందుసుమం।
గలమండలధర్మసభా।
స్థలిహెడ్డసిస్టెంట్సెరస్థదారుండగుచున్॥

౪౬॥ శా॥ నిద్దంబౌసభయందునీనగరి నేనేటిబ్ రిజెస్ట్రారుగా।
సుద్దండంబగుశక్తిఁజూపిసమహోద్యోగంబుభాసిల్లనా।
పెద్దాపూరమలాపురప్రభృతిసీవృన్మండలక్షోణులన్।
ఖద్దిందోషములెల్లచోట్లమునసబ్గానుండిఖండించుచున్॥

౪౭॥ మ॥ తనచంద్రోపమకీర్తితోడవెలయిందన్మండలంబెల్లహా।
యనముల్కొన్నిగతింపఁగా సదరమీనాభిఖ్యుఁడై యొప్పుచో।
జనులెల్లంబొగడంగఁజేల్చెశ్రుతులన్ సంతోషనీరాకరం।
బునఁదాఁబుణ్యజనాత్మహారియగుచున్మూర్తిప్రభావంబునన్॥

౪౭॥ టీక॥ సదరమీనాభిఖ్యుఁడై = సదరమీననెడిపేరుగలవాఁడై, బిరుదుకలవాఁడై,యఃఫలితార్థము, దరశబ్దమునకుశంఖముఅర్థము, ఇదిచక్రమునకుఁగూడనుపలక్షణము, అభిఖ్య=శోభ,శంఖచక్రములతోగూడిన మత్స్యావతారవిష్ణువుశోభవంటిశోభగలవాఁడై యనియు నర్థాంతరము, శ్రుతుల్ = కర్ణములను, వేదములను అర్థాంతరము, పుణ్యజనాత్మహారి= రాక్షసదేహమునశింపఁజేసినవాఁడు(సోమకాసురుని) పుణ్యాత్ములకు మనోహరుఁడు.

౪౮॥ మ॥ ప్రణతస్వాంతులకాత్మరూపధరుఁ డారామేశ్వరస్వామిపావనపాదాంబుజముల్ గనంగలిగి సుబ్రహ్మణ్యదే

వ్రప్రతి । ష్ఠనుశ్రీరాజనరేంద్రపట్టణమునఁ సంధించిపు
జ్ఞైష్యకమూ। ర్తినినాగ్గించినయాతఁడీజగతి వర్ణింపంగ
సామాన్యుఁడే॥

౪౮ ॥ టీక ॥ "దద" అనునది, దదాతిదధాత్యోర్విభాషా అను
సూత్రమునశప్రత్యయాంతరూపము.

౪౯ ॥ ఉ ॥ అంబుజపత్రసన్నిభదృగంచితపేరమదేపిపూర్ణమో।దం
బమరందదీయసహధర్మిణియై శ్రుతిపేయసచ్చరి । త్రం
బునుసంగ్రహించివసుధన్మనుచుండనతండుపద్మనా।భాం
బను జేకొనెఁ కడుసుతార్థితరూపవతింద్వితీయఁగాన్ ॥

౪౯ ॥ టీక ॥ కడుసుతార్థితన్=అధికమగుపుత్రవాంఛతో, అనఁగా
జ్యేష్ఠభార్యయగుపేరమ్మగారికి సంతతి లేదనుట,రూప
వతిన్, ఇదియత్రాకృతి స్తత్రగుణాయనుటంజేసి సుగు
ణవతీత్వమునకుఁగూడనుపలక్షణము.

౫౦॥ తే॥ గురుశుచితగంగమించునత్తరుణియందు।
నతఁడుగుణరత్ననిధిసముద్రాధికారి।
కూర్మిమీఱఁగఁగాంచెనుకువలయాప్తు।
మధురలక్షణుఁ బేర్రాజమంత్రిచంద్రు॥

౫౦॥ టీ॥ గురుశుచి=గొప్పపవిత్రత, తగంగఁ=ఒప్పఁగా, గురు
శుచితన్=గొప్పపవిత్రతచే, గంగ = భాగీరథిని అని
యుఁదోఁచుచున్నది,సముద్రాధికారి= ముద్రతోఁగూడిన
యధికారముగలవాఁడు, నకర్మధారయాన్మత్వర్థీయ
యనునిషేధము... "కృష్ణసర్పవాన్ వల్మీకః" అనుభా

ష్యప్రయోగముం జేసి, కవులును, శాస్త్రవ్యాఖ్యాతలు
ను బాహుళ్యముగాఁ బ్రయోగించుచున్నారు, "కోకప్రీతి
చకోరపారణపటుజ్యోతిష్మతీలోచనే" అనిమురారి, లా
దేశేషు వాసరూపవిధిర్నాస్తి అను పరిభాషావ్యాఖ్య
లో "ఆదేశకృతవైరూప్యవత్సులాదేశేషు సనాస్తీత్యర్థః"
అని నాగేశభట్టారకుడు "ఏకదేశినైధి, కరణె" అని పా
ణినియును, సముద్రాధికారి=సముద్రునకు మనోవ్యథను
చేయువాఁడు అనియు నర్థాంతరము, కృఞో హేత్వితిటప్ర
త్యయమును, వాసరూపన్యాయమునఁ తాచ్ఛీల్యణినిప్ర
త్యయము బాధించెను, సముద్రుని మించినవాఁడని భావము,
యద్వా, సముద్ర ఇవ అధికురుతే సముద్రాధికారీ, సము
ద్రుఁడువలె సర్వోత్కృష్టుఁడైనవాఁడు, "కర్తర్యుపమా
నే" అను సూత్రమువఁణిని ప్రత్యయము, కూర్మి=ప్రేమ,
భూమియందలితరంగము (అర్థాంతరము) కువలయా
ప్తుక్=భూమండలమునకు నాప్తుని, కలువలకు మిత్రుని, (చం
ద్రపరార్థము) మధురలక్షణుక్=సుగుణవంతుని, చూడఁ,
దగినకళంకముగలవానిని, (చంద్రపరార్థము) "మలినమ
పిహిమాంశోర్లక్ష్మలక్ష్మీం తనోతి" అని శాకుంతలమం
దుఁ గాళిదాసు కళంకమును, చంద్రునికి శోభాకరముగాఁ
జెప్పెను.

౫౧॥ సీ॥ అతనికి శౌర్య హైన్యమెమందుఁ డాఁడు చోనుదుపుఁ డచ్చట
గూడనుడువు లేల। సురుకవుల్ క్రమముగాఁ గోణమందుం
డు చోనాత్మభాగ్యసమృద్ధి యడుగ నేల। విగ్రహంబునఁ

జాలవెన్కఁజలోనుండి కుజగతితప్పుచోఁగొఱత లేల।
సహబుధుండినుఁడెంతో స్వగృహంబు సూచుచోఁబ్రజ్ఞా
ర్థవైభవాభావమేల॥

౨౭॥ తే॥ ఇందుమందిరముదయంబునొందజనన।
మందియాకారగుణములన్యోన్యమమర।
ఘనతసర్వజనాహ్లాదకంబునను చు।
ధరణిఁబేర్రాజమంత్రిరత్నంబుతనరు॥

ఈపద్యమందు పేర్రాజమంత్రిశౌర్యాదిసమృద్ధివర్ణించుచోఁజాతకయోగపరముగా నర్థాంతరముదోఁచును.

౨౮॥ శౌర్యహైన్యము=శౌర్యగుణమునకులోపము, శౌర్యస్థానమగు దశమభావమునకు లోపము, "వీర్యస్థానంచసత్కర్మభావోయందశమస్మృతః" అని జ్యోతిశ్శాస్త్రము, మందుఁడు=మూర్ఖుఁడు, శనియును, ఆడుచోన్=పలుకఁగా, సంచరింపఁగా; ఉడుపుఁడు=చాలింపుఁడీ; జనులనుగూర్చి చెప్పుచున్నాఁడు; సందర్భానుసారముగా నుడువులుకర్మ; చంద్రుఁడును అర్థాంతరము; అచ్చటఁగూడన్—ఆశౌర్యవిషయమైకూడ, నిస్సందేహవిషయమని భావము; ఆశౌర్యస్థానమైన దశమమందు; కూడన్=కలిసియుండగా; మందుఁడాడుచోనతనికి శౌర్యహైన్యమె; అచ్చటఁగూడ నుడువులేల; ఉడుపుఁడు; అని మొదటియర్థమందన్వయక్రమము; సందేహములేనివిషయములో; ఎవఁడైన మూర్ఖుఁడు, అతఁడు శౌర్యవంతుఁడు గాడనిపలికి నంతమాత్రమున; నతనిశౌర్యగుణమునకు లోపములేదని భావము, శని సంచరించుచున్నపుడు అచ్చటనే యాశని

తో చంద్రుఁడుఁ కలిసి యుండఁగా, నాశౌర్యభావమునకు లోపము లేదని భావము; దశమమందు శనిచంద్రసమాగమము శౌర్యార్జిత మహాభాగ్యాదులకుఁ గారణమని జ్యోతిశ్శాస్త్రిము, ప్రమాణములు గ్రంథవిస్తర భయమువలన వ్రాయఁబడవు, గురుకవులు=బృహస్పతిశుక్రులు, గొప్పకవులును (అర్థాంతరము); క్రమము...దుండుచో = పంచమనవమముల యందుండఁగా ననియర్థము, పార్శ్వమందుండఁగానని (యర్థాంతరము), ఆత్మభాగ్య...పల=ఎంతోభాగ్యసమృద్ధియుండకపోయినయెడల, కవులు పార్శ్వములందుండరని భావము, ఆత్మభాగ్యసంజ్ఞలుగల పంచమనవమములు శుభారూఢములైనందున, ఆభావములసమృద్ధికి సందేహము లేదని భావము; విగ్రహంబునన్ = విరోధమందు, శరీరస్థానమందును, చాలవెనుకంజలోనుండి; చాల=సందేహించి, వక్రించియనియును, వక్రగ్రహము బలీయమని జ్యోతిశ్శాస్త్రిము, కుజగతి=దుష్టలోకము, దుర్మార్గులనుట, కుజగ్రహ సంచారమును, తగ్గుచోన్ = మరలుచుండఁగా, భూమిదరికి రాఁగా, నీచనుబొందగానని భావము, యద్వా, బహురుహనోత్పతి తాతు వక్రాయనుటచే, వక్రగ్రహముయొక్క లిప్తాదిగతితక్కువగానుండుననియాఁజెప్పవచ్చును, కర్కాటకలగ్నమై యక్కడఁ గుజుఁడుండి, దశమమందుశనిచంద్రులుండుటవల్లనీచభంగరాజయోగముగ లైనని భావము, సహబుధుండు = పండితులతోఁగూడునట్టి, ఇది ప్రభువునకు సహజధర్మవర్ణన, బుధగ్రహంబుతోఁ గూడినట్టియు, ఇనుఁడు=ప్రభువు సూర్యుఁడును,

స్వగృహంబుసూచుచో = తనయింటికివచ్చిచూచుచుండఁ
గా, అనఁగా రాజులుదర్శనము తనయింటికేవచ్చి యిచ్చు
చుండఁగా, అతని ప్రజ్ఞాధనసంపదలకుఁగ నక్కఱలేదని భా
వము, తనయిల్లగు సింహము చూచుచుండఁగానని యర్థాంత
రము; కుంభమందు రవిబుధు లున్నారనుట, ద్వితీయాధిప
తియైన సూర్యుఁడు; ప్రజ్ఞాధనకారకుఁడైన బుధునితో గలిసి
తనభావమును జూచుటవల్ల, ఆభావమునకుఁ బ్రాబల్యమని
తాత్పర్యము, ఇందు, మందిరము=ఇహలోకమందు, గృహ
ము, అర్థాంతరమందు ఇందుమందిరమని యేకపదము, కర్క
టకక్షేత్రము, ఉదయంబు = వృద్ధిని, లగ్నమును, అనఁగాక
ర్కటకలగ్నము కాఁగానని భావము, సప్తగ్రహమతంబున
రాహుకేతువులు చెప్పబడలేదు, ఆకార...అమరఁగా, "య
త్రాకృతిస్తత్రగుణాః" అనుశాస్త్రముచొప్పున పరస్పరము
శోభింపగా.

౨౩॥ తే॥ పుడమియడుగంటునాకులభూధరములు।
స్థైర్యగుణముననతనికి సాటురావు।
స్వీయపక్షవిరోధియై చెలగునట్టి।
వజ్రమతనికిభూషగాఁబరిణమించు॥

౨౩॥ టీ॥ పుడమి...భూధరములు=భూమియడుగుననున్న యల్లకు
లపర్వతములు, కృంగినట్టియు, వ్యాకులమగు పర్వతము
లనియుఁ దోఁచుచున్నది, స్వీయపక్షవిరోధి = తమపక్ష
ములను [illegible] శత్రువైనట్టియును,

వజ్రము=రవ, వజ్రాయుధమును, భూషగాన్=అలంకారముగా, ధైర్యశాలియు, వజ్రఘటితాలంకారములుధరించుననియు భావము.

౫౪॥ సీ॥ రాజమహేంద్రపురంబునన్ డిస్ట్రిక్టుమునసబుకోర్టులో ముందుగాను ప్లీడరైమిక్కిలి పేరొందినికాకినాడసబార్డినేటుకోర్టునసమకట్టి। యచటనీయుద్యోగమందునే ప్రబలింపకలకటర్ జేహెూవుగారుపిలిచి । కోరికహెడ్మెజస్టీరియల్ మున్షిగాఁదనయొద్దనుంచంగఁదనరుచుండె॥

౫౫॥ తే॥ తనరిపీఠికాపురముపెద్దాపురంబు।
తునితణుకుయర్నగూడెమ్ముఁదొట్టిపెక్క।
గ్రామములఁదహశీల్ దారుగావసించి।
వర్ధమానేందుభాతిఁదాఁబ్రబలియిపుడు॥

౫౬॥ మ॥ తనపెద్దల్మునుసర్వభూతియశముల్ స్థాపించినచ్చోటరా । జనరేంద్రోత్తమునన్నపాదికవులున్ శ్లాఘించినచ్చోటము। క్తినిదానంబగుకోటిలింగమహియుక్తింజెందినచ్చోటఁజ। ల్లనిపేరాజిసుధాకరుండుతహశీల్దారౌచువర్ధిల్లెడున్॥

తా॥ ఆపద్యమందలి వర్ణన వల్లయీగ్రంథ నేతృనకుఁగూడకీర్తియు, కవి, శ్లాఘయు, పుణ్యార్జనయు సిద్ధించుచుండుటకు శంకలేదని భావము.

౫౭॥ స్రగ్ధర ॥ వృత్తం ॥ ధరఁబేరాజాభిధామాత్యవరుఁడు తహశీల్దారుగానుండదుర్గా । గ్రతస్వాంతపరిచర్యల్ ఖలజనవితతుల్ గర్వ[illegible] । [illegible]చార్యంబుల్ దొలంగన్

గుహకమహాములుంగూట సాక్ష్యంబుమాయున్ । చరితానిం
ద్యంబులౌ తజ్జనపదజనముల్ సాంద్రమానంద మొందుర్॥

౫౭॥ టీ॥ కుహకమహాములు=కపటులయుత్సవములు, చరితానిం
ద్యంబులు=అనింద్యచరిత్రిగలిగినట్టియనియర్థము,

౫౮॥ శా॥ పారంపర్యమఖండమై యెసఁగసుబ్బారాయ విశ్వేశ్వ
ర॥శ్రీ రామేశ్వర నారసింహసుతులన్ శ్రీపద్మనాభాంబఁబు।
శ్రీరత్నమ్మతఁడేపుర్ శిశులఁ శ్రీలింగాంచె శ్రీ చెల్లమాం।
బా రామామణియందుమూర్తసుకృతభ్రాంతిప్రదాకారులన్॥

౫౮॥ టీ॥ పారంపర్యము, వంశావళి, మూర్త ... ఆకారులన్=
మూర్తిమత్తగు పుణ్యముల 'భ్రమనిచ్చుచున్న యాకా
రములుగలవాడు,

౫౯॥ తే॥ అట్టిపుత్రులు రాజవిద్యాదులందు।
బహుళనైపుణమేర్పడఁబరిఢవిల్లి।
సంతతిపరంపరాగతైశ్వర్యములను।
బెంపునొందుచుదన్నుసేవింత్రుగాక॥

౬౦॥ వ॥ మఱియానతండీవిధమునఁబాలకుఁడలిముద్దుపట్టియగునా
కలుములజవరాలు తనరూపరేఖాదులకుపలచిచుట్టుచు
ట్టునఁదిరుగుచుండి బహువిశ్వాసముతోనున్నను, సర్వ
లోకపాలకుండును, చతుర్ముఖజనకుండును, అశేషసం
పదగలవాఁడునగువిష్ణువంతవానినోటను పాలముంచిన
నీవేనీటముంచిన నీవేయని యాశపించి తానొనర్చినట్టెల్ల
నతనిసమ్మతించి ప్రీతిపత్తిరవనొప్పించుకొన్న భాని

క్షీరాకరంబను నామమాత్రినమధురంబగు తనపుట్టినింట
శేషసంపదను వలపించికన్నుగప్పుచో నావ్యామోహంబుఁ
దప్పించుకొనఁగా నల్లశంబరారాతి జనకునకుఁగూడనిజ
ముగానవతారమంతయుఘటమగుచున్నదని లేనిపోనివి
యామెయందునెంచిరియో, లేకసచ్చిదానందమూర్తియు,
నసంగుఁడు నగు నాపరమేశ్వరుండు, అర్ధనారీశ్వరత
యు, అష్టైశ్వర్యసంపన్నతయు. స్మరహరతయు, మ
హాతపస్వితయు, మొదలగుపరస్పరవ్యధికరణధర్మంబు
లఁ దనయందు సామానాధికరణ్యంబుఁ జేసికొనియుం
డుటకుఁ గతంబేమియని పరిశీలించి యాకిశోర చంద్ర
శేఖరుండు భక్తోద్ధరణ పరాయణుండు గావున తనసే
వకుల విద్యావశగులు గాకుండఁదాను నిదర్శనంబుగాఁ
దలఁచిజనకుడు పుత్రులకుంబల్రెగ్రంథిభిదాకుశలత నభ్య
సింపజేయనిట్లుండెనని మూలముట్టుగాఁదనమనస్సునకు
సమన్వయించుకొనియో. భోగాదులననుభవించుచుండి
యు, బాహ్యాభ్యంతరంబులగురాగవిరాగంబులనంటియు
నంటనియట్లుండుచుండి దేవదేవుండగు నామహాదేవుని
యందే తనహృదయగ్రంథి సడాలగింపజేయుచుండుట
యేకాక యనేకవారంబులు కాశీగయాది పుణ్యతీర్థా
టనంబులొనర్చె నందుగొన్నిటినభివర్ణించెద.

౭౦॥ టీ॥ పాలముంచిన... భాతి=క్షీరశాయిత్వమునుబట్టియిట్లా
రోపింపఁబడియె, నామమాత్రన=నామముచేత నెమధుర
మగునపుడు, అనుభవించుటకుఁ జప్పవలసిన దేమని పేరు

నకేకాని, అనుభవములోవట్టిదనియుఁదోచుచున్నది, శేషసంపదకు=శేషశయ్యాసంపత్తికి, పుట్టినింటివారు, అనుభవింపగా మిగిలినభాగ్యమునకుననియు దోచుచున్నది, కనుగవ్పుచో=నిద్రలేఁగా మోసపుచ్చుచోననియు ధ్వని, శంబరారాతిజనకునకుఁగూడ = మాయకునాదికారణమగుశంబరాసురునిశత్రువు (మన్మథుఁడు) తండ్రియగువిష్ణువునకును, మాయాజయమందు నెక్కువ ప్రజ్ఞగలవాఁడనిభావము, అవతారము=దుర్లభమనియు దోచుచున్నది, లేనిపోనివి=నేరములు, తనయందు నేవిధముగు వ్యామోహము కల్పింపనియప్పుడే యనుట, విష్ణువుయొక్క క్షీరశయనావతారాదులకు లక్ష్మీవ్యామోహము కారణము గాదుగాన నిజముగా లేనిపోనివియని భావము, గ్రంథిభిదా=భోగాదుల ననుభవించుచుండియు వ్యామోహములేకుండి పరమార్థమందు బుద్ధినిలుపుట, "నద్వేష్టిసంప్రవృత్తాని। ననివృత్తానికాంక్షతి। ఉదాసీనవదాసీనఇతిగ్రంథిభిదోచ్యతే ॥ అని వేదాంతపంచదశి, హృదయగ్రంథి=మనోముద్ర, నియతమగుమనస్సు, లక్ష్మీకటాక్షము సంపూర్ణముగాని తనకినున్నను, ఐశ్వర్యవ్యామోహమునంజేసి పరమార్థకాలక్షేపమునుమానకయాంతర్యంబున నీశ్వరప్రార్థన సేయుచు, పుణ్యతీర్థాంటనము మాటిమాటికిఁజేయుచుండుననిభావము, లోకములో నానాన్యులకు లక్ష్మీవ్యామోహము, అనుభవసిద్ధమే,

౬౧॥ సీ॥ ఇరుమాఱుకాశికాపురయాత్రసేవించివిశ్వనాథునివానో
వీథిఁగొలిచి । వారద్వయమ్ము యోధ్యాధామదర్శింప
నామహాక్షేత్రమందడుగుపెట్టి। దరిసేరిశివరాత్రిదక్షిణ
తారకుఁ రామలింగస్వామిఁబ్రణుతిసేసి। జనకప్రతిష్ఠి
తాభినుత సుబ్రహ్మణ్యదీపోత్సవంబు వర్ధిల్లుచుండ॥

౬౨॥ తే॥ వలయుకేదారమును సర్వవాహనమ్ము । నిచ్చినుతి
యునుభద్రాచలేశురాము । నాత్మఁగొలిచిసాలగ్రా
మహారమిచ్చి । ధన్యుఁడైనట్టియతఁడుసామాన్యుఁడెట్టు॥

౬౧॥ టీ॥ దక్షిణతారకుఁ= భారతవర్షముయొక్క దక్షిణతీరము
గలవానిని, దక్షచ్ఛబ్దేభ్యస్త్రీశబ్దస్యతారభావోవా అనితీర
శబ్దమునకుతారాదేశము, ఉపకరించునట్టి, తారకమం
త్రముగలవానిననియు, దక్షిణంయథాతథాసంసారసము
ద్రంతారయతీతి దక్షిణతారకః, సంసారసముద్రమును
నేర్పుగాదాటించువానిననియుఁ జెప్పవచ్చును, కేదా
రము=పొలము.

## షష్ఠ్యంతములు.

౬౩॥ క॥ ఏవంవిధగుణఖనికిన్ । జైవాతృకశేఖరోపచారార్జితల।
క్ష్మీవీక్షాజనికిన్ సం । భావితశర్వోత్తమాంగమండనధు
నికిన్ ॥

౬౩॥ టీ॥ జైవాతృక...జనికిన్=ఈశ్వరపూజచేత సంపాదింపఁ
బడ్డలక్ష్మీకటాక్షోత్పత్తిగలవానికిని, సంభావిత...ధుని
కిన్=[illegible]గలవానికి.

౬౮॥ క॥ భీగత్యభిశుక్రునకున్ । భోగానుభవప్రభావభూశకునిన కున్ । ధీగతసర్వాతీతా। నాగతసీవృన్మహాక్రియాచక్రునకున్.

౬౮॥ టీ ॥ భీగత్యభిశుక్రునకున్ = భయసంచారమునకు ఎదురుచుక్కైనవానికి, భయము,ఇతనివైపునకు రాలేదనుట, ధీగత...చక్రునకున్ = బుద్ధినిపొందినభూత, భవిష్యత్తులను,తాలుకాగ్రామముల గొప్పకార్యములసమూహముగలవానికి, తాలూకాలోభూత, భవిష్యత్కార్యములుకన్నులకు గట్టినట్టుఉండుననిభావము.

౬౯॥ క॥ కుహనాపటుదుర్మానస । గహనాంతర్మర్మభేదిఘనహుంకృతికిన్ । మహదైశ్వర్యప్రదపుణ్యహరార్చాబద్ధమానసాహంకృతికిన్.

౬౯॥ టీ। కుహనా... హుంకృతికిన్ = కపటమందుసమర్థులైనవారియొక్క, యడవివంటిచెడుమనస్సులోని మర్మము భేదించుగొప్పహుంకారముగలవానికి, హుంకారమాత్రమున వారిచెడుపన్నుగడలు భేదిల్లుననిభావము,మహద... హంకృతికిన్=మహద= ఐశ్వర్యఅనిపదవిభాగము, ఉత్సవముచేయునైశ్వర్యమునిచ్చునట్టియు పుణ్యప్రదముగుశివపూజనువీడని మనస్సుయొక్క యభిమానముగలవానికి,(శివపూజను రెండుమార్లువర్ణించుట శివపూజయందు సెకుడవ యభిమానముగలవాడని తోచుటకు;జానడ త్రాదమునకు ... త్యముచేయు, ఆశకగలవారు జ

న్మాంతరభేదమునుగీకరించి సార్థకముసేయవచ్చును పూర్వజన్మశివపూజచేసినప్పుడు ఐశ్వర్యముకలిగెననియొకదానిభావము, ఇప్పుడుగూడశివపూజాధురంధరుఁడని రెండవదానిభావము. )

౬౬॥ క॥ సురధరణీధరశోభా। గరిమప్రతివాదిభూతకాయోన్నతికిన్।పరివృతభీవినయపుర । స్సరసంవాదానుజీవిసంహతినతికిన్.

౬౬॥ టీ ॥ సుర . . . ఉన్నతికిన్=సువర్ణకాంతిచేమేరుపర్వతమునుమించినదేహముగలవాఁడనియు ఆజానుబాహువనియుభావము, పరివృత . . . నతికిన్ =చుట్టునుఁడి, భయభక్తిపూర్వకముగా పలుకునట్టి నౌకరులసమూహముయొక్క జోహారులుగలవాఁడు, నౌకరులుభయభక్తులతో నమస్కరింతురనిభావము.

౬౭॥ క॥ ప్రణయోపాస్యప్రతిభా।గణబాలవ్యోమమణికిఁగవికులచింతా । మణికింబేరాజగ్రా। మణికింబూజితసుధాంశుమౌళిరమణికిన్.

౬౭॥ టీ ॥ ప్రణయ . . . మణికిన్=స్నేహముతో నారాధింపఁదగిన ప్రభాసమూహముచేబాలసూర్యునివంటివానికి, బాలసూర్యునివలె స్నేహముచే, సేవింపఁదగినవాడనుట, పూజిత . . . రమణికిన్= పూజింపఁబడుచున్న పార్వతిగలవానికి, "పూజిత" అనుచో, "మతిబుద్ధిపూజార్థేభ్యశ్చ" అనుసూత్రమున వర్తమానార్థమం దుక్తప్రత్యయము,

ఇది శ్రీమేఘసందేశాంధ్రీకరణ చాతురీధౌరేయ సరస్వతీ స్తనంధయవిధేయ శ్రీకల్లూర్యన్వయ మండలగంగాసాగరాయమానకామసోమదేవీ, వేంకటశాస్త్రిగర్భ చంద్రాయిత వేంకటరామనామధేయప్రణీతంబగు టీకాసహిత వంశముక్తావళి,

౬౮॥ వ॥ అభ్యుదయ పరంపరాభివృద్ధిగా నాశీర్వచించి నేవిశిపింపంబూనిన సాత్త్వికబ్రహ్మవిద్యావిలసన నీరసనంబను మాహేశ్వర గ్రంథశిరోమణికిం బ్రారంభంబెట్టిదనిన.



శ్రీగురుభ్యోనమః.

## సాత్త్వికబ్రహ్మవిద్యావిలాసనిరసనము.

✻ పరమేశ్వరాదిదేవతాస్తుతి. ✻

శ్రీకంఠో గ్రముమాసహాయము త్రినేత్ర స్ఫారమత్యంతశాం। తాకారంబుసమస్తసాక్షిజగదంతర్యామిలింగోద్భవా । ఖ్యాకబ్రి హ్మముబ్రహ్మమాధవపరీక్షాతీతమూర్ధాంఘ్రియ । స్మాకీనో రుమనోరథప్రతతినిచ్చుంగూచుఁగాకెప్పుడున్॥ ✻ ✻

స్రగ్ధర॥ షట్త్రియ్యాంగాదివిద్యాచయదురధిగత స్వప్రభా వాబ్ధిఫేన । త్షట్త్రింశత్తత్త్వపాళీజనురవన తిరస్కారదక్షున్ బుధు క్షా । తృట్త్రీనాసాజరాంతాదివికృతరహితున్ దేవినస్మత్ప్రబంధ। ద్విట్తారిసారిష్టదాత్రిన్ త్రిణయనరమణి న్వేడ్కభావింతునాత్మన్॥

స్రగ్ధర॥ ప్రణుతింతున్మత్ప్రబంధప్రకటమృదుతరగ్రంథసందర్భ సంధు । క్షుణసిధ్యర్థంబుపిష్నక్షుపణచణ చమత్కార కార్యాగ్ర గణ్యున్ । గణనాథున్ భక్తగేహాంగణగణిత లసత్కల్పకల్పాభిర మ్యున్ । క్షణదానాథార్ధభాగోత్కటమకుటధరుం జారుసావ ర్ణవర్ణున్॥ ✻ ✻ ✻ ✻

సీ॥ పరుషవాదివిరించిపంచమవదనంబు చిదిమెనెవ్వఁడునఖ శిఖరమునను।వడిన దైవం శేనవాత్పరము మొత్తవ్యస్తం బెవ్వఁ

డడ్డకట్టె। మదపంచజనపంచవదనాభిగర్వనిర్వాపణక్రియ నెవ్వఁడే
పుచూపె। దక్షాధ్వరధ్వంసనక్షాంతి నెవ్వాఁడు త్రుంచివైచెనుశివ
ద్రోహిసురల। నట్టిపరమేశ్వరాజ్ఞాపహారకాను। శాసనోగ్రభై
రవనందిశరభవీర। భద్రులనుభద్రమూర్తులఁబ్రణుతిసేతు। మతకృ
తగ్రంథపరిపంథిమథనకృతికిㅤ॥ ౧॥ ❊ ❊ ❊

సీ॥ ధరఁజతుర్వేదతాత్పర్యసంగ్రహకర్త హరదత్తనాచార్యవ
రుదలంచి।పరమశివాద్వైతపరనీలకంఠాఖ్య ఘనభాష్యకారుశ్రీకం
ఠుఁబొగడి। కాళహస్తివిలాసఘనతరగ్రంథాఢ్య శ్రీకాళహస్తిదీ
క్షితునిమెచ్చి। శ్రౌతలింగవివేకరాద్ధాంతసంధాతనాగదేవునిసూ
క్తినయములెంచి। మేదినిశివార్క-మణిదీపికాదిబహుళశైవశాస్త్ర
నిర్మాణకర్మావధాన। దక్షుసాక్షాచ్ఛివాష్టమతనువనంగ। వెల
యునప్పయదీక్షితవిభునుతింతుㅤ॥ ౨॥ ❊ ❊ ❊

సీ॥ పరవాదిజీమూతపవనోగ్రమూర్తులఁబండితారాధ్యులఁబ్రస్తు
తించి। బసవరాజీయాఖ్యభాష్యకారునిఁబాలకురికిసోమారాధ్యగు
రునిఁగొలిచి। శైవరత్నాకరశాస్త్రసంయోజనదక్షుజ్యోతిర్నాథుఁ
దలచిమ్రొక్కి। వీరమాహేశ్వరాచారసంగ్రహకర్తఘనునీలకంఠ
నాగన్నఁబొగడి। మరియువీరమాహేశ్వరమతసముద్ధ। రణరణాం
గణోదగ్రశాత్రవమతోక్తి। ఖండనోదరక్రియాశక్తియుక్తశాస్త్రశ
స్త్రి। శైవవిద్వద్భటశ్రేణిసన్నుతించి॥ క॥ పినపాటిలింగగురునో,
పినపాటినుతింతువిమతభీకరమతినీ। యనపాటిశైవులేరీ। యనపా
టితశిష్యదురితుఁడైనమహాత్మున్ ॥ సీ॥ బొందితోకైలాసమునకునే

గ్రంథముపుట్టినగ్రామము.

గినయట్టి పాలంకవిశ్వేశవంశజుండు। సకలమహామంత్రషట్కర్మ
దక్షుఁడాసోమనాథునిపుత్రిసూనుసుతుఁడు। నెమహాగ్రిష్టోమయా

గాదిక ర్తయగు నాగనాథాత్మజనందనుండు । సాక్షాదఘోరేశసా
హ్యావతారమగు పర్వతారాధ్యరాట్ప్రథమసుతుండు। మరియుఁగా
ప్పనాగన్నమల్లనలకు। భాగినేయ భాష్యయాయ్యగుర్వనలజనకుఁ।
కటమాపతి యివ్వటూర్యన్వయుండు । గుర్వమాంబాత్మజుండు
రగురువరుండు ॥ శా ॥ లోకారాధ్యనిరూఢనామభిరుదశ్లోకప్ర
గారావనాస్తోకప్రాభవు నివ్వటూరికులపాథోధీశ భేశున్నృపానీక
పాత్తహయేభ గోకనకమాణిక్యాగ్రహారాదిరమ్యైశ్వర్యదలం
సమద్గురునివీరారాధ్యచూడామణిన్॥ సీ॥ లింగోద్భవాజస్రరంగ
త్సవకర్తసంగీతసాహిత్యచణమనీషు । పరదారసోదరప్రథితో
భిరుదాంకుశరణాగతత్రాణకరణధుర్యు । నిరతాన్నదానసంతృ
ప్తాఖిలాతిథి బంధురక్షణకళా బంధురాత్ము। సత్యవాదాదిమసా
త్యభామసమానుసత్యధీశార్చనాసక్తియుక్తు। చందవోలీపురీస్వా
మ్యసంపదాఢ్యు । మాచిరాజాన్వయోద్వహ మాచిరాజనందను
పెద్దనామాత్యనాథుసంభృ । తాస్మదీయమోక్షక్షేమునభినుతిం
తున్ ॥ మ ॥ వమితోచ్ఛిష్టపదానుభూత్యప హృతస్వాన్యాంతర
జ్ఞానతత్త్వమతాలకక్షతకర్కశతరక్షుద్రప్రలాపంబులా।గ
మతన్మాత్రతదర్థబోధకసుధీకంఠీరవంబుల్మదిన్ । సముపేక్షింతు
రుగాస్వతంత్రపరతంత్రస్ఫారపారీణతన్ ॥ క ॥ ఇష్టసురనతియు
నిగతి । శిష్టకవిప్రార్థనంబు శ్రీగురునుతియున్ । దుష్టనిరాకృతి
యునువి । స్పష్టముగా జేసిసత్ప్రబంధచికీర్షన్॥ సీ॥ కలహించి
బ్రహ్మచ్యుతులుశంభులింగంబురూపంబుగానలేరేపురమున । సిద్ధ
లైరిజగత్ప్రసిద్ధిగా సనకసనందనప్రముఖులేనగరమునను। తపము
చేమెప్పించిత్రిపురారిసఖుఁడయ్యెశ్రీదుండునేపుటభేదనమున । జై
లగిబౌద్ధులజయించి ... నవండితారాధ్యులేపట్టణమున।

యద్బ్రహ్మణోరూపంస్సున్మాయాసంప్రవర్తితా। అన్యాచ
త్వాత్వా సంస్థాపయతి మేజగత్ । భూత్వా నారాయణోనంగో
న్నాథోజగన్మయః । తృతీయానుహతీశక్తిర్నిహంతీసకలంరా
తామాసీమేసమాఖ్యాతా కోపాద్రుద్రాఖ్యరూపిణీ । అన్నపు
గ్యపంచమాధ్యాయము. తమసా కాలరుద్రాఖ్యం రజసాకృ
డజం । సత్వేనసర్వగంవిష్ణుం । నిర్గుణత్వేమహేశ్వరం
త్యపురాణము, ‘‘సతస్మాదధికంకించిత్తత్వంతద్విద్ధిశాంకరం
వమూర్తయస్తిస్రో బ్రహ్మవిష్ణుహరాభిదాః’’। అనుశాసన
‘‘సఏషభగవాన్రుద్రఃసర్వతత్వాదిరవ్యయః।సోసృజద్దక్షిణాద
ద్బ్రహ్మాణంలోకసంభవం। వామపార్శ్వాత్తథావిష్ణుం లో
ర్థమీశ్వరః । హృదయాత్కాలరుద్రాఖ్యం సర్వసంహారక
కం’’ । అని, శ్రీవిష్ణుపురాణము. తతఃకాలాగ్నిరుద్రో సాభూ
సర్వహరోహరిః। శేషాహిశ్వాససంభూతః పాతాళాసిదప
థ। అని, బ్రహ్మోత్తరఖండము. యస్యాంశాత్త్వామసోజ
రుద్రః కాలాగ్నిసంజ్ఞికః । అని, అష్టమస్కంధ సప్తమాధ
మందు, ‘‘విషసంహారావసరేప్రజాపతయః। ‘‘త్వమేవసర్వ
ఈశ్వరోబంధమోక్షయోః । తంత్వామర్చంతిసకలాః
తిహారంగురుం। గుణమయ్యాస్వశక్త్యాచసర్గస్థిత్యంతయో
ధత్సేయయాసదృగ్భవః । బ్రహ్మవిష్ణుశివాభిధాం। అ
న్నిస్పష్టముగా ఆదిత్యపురాణషట్పంచాశదధ్యాయము
హారుద్రంప్రతినందికేశ్వరవచనము. ‘‘నరకాణామధోభాగే
యత్తత్ప్రతిష్ఠితం। దశకోటిప్రవిస్తీర్ణం కామదంశుభం
యస్యోర్ధ్వంలంబం కోటియోజనమానతః । జ్వా

బాకులందివ్యంసర్వలోకభయంకరం। ప్రాకారాట్టాలకైర్యుక్తం
గోపురైస్తోరణైర్యుతం । రక్తనీలసమాభాభై ర్భీమఘోరైర్దుర
రాసదైః।ద్రుతంరుద్రసహస్రైస్తు సింహరూపైర్మహాబలైః।తస్మిన్
పురేస్థితోయాసౌ రుద్రఃకాలాగ్నిసంజ్ఞికః। నియమ్యశస్యకం తెజః
ప్రీత్యర్థం తేధునాగతః। ధౌతచామీకరాభాస శ్చందనాగరుగం
ధయుక్ । నీలకంఠస్త్రినేత్రశ్చ వృషకేతుర్మహాబలః। ద్వీపిచర్మ
పరీధానః పంచవక్త్రేందుభూషణః । అనంతమేఖలాధారీ కుండ
లీకృతతక్షకః। దశబాహుర్మహాతేజాః పీనవక్షామహాహనుః। ప్రి
యాదధినిర్ఘోషో రక్తనీలమహాతనుః। ఆగతఃసౌమ్యరూపేణ
వదేవసమీపతః। పశ్యైతంమృదుభావేన దేవదేవజగత్పతే।అని
నుక విష్ణుపురాణమందున్న తామసరుద్రుడు సాత్వికరుద్రుడు
అని రెండుప్రకారములుగలరని తెలిపెను. ప్రథమాంశాష్టమా
ధ్యాయము. “కథితస్తామసస్సర్గో బ్రహ్మణస్తేమహామునే।రుద్ర
సర్గంచవక్ష్యామి తంమేనిగదితంశృణు” అని పూర్వాధ్యాయ
మందు,తస్యక్రోధసముద్భూతఇత్యాది, “సముత్పన్నస్తథారుద్రో
మధ్యాహ్నార్కసమప్రభః” అని తామసరుద్రసర్గము చెప్పినాడు
గనుక, కథితస్తామసస్సర్గఃఅనెను. తంరుద్రసర్గంవక్ష్యామి।
అనగా అందుకంటే విలక్షణమైన సాత్వికరుద్రసర్గము చెప్పెన
నుట. ఆలాగే శ్రీధరాచార్యులటీక. పూర్వత్తామసాద్రుద్రస
ర్గాదన్యోయంకుమారసర్గాంతర్భూతఃసాత్వికోరుద్రసర్గఃత
మిమంశృణ్వితిసంబంధః । ఆలాగే తృతీయస్కంధైకాదశాధ్యా
యము. “ఇత్యాదిష్టస్సగురుణాభగవాన్నీలలోహితః। సత్వాకృతి
స్వభావేన ససర్జాత్మసమాఃప్రజాః।రుద్రాణాంరుద్రసృష్టానాం

సమంతాద్గ్రసతాంజగత్ ।నిశమ్యసంఘశో యాధం ప్రజాపతి
త।అలంప్రజాభిఃసృష్టాభి రీదృశీభిస్సురో త్తమ। మయాసహద
భిర్దిశశ్చక్షుభిరుల్బణైః'' ।అని నీలలోహిత రుద్రునికి సత్వగు
జెప్పెను. అదిగనుక యిక్కడ నవతరించినక్రోధజనితుడైన
రుద్రుడు తామసుడు. బ్రహ్మప్రార్థనచేతనవతరించి అష్టమూ
దాక్షాయణిని వివాహమైన నీలలోహితరుద్రుడు సాత్వికు
పరమశివుడైన మహారుద్రుడు త్రిగుణాతీతుడు. ఆలాగే,శ్రు
"అఘోరేభ్యోథఘోరేభ్యో ఘోరఘోరతరేభ్యః'' ।అని అఘో
రేభ్యః అనగా శాంతములైన స్వాతిక రూపములనుట, ఘో
భ్యః అనగా భయంకరములైన రాజ సరూపములనుట, ఘోరే
ఘోరతరేభ్యః, అనగా మిక్కిలి ఉగ్రములైన తామస ర్వ
ములనుట,ఈలాగె ద్వాదశస్కంధము మార్కండేయః, "స్వాం
శివాయసత్వాయశర్వాయప్రాకృతాయచ । రజోజుషేధ తా
రాయ నమస్తుభ్యం తమోజుషే । అని, గనుక నమ్యేవే యి
ణాభిమానులైన బ్రహ్మ విష్ణు రుద్రులు ముగురున్నగాక న
గోవాడు శివుడని మాండూక్యోపనిషత్తు చెప్పెను."ఏకాత్మ
త్యయసారం శివంశాంతమద్వైతం చతుర్థం మన్యంతే''
మూర్తిత్రయమునకు కారణమైనశివుడు గుణత్రయాతీతుడ
కతామసుడుకాడు, తదుక్త తత్ప్రతిపాదకాగమ పురాణా
న్నుతామసములు గావు,ఇవెకావు సకలశ్రుతి స్మృత్యాదు
ప్రమాణములె, యమస్మృతి, "వేదాః ప్రమాణం స్మృతయః
మాణం ధర్మార్థయుక్తం వచనం ప్రమాణం । యస్యప్రమాణం
నభవేత్ప్రమాణం కస్తస్యకుర్యాద్వచనం ప్రమాణం'' ఋషి
న్నుమోహశాస్త్రకారులుగారు, విష్ణుపురాణము, సప్తర్షి
ధమనవః ప్రజానాం పతయస్తథా । సదాచారస్య వక్తారః
రశ్చమహత్తమాః । అనిగనుకనే విజ్ఞానేశ్వర మిశ్రు

శ్రౌతస్మార్త వ్యాఖ్యానకారులు యీతామససాదివ్యపదేశమంగీ
కరించి పురాణాదులందు గ్రాహ్యాగ్రాహ్య చింత చేసినవారు
గారు, సకల పురాణాదివచనములున్ను సాధారణముగానే అం
గీకరించినారు, అదిగనుక పురాణాదులకు సాత్త్వికత్వాదివ్యప
దేశమభిమాన మాత్రముగా తెలిసికొనదగినది, అయితే శ్రుత్యా
దివచనములకు పరస్పరవిరోధము ఘటించినప్పుడు ప్రామాణ్యా
ప్రామాణ్యనిర్ణయ మేలాగున నిర్వహింపవలెనంటే, స్మృతిక
ర్తలే తెలిపినారు, లోకాక్షిస్మృతి, "శ్రుతిస్మృతివిరోధేతుశ్రు
తిరేవగరీయసీ। అవిరోధేసదాకార్యం స్మార్తం వైదికవత్తథా।
స్మృతేర్వేదవిరోధేన పరిత్యాగోవిధీయతే। తథైవలౌకికంవా
క్యంస్మృతిబాధాంపరిత్యజేత్" బృహస్పతిస్మరణ, "వేదాదుపనిష
ద్ధత్వాత్ప్రామాణ్యం నమనోస్మృతం। మన్వర్థవిపరీతాతుయా
స్మృతిస్సానశస్యతే। యీలాగే పూర్వమీమాంస యందున్ను,
విరోధేత్వనపేక్ష్యం స్యాదసతిహ్యనుమానకం। అనంగా శ్రుతి
స్మృతి విరోధము గలుగుచుండగా వక్తృప్రామాణ్యము నపే
క్షించనటువంటి వేదవాక్యము ప్రమాణము, వేదవిరోధము లేకు
న్నట్టాయెనా మూలశ్రుత్యనురూపకమైన స్మృతివాక్యము ప్ర
మాణమనుట. అదిగాక తామసత్వాది హేతువులు గల్పించి
పురాణములు దూషింపరాదనే చెప్పివున్నది. విష్ణుస్మృతి, పురా
ణంమానవోధర్మస్సాంగో వేదశ్చికిత్సితం। ఆజ్ఞాసిద్ధానిచత్వారిన
హంతవ్యానిహేతుభిః। ఇంతమాత్రమేకాదు, హేతువులుగల్పిం
చిదూషించినందుకు ప్రత్యవాయమున్ను చెప్పివున్నది. మనుస్మృ
తి, యోవమన్యేత తేమూభే హేతు శాస్త్రాశ్రయోద్విజః। ససా

ధుభిర్బహిష్కార్యోనాస్తికో వెదనిందకః । యమః, పత్తై ప్రణీతాని ధర్మశాస్త్రాణివైపురా । తాన్యేతాని ప్రమా... నహంతవ్యాని హేతుభిః । యస్తాని హేతుభిర్హన్యాత్... తమసిమజ్జతి ॥ ... ... ...

ఇతి, శ్రీమత్సనాతనసాధునాతన వీరశైవపాశుపతగణసంస్మ సౌరభసంవాసితచేతస్సమాహిత శ్రీమదివటూరివీరభద్ర గురుభద్రపాదారవిందవందనానందమకరందబిందుకం దళిత శ్రీమద్గురులింగోద్భవభజనధురీణతాపరిణతా ప్రతిమప్రతిభావైభవధౌరేయబుద్ధిరాజయ్యనప్ర ధానతనూభవపేరయనామధేయసూరిప్రణీ తంబైన, స్వాత్వికబ్రహ్మవిద్యావిలాసనిర సనసమాఖ్యగ్రంథంబునందు తామస త్వనిరసనంబను ప్రథమప్రకరణము

స మా ప్త ము.



శ్రీశివాయనమః.

—(*)—

## బ్రహ్మత్వసంగ్రహనిరసనము.

శ్రీమంతునాద్యనక్షరు । సోముబరబ్రహ్మనంత శూన్యుని
సృష్టిస్థేమాత్యయవర్తనకే । లీమహితాత్ముందలంతు లింగోద్భ
వుని॥ ... ... ... ... (*)

తర్వాత బ్రహ్మత్వప్రతిపాదనము చేసికొన్నారేమనిన ఈలా
ని గుణత్రయవిభేదమాత్రమేనా బ్రహ్మత్వలక్షణమునకు విశేష
ర్మములుకలవాఅంటే, కలవు. బ్రహ్మప్రతిపాదక సాత్త్వికశా
స్త్రములకు గుణముకలదేకదా తత్ప్రతిపాదితవస్తువేకదా సగుణ
గుణబ్రహ్మము సగుణప్రతిపాదకమైనప్పుడు సత్వమున్ను నిర్గు
ణప్రతిపాదకమైనప్పుడు హేయగుణరహితశుద్ధసత్వమున్నుగదా
ప్రతిపాద్యము. త్రైగుణ్యవిషయా వేదాః । అన్నారుగనుక అనిన్ని
ఇదిగాక వైదికకర్మాద్యంతములందున్ను వేదాంద్యంతములందున్నే
దేవతప్రతిపాదింపబడుచున్నదో, బ్రహ్మరుద్రాదిచేతనాత్మక జగ
త్సృష్టిస్థితిలయములకు కర్తయెవ్వడో అడడేబ్రహ్మగావలయును.
అందుకు వైదికకర్మానకు మొదలు సంకల్పము దానికి మొదలు,
శ్రీగోవిందగోవింద శ్రీమహావిష్ణోరాజ్ఞయా అని చెప్పవలయునుగనుక
ను, వేదము, "అంభస్యపారేభువనస్యమధ్యే" అనిన్ని, "శ్రీభ
గవతోమహాపురుషస్య శ్రీమదాదినారాయణస్య అచింత్యామితశ
క్త్యాభ్రామ్యమాణస్యమహాజలౌఘమధ్యేషు" అనిన్ని, ఆతర్వాత

కరాయణవివిక్తస్థఇదం ప్రోవాచధర్మవిత్ । ధృతవ్రతేనచస్య యా ఛందాంసీగురుణిర్నయః । యానితానివ్యర్థీకేనగృహీతంచానుశాసనం । భారతవ్యపదేశేన హ్యామ్నాయార్థోపిదర్శితః దృశ్యతేయత్రధర్మాది స్త్రీశూద్రాదిభిరప్యుత । తథాపిబతనోహ్యదాత్మాచైవాత్మనోవిభుః । అసంపన్నఇవాభాతి బ్రహ్మవర్చస్యసర్వదా । కింవాభగవతోధర్మా నప్రాయేణనిరూపితాః ఇత్యాది।అటువలెనే శారదావాక్యంవ్యాసునిగూర్చి॥ శ్లో॥ భగవానవిదితప్రాయం యశోభగవతొవినా । యేనైవాసౌనతుష్యేన్మన్యేతద్దర్శనంఖిలం । యథాధర్మాదయశ్చార్థామునివర్యానుకీర్తితాః । నతథావాసుదేవస్య మహిమాహ్యవర్ణితః॥ ఈయీలాగునను భేదసంశయముగలదుగనక భాగవతలక్షణము మత్స్యపురాణైకపంచాశదధ్యాయమందు చెప్పినారు॥ శ్లో॥ యత్రాధికృత్యగాయత్రీంకథితోధర్మవిస్తరః । వృత్రాసురవధోపేతం తద్భాగవతముచ్యతే। సారస్వతస్యకల్పస్య మధ్యేయేస్యుర్నరాః। తద్వృత్తాంతోద్భవంలోకే తద్భాగవతముచ్యతే। ఈ మానవీయసంహితానవమాధ్యాయం॥ "తతోభాగవతంప్రోక్తం భాగద్వయవిభూషితం" అని, అదిగనకనే- వక్తృభేదమున్ను పుబడెను ఆభాగవతప్రథమస్కంధచతుర్థాధ్యాయం । తత్ర గ్వేదధరఃపైలః సామగోజైమినిఃకవిః । వైశంపాయనఏకోనిష్ణాతో యజుషాంమునిః। అథర్వాంగిరసామాసీ త్సుమంతుర్దారుణోమునిః । ఇతిహాసపురాణానాం పితామెరోమహర్షిః।అని।అథసప్తమాధ్యాయమె। అనర్థోపశమంసాక్షా ద్భక్తియోగమధోక్షజె। లోకస్యజ్ఞానతోవిద్వాం చక్రేసాత్వతసంహితాం యస్యాశ్రూయమాణాయ విష్ణౌపరమపూరుషే। భక్తిరుత్పద్యతెపుంసః శోకమోహభయాపహా। ప్రసంహితాంభాగవతీంకృత్వానుక్రమ్యచాత్మజం। శుకమధ్యాపయామాస నివృత్తినిరతం

మనిం।అని, పురాణములకురోమహర్షణుడున్ను పురాణేతరమై
న భాగవతసంహితకుశుకుడున్ను గనకపదునెనిమిది పురాణము
లలోనిదిగాదు. అదిగనుక పురాణేతిహాసేతరమైన యీభాగవ
తము విష్ణూత్కర్షవర్ణనకథ । అదిగాక ఆకథవినేపరీక్షిత్తు
న్నువినిపించె శుకుడున్నుకవితాకర్తయైన వ్యాసులున్ను భాగ
వతగణనలోవారుగనకాను భగవద్గుణ వర్ణనసేయవలెననిన్ని
వినవలెననిన్ని కర్తృశ్రోతలప్రతిజ్ఞచేత నిర్మింపబడినసంహితగన
కాను యీభాగవతమందు విష్ణూత్కర్షమున్ను విష్ణువేపరబ్రహ్మ
మనినిర్ణయముగాబలికేదిన్ని సహజమేకానిఅశ్చర్యముగాదు- ఆ
గ్నేయాదిత్యాదిపురాణములందునగ్నిసూర్యాదులమహిమవలెను-
అయినను వారంగీకరించిన భాగవతమందే రుద్రుడే ఆదికా
రణమనిన్ని పరతత్త్వమనిన్ని పరబ్రహ్మమనిన్ని సమానాధికరహితుడ
నిన్ని తెలిపేము- తృతీయస్కంధమందు కశ్యపవాక్యం॥శ్లో॥శ్మశాన
చక్రానిలధూళిధూమ్రవికీర్ణవిద్యోతజటాకలాపః। భస్మావకుంఠా
మలరుక్మదేహో దేవస్త్రిభిఃపశ్యతిదేవరస్తే । నయస్యలోకేస్వ
జనఃపరోవానాత్యాదృతోకశ్చననావిగర్హ్యః।వ్రతైర్వయంయచ్చ
రణాపవిద్ధామాశామహీజాంభవభుక్తభోగాం। యస్యానవద్యా
చరితంమనీషిణోగృణంత్యవిద్యాపటలంభిభిత్సవః। నిరస్తసామ్యా
తిశయోపిహియస్స్వయంపిశాచచర్యామచరద్గతిస్సతాం। హసంతియ
స్యాచరితంసుదుర్భగాఃస్వాత్మన్రతస్యావిదుషఃసమీహితం।యైర్వ
స్త్రమాల్యాభరణానులేపనైఃశ్వభోజనంస్వాత్మతయోపలాలితం।
బ్రహ్మాదయోయత్కృతసేతుపాలాయత్కారణంవిశ్వమిదంహిమా
యా। ఆజ్ఞాకరీతస్యపిశాచచర్యా అహోవిభూమ్నశ్చరితంవి
డంబనం।అని, ఇవి శ్రుతిమూలములు. పరిధమశ్లోకానకు భుక్తభో
గామజోన్యః।అన్యద్వితీయశ్లోకానకు, యస్మాత్పరంనాపరమస్తికిం

చిత్ । తృతీయశ్లోకానకు, స్వేమహిమ్నిప్రతిష్ఠితః। అని, నాలుగో
శ్లోకానకు, యోబ్రహ్మాణంవిదధాతిపూర్వం । ఇత్యాది శ్రుతిప్ర
మాణార్థకములచేత సర్వభూతసమత్వమున్ను అనవద్యచారిత్ర
మున్ను సమానాధికరాహిత్యమున్ను ఆత్మారామత్వమున్ను సర్వ
దేవనియామకత్వమున్ను సర్వప్రపంచకారణత్వమున్ను మూలప్ర
కృతివిశేషిత్వమున్ను శివైకనిష్ఠమని స్పష్టముగా దెలిపెను- చతుర్థ
స్కంధమందుబ్రహ్మవాక్యం॥ శ్లో॥ నాహంన యజ్ఞోనచయస్యయా
యంమెదేహభాజోమునయశ్చతత్వం । విదుఃప్రమాణం బలవీర్య
యోర్వా తస్యాత్మతంత్రస్యక ఉద్విధిత్సేత్ । ఆసీనందభ్రా
య్యాంబృశ్యాంబ్రహ్మసనాతనం॥ అష్టమస్కంధం॥ నతేగిరిత్రా
ఖిలలోకపాలవిరించివైరించసురేంద్రగమ్యం। జ్యోతిఃపరంయత్ర
స్తమశ్చసత్వంనయద్బ్రహ్మనిరస్తభేదం । ఇత్యాద్యసాధారణ
రత్వలక్షణములచేత శివుడే పరబ్రహ్మమని తెలిపెను - ఈలాగు
శుకయోగీంద్రుడు తత్త్వసింహాసనమెక్కి ప్రామాణికము చేస్తున్నా
డుగనుక యథార్థముపలుకమంటే హానివచ్చునని శాబోలుమత
సంగవశాత్తుముఖాంతరమువలననైనా శివుడు జగదాదికారణుడ
నివెల్లనాడెను- అదిగనుకనే జయించినాడు - యీవాక్యములు
శ్రుతిమూలములుగనుకను యీభాగవతం సాత్త్వికమని తామం
కరించినదిగనుకను శుకులు తత్త్వసింహాసనమెక్కి పలికినాడుగనుక
కను తామసత్వమోహకత్వాదికల్పనగూడదు- మరిన్ని భగవద్గీత
ముననే తాముముగురమున్ను సములమనిన్ని పరతత్వము వేరే
దనిన్ని పలికినరీతిన్ని చెప్పెదము. చతుర్థస్కంధమందే, శ్లో॥ అహంబ్ర
హ్మాచశర్వశ్చజగతఃకారణంపరం। ఆత్మేశ్వరఉపద్రష్టాస్వయందృ

జ్నిరుపాధికః: అని, యీలాగు భాగవతమందే సాక్షాద్విష్ణువే
తాను పరబ్రహ్మమునుగాను, ఈశ్వరుడు వేరేవున్నాడని తెలుపగా
కొందరు,కించిజ్ఞులైన పృథగ్జనులు శ్రీహరి పరబ్రహ్మమనిసామాన్య
వచనములవలననిర్ణయించికొనుట మతాభిమానముచేత సంతోష
పడుట-అయితే విష్ణువే పరతత్త్వమనివర్ణించిన భాగవతవచనము
లకేమిగతిఅంటే, పరతత్త్వమారోపించి స్తుతిచేసుటగా తెలిసికొ
నేది - శివపరత్వప్రతిపాదకోపజీవ్యజాతియ్యప్రత్యక్షశ్రుతిమూల
కత్మృతియ్యస్కంధాదివాక్యవిరోధముచేత బాధితములామెగనుక-
గుణవాదములు, విరోధేగుణవాదస్స్యాదన్నారుగనుక,అయితే వి
ష్ణుపరత్వవాచక వాక్యప్రాచుర్య విరోధముచేత రుద్రపరత్వప్రే
కటనవాక్యములేగుణవాదలగునంటే కానేరవు- గుణవాదలనంగా
కలగుణములందుకొన్నిలేని గుణములుగూర్చి సర్వోత్కృష్టము
గావర్ణించుట । అదిగనకను ఆలాగులేనిగుణములైనా కొన్ని
గూర్చి పరమోత్కృష్టునిగా రుద్రునివర్ణించుట కేమిప్రయోజ
నము । యీభాగవతము శైవపురాణముగనకనా। లేకనిరుపాధి
కసాధారణ పరతత్త్వకథనప్రశ్నోత్తర లక్షణముగనకనా।వక్తృ
శ్రోతలపక్షపాత ప్రసంగముగనకనా । ఇత్యాదిహేతువులులే
వు గనక గుణవాదలుగావు। విష్ణూత్కర్షవర్ణనమునకైతేయీ
చెప్పిన హేతువులన్నిగలిగివున్నవిగనక గుణవాదత్వమువినాగా
మరొకగతిలేదు । యేలాగంటె।పరమశివైకనిష్ఠమైన పరమాత్మ
త్వాదిలక్షణముతదంశభూతుడైన నారాయణునందారోపించి స్తు
తిగల్పించుటగనక। యీస్తుతితత్త్వాత్మకుడైన విష్ణువుదిగాని కేవల
విష్ణుమాత్రునిదిగాదు। ఆలాగెపరాశరపురాణం॥శ్లో॥ఉత్కర్షో
యఃపురాణేషు దృశ్యతెవిష్ణవేప్యచ । అసౌతత్త్వాత్మనోవిష్ణో

ర్ణ స్వరూపేణ సత్తమ।అని। అయితే విష్ణూత్కర్షప్రసంగమ్ము
మందు శివోత్కర్షప్రశంస కేమినిమిత్తమంటే । గౌణవృత్తి
చేత విష్ణునిష్ఠముగా వర్ణించిన పరతత్వాదిలక్షణమునకు ముఖ్య
వృత్తి ప్రవృత్తినిమిత్తజ్ఞాపకమైన అనువాదత్వ మేనిమిత్తము।అ
లాగంటే అనువాదావధారణే అని ప్రమాణాంతరనిర్ణీతార్థ
ప్రశంసఅనువాదమన్నారుగనక । విశ్వాధియోరుద్రోమహర్షిః
అని।«యస్మాత్పరంనాపరమస్తికించిత్"అనేడిపూర్వోదాహృతా
నేక శ్రుతిప్రసిద్ధమైన లక్షణమే తెలిపెగనుక నిదిగాక శ్రీశుక
తప్తసింహాసనారోహణ జయసిద్ధికొరకు యథార్థకథనముగా
వలెననిన్ని ప్రసంగంగల్పించికొని పరతత్వనిర్ణయంచేసుటై
నిమిత్తమయ్యాని * యీలాగుననే భారతతాత్పర్యమున్ను శివో
త్కర్షపరమే యెటువలెనంటె నేలాగైనానేమి «నారాయణ
కథామిమాం" అనినారాయణకథైనభారతంచెప్పెనని ప్రతిజ్ఞా
చనంకలదంటెఐనాగాసీకృత్స్నగ్రంథతాత్పర్యము శివపరమేకా
మరొకవిధముగాదు యెలాగంటె। నారాయణకథప్రసంగించు
న్నతరుణమందు హరిశ్చంద్రాదిపురాతన పురుషచారిత్రలవలెనే
తత్పుత్రమిత్ర కళత్రాదులవర్ణించి అతనికుపాస్యుడున్ను
నాదిజనకుడున్ను పరతత్వమైనశివుడనిచెప్పెనుగనక నాలాగే
ణపర్వమందువ్యాసవచనం॥శ్లో॥జన్మకర్మతపోవిద్యా స్తమోత్త
పుషకలాః। తాభ్యాంలింగేర్చితశ్శం భుస్త్వయాచార్య
శేషతః । అని।సపక్షరుద్రభక్తశ్చ కేశవోరుద్రసంభవః। అ
దేశాంతరం । వాసుదేవస్తువన్దృష్ట్వా జగామశిరసాక్షితిం
ర్థేనసహధర్మాత్మా గృణన్బ్రహ్మసనాతనం । అని।అను
సీకం।సపక్షభగవాన్రుద్రః సర్వతత్వాదిరవ్యయః। సోసృజ

శాదంగా ద్బ్రహ్మణంలోకసంభవం । వామపార్శ్వాత్తథావి ష్ణుం।అని।సౌప్తికపర్వం । శ్రీకృష్ణవాక్యం।నూనంసదేవందేవా నామీశ్వరేశ్వరమవ్యయం।అని।యిపిన్ని శ్రుతిమూలములె॥శ్లో॥తమీ శ్వరాణాంపరమంమహేశ్వరం తందేవతానాంపరమంచదైవతం। అని।మరిన్ని సౌప్తికమందే। ఆదిరేషహివిశ్వస్య మధ్యశ్చాంతశ్చభా రత।అని । యింతమాత్రమేకాదు, సకలపురాణములకూ తాత్పర్య ము శివాధిక్యపరమెకాని మరొకవిధముకాదు। అటువలెనెపరా శరపురాణ తృతీయాధ్యాయం॥ శ్లో॥అష్టాదశపురాణానాంనిష్ఠా కాష్ఠామహేశ్వరః । గుణాభిమానినోనైవ బ్రహ్మవిష్ణుమహేశ్వ రాః । అని। ఇదిగాక వైష్ణవాదిపురాణముల జెప్పిన విష్ణూత్కర్ష తత్వాత్మకుడైన విష్ణువు తాననిన్ని శైవాదిపురాణముల వర్ణించిన శివమహిమము సాక్షాచ్ఛివునిదేఅనిన్ని - ఇతరపురాణములబ లికిన శివనికర్షగుణాభిమానివైన సంహారకారిరుద్రునిదనిన్ని చె ప్పియున్నదకూడనే॥శ్లో॥యోపకర్షోహరేర్దృష్టః శాంభవేష్వ ఖిలేషుచ । పురాణేషుహరేస్సాక్షా న్మూలభూతస్య సత్తమ। వైష్ణవేషు పురాణేషు యోపకర్షస్తుదృశ్యతె । రుద్రస్యాపి హరస్యాపి విభూతిశివకేవలం । ఉత్కర్షోయః పురాణేషు దృశ్యతెశాంభవేషుచ । రుద్రస్యాప్యస్వరూపేణ మునెతత్వాత్మ నోపిచ । ఉత్కర్షోయఃపురాణేషు దృశ్యతెవైష్ణవేషుచ।అసౌ తత్వాత్మనోవిష్ణోర్నస్వరూపేణసత్తమ । ఎవంపురాణయోస్సా క్షాద్బ్రహ్మణోదర్శితాచదిక్ । వాచకస్యపురాణెషు తథాసా రెచసత్తమ । ఆధిక్యంచెవదెవస్య శివస్యపరమాత్మనః । అవిజ్ఞా యనరోపిష్ణుం వరిష్ఠంమన్యతెభ్రమాత్ । రుద్రాధిక్యమవిజ్ఞాయ బ్రహ్మనారాయణౌపురా । అహంబ్రహ్మత్వహంచేతి విభ్రమా దకృతాంద్రణం। ఇత్యాది, యీలాగున వారుకోరిన పరాశరవే దవ్యాసశుకయోగీంద్రుల హృదయాభిప్రాయములు విచారించితే

శివుడే పరమాత్ముఁడని నిర్ణయమాయెను. తాము విష్ణూత్కర్ష
మునంపాదించిన భాగవతశుకయోగుల ఉత్కర్షము పరమో
త్కర్షమునకుపయోగించెగనుక వారిసిద్ధాంతము మతాన్ధ
అనిపించుకొనెను అదిగనుక శుకయోగి తెలిచిన భాగవతనిర్ణ
యము శివపరమేకాని విష్ణుపరముగాదాయెను. ఇక స్వాయంభు
వమనువుచేసే దీర్ఘసత్రమందు పదునాలుగుభువనములగల ఋ
షులందరుగూడి విచారించినతత్వనిర్ణయప్రసంగము చదువు
వలన తత్వనిర్ణయముచేసెమంటే తడవుపట్టెని మూడుమూ
ర్తులందు పరబ్రహ్మమెవ్వరో పరీక్షించి తెలుపవలెనని భృగు
నంపితే నతడుపరీక్షించిన పరీక్షకువచ్చెగనుక విష్ణువే పరతత్వ
మనినిర్ణయించికొన్నారు- అదిన్నత్యంతతుచ్ఛనిర్ణయలక్షణ
టువలెనంటే, నిరుపాధికనిర్వికల్పకాపరోక్షజ్ఞానగమ్యమైనపర
హ్మమును ప్రత్యక్షముగాజూచి దోసకాయలుగదా కుట్టిచూచి
రీక్షించికొన్నట్టు పదతాడనతర్జనభర్జనాదులచేతపరిక్షించుట
మాణముచేసికొనిరిగనుక నిది పరతత్వజ్ఞానమునకు తుచ్ఛసా
నమగునో కాదో వివేకించికొనేది- అయితే సాక్షాత్కార
పరతత్వనిర్ణయమునకుపయోగింపకపోతే మానింది ప్రధానదే
వైనముమ్మూరిలో నాధిక్యమైనాతెలెగదా అందుచేతనయ్యే వి
డే పరబ్రహ్మముగాదగినవాడని పరంపరాసాధనమైనానయ్యే
చాలంటే, అందుకున్ను పూర్తిచాలదు- యెటువలెనంటే, ప్ర
త్వమనంగా దుర్నిరీక్ష్యతెజస్విత్వమున్ను నిగ్రహానుగ్రహ
భయహేతుత్వమున్నుగలయది- భృగునినిర్ణయప్రసంగమందు
ణములేమి విష్ణువువలన కనిపించవాయెను- యేలాగంటే, లక్ష్మీ
మేతుడై రహస్యస్థలమున యాయమతొడలమీద శయనించియు
డగా నడ్డమాపున్నులేక నంతఃపురముజొచ్చిపోయి రొమ్మున
తన్నితే లేచిచూచి భయపడి నమస్కరించి వుపచారముచేసె

ఋషులచిత్తము బెడిసితే నియ్యాధికార మెక్కడచ్యుతి అయిపోవునో
అనియో అదిగాకితడు తత్త్వపరీక్షకుడువచ్చినాడు ప్రియముచెప్పి
యితనిచేత పరతత్త్వమనిపించికొందామనియో లేక మరేనినిమి
త్తమో తెలియదు- అతడుపెట్టిన పాట్లనెల్లాబడెను- యీలక్షణ
మైతే పరబ్రహ్మలక్షణముగా నీ సర్వోత్కృష్టప్రభుత్వలక్షణము
గానీకాదు. బ్రాహ్మణులగ్రజన్ములు వారేమిచేసినా ప్రతికారము
చేసితే ప్రత్యవాయమువచ్చిననిసహించికొనియుండె బ్రహ్మణ్యు
డైనక్షత్రియధర్మమాయెను । రుద్రుడైతేనీలాగులేదు భృగువుకై
లాసమునకుపోయి తనుకౌగలింపవచ్చిన రుద్రునినీవనాచారివని
దూషించితే భ్రాతృస్నేహమనే సంబంధముగల్పించికొని బహు
మానముచేయవచ్చితే వీడడచిపడేదేమని శూలమునవేయనంక్రిం
చితే అమ్మవారువచ్చి శివునిపాదములుబట్టికొని వాడజ్ఞానిమీకో
పమున కెంతవాడుక్షమింపవలెనని ప్రార్థించితేకటాక్షించివిడి
చిపెట్టెనదిగనక నిగ్రహానుగ్రహాదిప్రభుత్వ లక్షణమురుద్రునం
దేకనిపించెను। ఆలాగెభాగవత దశమస్కంధమందు॥శ్లో॥సరస్వ
త్యాస్తటేరమ్యే ఋషయస్సత్రమాసత । వితర్కస్సమభూత్తే
షాం।త్రిషుదేవేషుకోమహాన్ । తస్యజిజ్ఞాసయాతేవైభృగుంబ్ర
హ్మసుతంనృప । తజ్జ్ఞప్త్యైప్రేషయామాసుః సోభ్యగాద్బ్రహ్మణస్స
భాం।నతస్మైబ్రహ్మణేస్తోత్రం చక్రేసత్త్వపరీక్షయా । తస్మైచుక్రో
ధభగవాన్ ప్రజ్వలన్స్వేనతేజసా। అథాజగామవైకుంఠంయత్ర
దేవోజనార్దనః । శయానంశ్రియఉత్సంగే పదావక్షస్యతా
డయత్ । తతఉత్థాయభగవాన్ సహలక్ష్మ్యాసతాంగతిః । స్వ
తల్పాదవరోహ్యథననామశిరసామునిం । తంనిశమ్యాథమునయో
విస్మితాముక్తసంశయాః । భూయాంసుఃశ్రద్దధుర్విష్ణుంయతఃశాం
తిర్యతోభయం । తతఃకైలాసమగమత్తత్రదేవోమహేశ్వరః। పరి
రబ్ధుంసముపారేభే ఉత్థాయభ్రాతరంముదా । నైచ్ఛత్త్వమత్యు

త్వధగణ ఇతి దేవశ్చకోపహ। శూలముద్ధృత్య తంహంతు మారేభే
క్మలోచనః। పతిత్వాపాదయోర్దేవీ సాంత్వయామాస తంగిరా
అని యీ భయహేతుత్వాదిలక్షణము దేవతాధిక్యధర్మ మాత్రమే
కాదు బ్రహ్మధర్మమున్నాలాగె శ్రుతి «భీషాస్మాద్వాతః పవతే। భీష
దేతి సూర్యః। భిషాస్మాదగ్నిశ్చేంద్రశ్చ। మృత్యుర్ధావతి పంచమఇతి
అని। స్తుహి శ్రుతం గర్తసదం యువానం మృగన్న భీమముపహ
ముగ్రం। అని। యిది బ్రహ్మత్వలక్షణము। ఇక ప్రభుత్వము శివునకు
కలగ జెప్పెను। శ్వేతాశ్వతరోపనిషత్తు «మహాన్ ప్రభుర్వై పురుష
స్యత స్త్యైష ప్రవర్తకః సునిర్మలామిమాం శాంతి మీశానో జ్యోతి
వ్యయః'' అని। అదిగనక నీ భృగు పరీక్షయందు బ్రహ్మత్వ ప్రభు
త్వలక్షణమైన భయహేతుత్వాదిధర్మ మసాధారణముగా శివు
నందె కలదని ప్రకాశింపబడెను, బ్రాహ్మణదైవమైన శివుని సంబంధ
మువారని బ్రాహ్మణులను పేక్ష సేయ వెరచి బహుమానము సేయు
టను క్షత్రియ దైవత్యలక్షణము ప్రకాశింపబడెను। అవతారము
లందునూగాక పరమపదమైన వైకుంఠవాసుడైయుండిన్ని యీలా
గున బ్రాహ్మణులకు వందనాద్యుపచారములు నడుపుచు నను సరి
చుట పూజ్యత్వమో పూజకత్వమో తెలిసికొనేది। యీలాగు
నెంత ఉదాసీనతకైనా నోర్చి ఉపచారము చేసినాగాని మహాశాం
తుడున్ను! భయభక్తులు గలవాడున్ను గనక మహాదొడ్డవాడని నిర్ణ
యించిరిగాని పరబ్రహ్మమని నిర్ణయించరైరి। అదిగనక «శాన్త
శ్చాంతో దాంతః'' అనే శ్రుత్యుక్త జ్ఞానాధికార లక్షణములు గల
వాడన్నట్టాయెగాని। జ్ఞేయమున్ను ఉపాస్యమునైన బ్రహ్మమనుట
గాదాయెను। భృగువున్ను బ్రహ్మ నిర్ణయము సేయలేదు। ఆదిబ్రహ్మ
పురాణ ప్రథమాధ్యాయం॥ శ్లో॥ తత్వం విచారయామాసుర్మిథో
త్రమహర్షయః। అశక్తాస్తే మహాభాగ భృగ్వాద్యాస్తత్వనిర్ణయ
భాగవత[illegible] ... [illegible] తీవచనము

శ్లో॥ న వేదధర్మం కిలపద్మయోనిర్న బ్రహ్మపుత్రా భృగునారదాద్యాః। నవైకుమారః కపిలోమనుశ్చ యేవై నిషీదంత్యతివర్తనం హరం— యేషామనుధ్యేయపదాబ్జయుగ్మం జగద్గురుం మంగళ మంగళంస్వయం। అని, ఋషులున్ను దేవతలున్ను సరిగా ఆద్యంతశూన్యమైన బ్రహ్మము నెరుంగలేరు- ఆలాగే శాంతిపర్వము॥ అనాద్యంతంపరంబ్రహ్మ నదేవానర్షయోవిదుః। ఏకస్తద్వేదభగవాన్ ధాతానారాయణోహరిః। అని, యీవచనముచేతనే నారాయణుడు బ్రహ్మజ్ఞాని అని చెప్పినట్టాయెను- యీలాగే పురాణం॥ వేదాంతవిజ్ఞానసునిశ్చితార్థాః శివస్యతత్వం శివఏవవేత్తి। తస్మాచ్చవిష్ణుర్గిరిజాకుమారౌనందీచసిద్ధాంతవిదోనచాన్యే అని, శివతత్వము నారాయణుడే కాని ఋషులుగాని దేవతలుగాని తెలియరనంగా భృగునకేలాగున దెలిసెను యస్మాత్పరం నాపరమస్తికించిత్ ।అనేశ్రుతిన్ని నిరస్తసామ్యాతిశయోహియస్స్వయం। అనే భాగవతవచనమున్ను, శివునికన్న నితరమైన పరతత్వమును నిషేధించెగనుక భృగునిశ్చితపరతత్వనిర్ణయము నిరస్తమాయెను- ఆభృగునియభిప్రాయమువిచారించినదన కావచ్చితే పరతత్వబుద్ధిని విష్ణ్వాధిక్యము నిర్ణయించుకొన్నవాడు కాడు- మరేమంటే తాజేసిన అవమానమునకోర్చి ప్రియము చెప్పినాడుగనుక మహాశాంతుడున్ను భయముగలవాడన్నిసంతోషించినాడు - లోకమందు తినగలిగితే పెండ్లిన్ని తినలేకుంటె శ్రాద్ధమున్ను అనేపృథగ్జనుడుంవలెనే తన్నవమానించినబ్రహ్మరుద్రులకొద్దిగాదలచికొన్నాడు లేక పారమార్థిక బుద్ధిచేత యథార్థముగా పరతత్వమని తలచికొన్నట్టయితే ఆవిష్ణువే తన పెండ్లాముతలద్రుంచినప్పుడున్ను మనుష్యయోనులబుట్టి భార్యావియోగాదిదుఃఖము లనుభవింతువుగాకని శాపముపెట్టకనేపోవు

సు- సాత్త్వికబ్రహ్మమని అప్పుడు సంతోషమేపొందును- ఆలాగు లేదు. అందుకుప్రమాణం॥ మత్స్యపురాణం॥ జ్ఞాత్వావిష్ణుస్తత్త స్యాః క్రూరం దేవ్యావిచేష్టితం । క్రుద్ధస్స్వశస్త్రమాదాయ శిర శ్ఛిదవైహాశాత్ । తంద్రుష్ట్వాతువధం ఘోరం చుక్రోధభృగు శ్వరం। తతోభిశప్తోభృగుణావిష్ణుర్భార్యావధేతతా।యస్మాత్తే జానతా ధర్మమవధ్యాస్త్రీః సూదితా।తస్మాత్త్వంసప్తకృత్వ మానుషేషూపపత్స్యసె। అని, బ్రహ్మాండపురాణం॥ భృగోః చశాపేన విష్ణుః పరమవీర్యవాన్ ప్రోదుర్భావాన్దశప్రాప్తః తప్పసదాకృతః। తెపుఃశాపైశ్చవివిధైః స్తంజేవంభువనేశ్వరం పాంసితెషాంసర్వేషాం ప్రత్యహన్యతశంకరె।అని,భృగుశాప త్రిముచేత విష్ణువైతె అనేకదుఃఖములనుభవించెను - యీబుషి సంఘమైనబుషులందరున్ను నానావిధశాపములుబెట్టినాగాని కరునికాశాపఫలము లంటవాయెనని శివాధిక్యము దెలిపెను. రామాయణోత్తరకాండం॥శ్లో॥ విష్ణుంచ పురా రామభృగోః దృఢవ్రతా।అనిందలోకమిచ్ఛంతీ కావ్యమాతానిసూదితా। ఇ ది, యీలాగు పురాణరహస్యమున్ను బుషులహృదయము న్యోన్యవిరుద్ధలక్షణమున్నెరుగనిమూఢులుకొందరు భృగుదుషరీక్ష వచ్చెగనుక విష్ణువే పరబ్రహ్మమని నిర్ణయించికొన్న సిద్ధాంత నిరస్తమాయెను. ఇక గజేంద్రు డాదిమూలమెవ్వరో వాని

* గజేంద్రమోక్షణము. *

మొత్తాన నూరకే మొరపెట్టితే నపుడుబ్రహ్మాదిదేవతలు "నాహ నాహంనచభవతిపునస్తాదృశోమాదృశేషు" అన్నట్టువలనే తా గాము నేమూగామని చూస్తుండగా నాదిమూలమైవచ్చి గజేంద్ర

నిరీక్షించెగనుక విష్ణువేపరతత్వమని వ్రాసికొన్నారు. యిదిన్ని అసాధారణధర్మమున్ను పరతత్వసాధకమున్ను గాదేలాగంటే, తనభక్తభృత్యపుత్రాదుల గాచికొనేదిన్ని పోషించేదిన్ని అత్యంతనికృష్టులకైనాను త్తమధర్మముగనుక తనభక్తుడైన గజరాజు గాచికొనుట శ్రీహరికి భక్తవాత్సల్యమునెరపుకొనుటామెనుగనుక ప్రభుత్వసామాన్యధర్మమాయెగాని,నిరుపాధిక పరమకారుణికత్వమున్నుకాదు,గజేంద్రుడు విష్ణుభక్తుడైనందుకు ప్రమాణమాభాగవతమందే॥ శ్లో ॥ యోసౌపూర్వమభూద్రాజా పాండ్యోద్రవిదసత్తమః । ఇంద్రద్యుమ్నఇతిఖ్యాతో విష్ణువ్రతపరాయణః। అని।అనేకజన్మములనుంచి విష్ణుభక్తుడైనందుకు వామనపురాణము॥ శ్లో॥అభీతస్సక్ నిరుత్సాహో గృహీతో ఘోరకర్మణా।పరమాపదమాపన్నో మనసాచింతయద్ధరిం । సతునాగవరశ్శ్రీమాన్ నారాయణపరాయణః । జన్మజన్మాంతరాభ్యాసాద్భక్తిమాన్ గరుడధ్వజె । నాన్యందేవంమహాదేవా త్పూజయామాసకేశవాత్। మథితారింపద్మనాభం శంఖచక్రగదాధరం । అని।అనన్యశరణుడున్నుఇతరదేవతా పరిత్యాగియునగుచుతననేకొలిచిన భక్తుడుగనకతానచ్చికాచికొన్నాడు।అయితే॥ శ్లో॥ ఏవంగజేంద్రముపవర్ణితనిర్విశేషంబ్రహ్మాదయోవివిధలింగభిదాయమానాః।నైతేయథావనన్నుపుర్నిఖిలాత్మకత్వాత్తత్రాఖిలామరమయో హరిరావిరాసీత్ । అని। యీరాజగజజన్మమందు నిర్విశేషస్తుతిచేసెనేగాని యొకరిపేరుగాని చిహ్నముగానిఉచ్చరించుట లేదుగదాఅంటె।శేషన్నాగానీ విష్ణువెకాచికొనవలెగాని । యితరులకుపనిలేదేలాగంటె । లోకసందుభయపడిన శిశువులునోయబ్బానోయయ్యాఅని ఉరకెమొత్తానమొరపెట్టితె వారివారితలిదం

ద్రాదులువచ్చి అలముకుందురుగాని తనుపేరువాడిపిలిచినవాడు
గాడనిడపేక్షించరు । ఇదియునటువలెనే। ఇదిగాకనీజన్మమందు
జన్మాంతరవాసనచేత స్మృతికలుగుటకున్ను విశేషాకారాన
మస్మరణచేసుటకున్ను ప్రమాణముతెలిపేము । భాగవతమందు
శ్లో॥హర్యర్చనానుభావేన యద్గజత్వేప్యనుస్మృతిః । అని బ్రహ్మ
నమస్తేఖిల కారణాయనారాయణా యాద్భుత కారణాయ।వామ
నపురాణము। నమోస్తుపద్మనాభాయసాంఖ్యయోగో ద్భవాయ
చ।అని।అయితె । ఏవంగజేంద్రముపవర్ణితనిర్విశేషం।అనిగ్రం
థములె బ్రహ్మాదిదేవతలు తమతమచిహ్నములకున్నఅధి కారక
లకు నామధేయములకు న్నభిమానించినభిన్నదేవతలుగాని స
మయులుగారు, గనక గజేంద్రుడుచేసిన నిర్విశేషస్తుతికహారాదు
రాకపోయిరి । విష్ణువుసర్వాత్ముడుగనక నాస్తుతికహరి
వచ్చికాచెనని వెళ్లనాడినవచనములకు గతెమంటె ప్రాసు
క్తత్వ ప్రతిపాదకవిశేషాకారస్తుతి పరత్వాది వచనవిరోధము
గలిగివున్నది । కడనౌపచారికముగాదెలిసికొనేది।అదెకటీడిమ
టన్నట్టాయేనా ఆభాగవతమందె మరియునొకబాధకమైనగ్రం
బందిచెప్పెదము,అత్రిమహాముని సంతానాపేక్షనుజగదీశ్వరుడొ
డా అతడుతనకుప్రసన్నుడైఅభీష్టమిచ్చు గాకయనినిర్విశేషా
ననేధ్యానము చేయుచుండగా బ్రహ్మవిష్ణురుద్రులుముగ్గురు ప్ర
త్యక్షమైరి,అయితె వారిగూర్చి ఓస్వాములారా నేనుద్దేశిం
దొకడేదేవతె, మీరుముగ్గురువచ్చుటేమంటె నీవొకదేవతసా
రణముగాను పాసించినవాడవుగావు గనుకనీసంకల్పాను సూ
ముగానే మేముముగ్గురమున్ను వచ్చితిమని అతడుగోరినట్టిము
రున్ను కుమారులుగాపుట్టిరి। ఆలాగెభాగవత చతుర్థస్కంధము

దు ప్రథమాధ్యాయము। అతిష్ఠదేకపాదేన నిర్ద్వంద్వోఽనిలభోజనః।
శరణం తం ప్రపద్యేఽహం య ఏవ జగదీశ్వరః। ప్రజామాత్మసమాం
మహ్యం ప్రయచ్ఛత్వితి చింతయన్। తప్యమానస్త్రిభువనం ప్రా
ణాయామైధసాగ్నినా। నిర్గతేన మునేర్వర్చస్సమీక్ష్య ప్రభ
వస్త్రయః। ఇత్యాది। అత్రిః। విశ్వోద్భవస్థితిలయేషు విభజ్యమా
నైర్మాయాగుణైరనయుగం విగృహీతదేహాః। తే బ్రహ్మవిష్ణుగిరి
శాః ప్రణతోఽస్మ్యహం వస్తేభ్యః క ఏవ భగవాన్ మయి హేమహూతః॥
ఏకో య ఏవ భగవాన్ విబుధప్రధానశ్చిత్తీకృతః ప్రజననాయ కథం
నుయూయం। అత్రాగతాస్తనుభృతాం మనసో విదూరాబ్రూ
త ప్రసీదత మహానిహ విస్మయో మే। దేవాః। యథాకృతస్తే సంకల్పో
భావ్యం తే నైవ నాన్యథా। తత్సంకల్పస్య తే బ్రహ్మన్ యద్వై ధ్యా
యతి తద్వయం। అథాస్మదంశభూతాస్తే ఆత్మజా లోకవిశ్రు
తాః। భవితారోఽంగ భద్రం తే విస్రప్స్యంతి చ తే యశః। అని। అక్క
డ గజేంద్రరక్షణమందు అఖిలామరమయుడని పిందికొనుట విష్ణువు
కిక్కడ నత్రి మహామునిసంతానదానమందు లేకపోయెను। అక్కడ
నిర్ణయింపబడిన వివిధలింగభిదాభిమానిత్వము బ్రహ్మరుద్రులక
క్కడ లేకపోయెను। యీలాగు విరోధబాహుళ్యము కలదుగనక।
“ఏవం గజేంద్రముపవర్ణితనిర్విశేషం” అనె శుకవచనమర్థవా
దవాక్యముగా తెలిసికొనెది। ఇందుకు గజేంద్రుడు తన భక్తుడుగనక
విష్ణువచ్చుటయును అత్రిమధ్యస్థుడుగనక నిర్విశేషస్తుతికనుగుణ
ముగాను జగదీశ్వరత్వమందధికృతులై ముగ్గురూవచ్చుటయును,
యుక్తమని వ్యవస్థ తెలిసికొనెది। గజేంద్రుడాపన్నుడై తన దైవము
ను సర్వోత్కృష్టరూపముగా స్తుతించినమాత్రమున నాస్తుతివాక్య
ములు పరత్వసాధకములుగా వేలాగంటె। లోకమందెటువంటి వా
డైనా తన పెనిమిటిని పెండ్లామున్ను, యేలినవానిని భృత్యుడున్ను,
ఆచార్యుని శిష్యుడున్ను దైవమును భక్తుడున్ను - అత్యున్నతిగా

పొగడికొనెది ధర్మము గనుక నిదియదార్థ నిర్ణయ మం
ప్రమాణముగాదు । ఇదిగాక గజేంద్రుడాజన్మమందున శ్రీహరి
క్తుడు గాకున్ననాటికిన్ని విష్ణునామోచ్చారణ సేయక నిర్విశేష
గా మూలబ్రహ్మమును గూర్చి మొరపెట్టిననాటికిన్ని ఆయాపదః
ర్వతింప జేసేటందుకు విష్ణువుకే కర్తవ్యముకాని శక్తిగా
రికి పనిలేదు । యెలాగంటే లోకరక్షణార్థమై పరమాత్ముడైన
వునుపుట్టించినాడుగనుక - తనచేతనైనప్రయోజనమెల్లా
చక్కబెట్టవలెను । లోకమందునెవడైనా నొకయుపద్రవ పీడి
డైనజనుడు పట్టపురాజునుగూర్చి మొరపెట్టితే తత్తదధికారు
రాజపురుషులువచ్చి కుదురుపరతురుకాని రాజునకుమొరపెట్టు
చున్నాడు రాజేవచ్చికాచనని ఉపేక్ష సేయరాదు । ఆలాగు
గజేంద్రుడు పరమేశ్వరునిగూర్చి మొరపెట్టితే లోకరక్షణార్థ
రియైనవిష్ణువు రక్షించేది సహజమేకాని మరియొక విధముగా
లోకరక్షణార్థమైపుట్టించినందుకు- ప్రమాణము,అనుశాసనిక
శ్లో॥వామపార్శ్వాత్తథావిష్ణుం లోకరక్షార్థ మీశ్వరః।అని-పుట్టి
చినమాత్రమేకాదు లోకరక్షణమందునియమించినాడు । వేదా
దస్తవమందు । జైమినివాక్యం। యదాజ్ఞయాజగత్సర్వం వ్యా
నారాయణఃస్థితః । అని। నియమించినమాత్రమేకాదు లోకర
క్షాధికారమందు పట్టమున్ను గట్టినాడు ఉమా సంహితయం
రామోత్కర్ష ప్రసంగమందు॥శ్లో॥చక్రపాణింసమాహూయ
త్నసింహాసనే శుభే।అభిషిచ్యవరందత్వా ప్రభుంచాకరవం పి
సృష్టిస్థితి వినాశానాం కర్తృత్వ మకుతోభయం। సర్వజ్ఞ
సిద్ధించ దత్తవానస్మివిష్ణవె । అని । అదిగనుక గజేంద్రమో
ము । పరతత్వ లక్షణముగాదు ॥ ఇందుచేతనే పృ

* భస్మాసురవధ *

చంపవచ్చితే ... శ్రీహరి మాయగు ... చ్చితే వా

ముగించిరుద్రుని రక్షించెగనుక నతడే పరబ్రహ్మమనుముచ్చట నిరసింపబడెను । యేలాగంటే పూర్వోక్తరీతిని విష్ణువుశివాజ్ఞా వశవర్తి గనకనే వృకాసురుడు స్వామి ద్రోహమునకు వచ్చితే మొదలతననుగూర్చి తపస్సు చేసిమెప్పించివరము పుచ్చుకొన్నాడు గనుక తాబెట్టినచెట్టు తాజెరికివేసుట ధర్మముగాదనిబాణాసురుని గర్వపరిహారము చేయించినట్టువలె నేముఖాంతరాననే జేయదలచి ఆజ్ఞాపించితే వచ్చివానిపనిముగించిపోయెను అదెక్కడిమాట,వాడునెత్తిని చెయిబెట్టి చంపవచ్చితే జడిసి వైకుంఠమునకు పారిపోతె శ్రీహరివచ్చికాచి వానిముగించెను లేకుంటేపారిపోనేలాఅంటిరాఅది తెలియనిముచ్చటయేలాగంటే। చరాచరాత్మకములైన బ్రహ్మాండపఙ్క్తుల నిమిష మాత్రమున భస్మముచేసే సామర్థ్యము గల లలాటలోచనునికి నొకతుచ్ఛరాక్షసునిముగించేదెంతపని అదిగనుక వానిని గురిసేయక "పుత్రాదిచ్ఛేత్పరాజయం" అనేన్యాయముచేత వీడెంత మేర పరువిడునో అనినటించిననటనగానిభయపడికాదు। చిన్నవాండ్లు తరుముకొనివచ్చితేతె మరుపరువులు వెట్టినటువలెనె- అదేడ మాటంటే । బ్రహ్మదక్ష యమ మదనాదులన నాయాసమునశిక్షించుట దబ్బరై పోవును, అయితె నిదిఅట్లుగాదు నెత్తిన చెయి బెట్టితె నెవరికైనాచావక తీరదు। అమోఘవరముగనుకనంటేఅయినానొకరిమరుగుచొరపని లేదు । ఉరులింగాకారుడైనప్పుడు శిరస్సు బ్రహ్మదేవుడు సగాననేకదివ్యవర్షములూర్ధ్వలోకగమనము చేసిన్ని కడగానక పోయెను, అనగావీడెంతవాడు, ఈకధముందర నుదాహరించవలసి వున్నదిగనుక వచన సంమతిన్యాయము । పొడవుపెరగకుంటెమాసెకాని నాడున్న చోట నుండె అంతర్థానమై కాన రాకుంటే, వారుసేయదగిన కార్యమేమి।ఆశక్తి శివునందు గలుగును । అతని కటాక్షము చేత నింద్రరామచంద్రాదుల భ్రమించే పాటి అంత

ర్థానవిద్య యింద్రజిత్తుకు గలుగగా తానుమాత్ర మంతర్ధాన
మైవాని నపలపింపలేదా? అందుకుప్రమాణము త్తరకాండమందు
శ్లో॥ మాహేశ్వరే ప్రవృత్తేతు యజ్ఞపుంభిస్సుదుర్లభె। కామగం
స్యందనం దివ్య మంతరిక్ష చరం ధ్రువం। మాయాంచ తామసీ
నామయస్యాం ప్రభవతె తమః। ఎతయాకిలసంగ్రామే మాయ
యారాక్షసోత్తమః। తద్యుద్ధస్యగతిర్వ క్తుం నశక్యావై సురాసు
రైః। అని। యీలాగునింద్ర రామాదుల భ్రమింపచేసేపాటిసా
ర్థ్యమిప్పుగా భస్మాసురు డనంగా నెంత। అది గనుక ఆపలా
యనము విలాసముగా తెలిసి కొనేది లేకున్నట్టామెనా విష్ణుపు
రాణ భాగవతముల జెప్పిన "ఇతినిశ్చిత్య యవనఃపార్థ్రివంశః
పరాఙ్ముఖం" అని, "పలాయనం యదుకులె జాతస్యతవనో
తం" అని। శత్రుడైన కాలయవనుడు తరుముకొనిరాగా పా
పోయి ముచికుందుని మరుగు చొచ్చి అతనిచేత జంపించుటయ
నుశ్రీకృష్ణునికినైచ్యాపాదకమవును॥ * ॥ ఇకనీశ్వరత్వా సాధా
రణలక్షణమైనకర్తుమన్యథాకర్తుమకర్తుంసామర్థ్యమున్న శి
నందేకలుగుట తెలిపెను। యేలాగంటే। యెవరి చేతనూ గా
ప్రయోజనమునుతాజేసుటకర్తుం సామర్థ్యము। అన్యులచేతగా
నికాలకూటభక్షణకామదహన త్రిపురవిజయాదులు శివుడు చేసె
ను। అందుకురామాయణము॥శ్లో॥ దేవానాం విద్రివంద్రుష్ట్వా శ్రు
త్వావాక్యంచ శార్ఙిణః। హాలాహలం విషం సర్వం ప్రపగ్ర
హామృతోపమం। అని,బ్రంహాండద్విషష్ఠిత మాధ్యాయము బ్రహ్మ
వాక్యం॥శ్లో॥తస్యవిష్ణురహంవాపిసర్వేవా సురపుంగవాః। నశక్నుఁ
వంతివై సోఢుం। వేగమన్యత్రశంకరాత్।విష్ణో క్షిప్త మానేన క
లానలసమత్విషా। నిర్దగ్ధోరక్త గౌరాంగఃకృ తఃకృష్ణో జనార్దనః
అని। భాగవతాష్టమస్కంధషష్ఠాధ్యాయము॥ శ్లో॥ నిర్మథ్యమాన
దుదధేరభూద్విషంమహోల్బణం హాలహలా హ్యమగ్రతః। క

త్యాది,భీతాః ప్రజాదుద్రువురంగ సేశ్వరాహ్యరక్ష్యమాణాశ్శరణం సదాశివం॥ ఇత్యాది, ఏతస్మాత్పరం నపశ్యామో నపరం తేమహేశ్వరః । మృడనాయహేలోకస్య వ్యక్తిస్తే వ్యక్తకర్మణః ॥ రామాయ

## ❋ కామసంహారాదికము. ❋

ణము ॥ శ్లో ॥ అశరీరః కృతః కామః క్రోధా దేవేశ్వరేణవా। అనంగఇతి విఖ్యాత స్తథా ప్రభృతిరాఘవ । అని । త్రిపురవిజయం। యజు స్సంహిత ''సతిస్రః పురోభిత్త్వైభ్యో లంకేభ్యో సుథారాన్ప్రాణుదత'' అని । ఇదికర్తుం శక్తి । ఇకనితరులచేత సేయకవహానెటందుకశక్యమైనటువంటి ప్రత్యభావవిద్యానిథనాదులుసంభవింపకుండా జేసుకొనుట । అకర్తుం సామర్థ్యము । అది శివునదేకలదందుకు రుద్రసూక్తము । స్థిరేభిరంగైః పురురూపఉగ్రః। అని,రామాయణమునందున్న ॥శ్లో॥ దేవతానాంవచశ్శ్రుత్వా సర్వలోకమహేశ్వరః। బాఢమిత్యబ్రవీత్సర్వాన్పునశ్చేదమువాచహ। ధారయిష్యామ్యహం తేజస్తేజస్యేమసహోమయా।త్రిదశాః పృథివీచైవ నిర్వాణమధిగచ్ఛతు ॥అని । ఇది అకర్తుం సామర్థ్యము। ఇకనొకతీరుననున్న వస్తువు మరొకతీరువుగా జేసుట అన్యథాకర్తుం సామర్థ్యము।అశరీరుడైన మదనునికి భార్యమైనరతీదేవిమాత్రమునకు సశరీరత్వము గలుగజేసుట। దక్షుని తలగొట్టిగొరెతలచేత నేవ్యవహరింపజేసుటయును।భగునికన్నులుదివిచియవివినాగానే చూపుగలుగజేసుటయును।పూషునిదంతభంగముజేసిఅవివినాగానే భక్షణాదికముసేయజేసుటయును।ఇత్యాదిసామర్థ్యము శివునందేకలదు।ఇతరదేవతలైతేవస్తుస్వభావము ననుసరించెతమసామర్థ్యమును చూపుదురు।అన్యథాకరణసమర్థుడున్న। శివుడే

అందుకు క్రమక్రమమునే ఉదాహరణములు। కాళీదాసః। శర్వ
గృహీతానునయేన కామం ప్రత్యర్పితస్వాంగమివేశ్వరేణ॥ ఉత్త
రరామాయణం। ఈకథకు స్త్రీపురుషత్వములు॥ శ్లో॥ ఏవంసరాజా పు
రుషోమాసం చరతిధార్మికః। త్రైలోక్యసుందరీ నారీ మాసమేకం త
థాభవేత్ ।అని తన్నివర్తకత్వమున్నకూడ నెజెప్పెను। ద్విజాః శృ
ణుతమే సర్వే యచ్ఛ్రియః పార్థివస్యవై । నైవపశ్యామి శైషజ్య
మంతరేణవృషధ్వజం। దేవంప్రసాదయిత్వాహంపురుషోయం భ
విత్వితి।అని।తతః ప్రీతోమహాదేవః పురుషత్వందదౌపునః । శ్రి
యాఃసుమహాతేజాదత్వా చాంతరధీయత । అనిదక్షాదులకు
చతుర్థస్కంధము।శ్రీభగవానువాచ। ప్రజాపతేర్దగ్ధశీర్షో భ
త్వజముఖంశిరః । మిత్రస్యచక్షుషేక్షేతభాగంస్వంబర్హిషో
గః। పూషాతుయజమానస్య దద్భిర్భక్షతుపిష్టభుక్ । దేవాః
ప్రవృత్తసర్వాంగాపత దుచ్ఛేషణందదుః । బాహుభ్యామశ్వి
నోః పూష్ణోహస్తాభ్యాం కృతబాహవః। భవంత్వధ్వర్యవశ్చాన్యే
బస్తశ్మశ్రుర్భృగుర్భవేత్ । అని।అదిగనకనే। అఘటితఘట
నాసామర్థ్యముగల ఈశ్వరత్వము శ్రీమహారుద్రునందే యో
రూఢిసిద్ధము । శ్రుతి । ఈశ్వరస్సర్వభూతానాం। అని। మంత్రో
పనిషత్తు । తమీశ్వరాణాంపరమంమహేశ్వరం । అని। యస్స
సమహేశ్వరః । అని।గీతలందు । ఈశ్వరస్సర్వభూతానాం హృ
దయేర్జునతిష్ఠతి।అని॥ శ్లో॥ ద్రోణపర్వం। ఉపాస్య ఈశ్వరస్తస్య
మూర్తీ నామపిసంతతం । తదుపాస్తిప్రవక్త్రుత్వాత్ ఉపా
స్యాఃఫలార్థిభిః । అని।ద్వాదశస్కంధం। అశాబాఈశ్వరో
ర్యయా । అని।అష్టమస్కంధం । ఏతత్పరంనపశ్యామోనపరంతే

మహేశ్వరః। ఇట్లని కాళిదాసు నిశ్చయించినాడు॥ శ్లో॥ అణిమాది గుణాధారమస్పృష్ట పురుషాంతరం । శబ్దమీశ్వరఇత్యుచ్చైః సార్ధచంద్రంబిభర్తియః । అని, అదిగనక నే నిఘంటున్ను "ఈశ్వరశ్శర్వ ఈశానః" అనేనిర్ణయించెను విష్ణువైతేనీశ్వరుడుగాడు మహదాఖ్యతత్త్వము। అలాగె ద్వితీయస్కంధం॥ శ్లో॥ యచాహుర్వాసుదేవాఖ్యం చిత్తంతన్మహదాత్మకం। అని। శ్రుతిన్ని "వాసుదేవః పరాప్రకృతిః" అనివున్నదిగనక నదిగనకసకలజగదుత్పత్తిస్థితిలయకర్తయును। సమానాధికరహితుడున్ను సంధ్యోపాసనాదిసకలవైదిక కర్మప్రతిపాద్యుడున్ను శివుడుగానితక్కినవారుగారు। అదిగనకనింతపర్యంతమున్ను దాహరించినశ్రుతిస్మృతిపురాణేతిహాసవచనబలముచేత బ్రహ్మత్వమురుద్రునిగడవ నితరదేవతలందు నిరసింపబడెను । విష్ణుబ్రహ్మాదులాయననను జ్ఞనవాంతరసృష్ట్యాదికర్తలున్ను ఆయనముఖ్యాంశసంభవులూగనక నౌపచారికప్రసంగమందు బ్రహ్మమున్ననిపించి కొందురు। ఇట్లనిసర్వమురమణీయ్యము॥ * * * * *

గద్య, ఇది సాత్త్విక బ్రహ్మవిద్యా విలాస నిరసన మందు బ్రహ్మత్వ ప్రతిపాదకమనునది చతుర్థప్రకరణము.



## ❋వైదికప్రశంస❋

శ్రీపరమవైదికాచా।రాపాద్యునితలతు దాశరథిరచితసప్ర్యా పర్యాప్తున్ భసితా । లేపాంగుని చందవోలిలింగోద్భవున్॥ వైదికమనంగా మూడువిధములది పరమవైదికమున్ను వైదికమున్ను మిశ్రవైదికమున్నుఅని । యిందుకువచనప్రమాణం।వైదిక్రియమిత్యాహూరాద్యంపరమవైదికం । ద్వితీయ్యాంవైదికంప్రోక్తం తృతీయ్యాంమిశ్రవైదికం।అని। యిందుకులక్షణం॥శ్లో॥ వేదాంతదేవస్యతప్తచక్రాదిధారణం । ధవళచ్ఛిద్రోర్ధ్వపుండ్రం శ్రీదష్టాక్షరీజపం । సాలగ్రామార్చనంముఖ్యం తదీయ్యాంఘ్రిసేవనం । శ్రీమన్నారాయణంనామ ఏకాదశ్యాముకామ్యకం। భక్తిదాష్టకమేతాని సర్వేపరమవైదికె। అని,దిపరమవైదికలక్షణం గంగాగీతాచగాయత్రీతు లసీగోపిచందనం। ఏకాదశీహరేర్నామసాలగ్రామశిలార్చనం । వైదికాష్టకమేతాని నియమేనదినే।అని,వైదికలక్షణం । ఆదిత్యమంబికాంవిష్ణుం గణనాథంమహేశ్వరం। పూజయేత్పంచపూజ్యాశ్చతత్తత్ఫలమవాప్నుయాత్ అని, మిశ్రవైదికలక్షణం। యికవీటికిఫలములు—ఐహికంపారత్రికంచమోక్షఏతత్ఫలత్రయం । యద్భావేనపుమానిచ్ఛేత్తద్వన్మిశ్రవైదికె । రాజసంవైదికంవిప్ర సత్వంపరమవైదికం । వంచతామసంజ్ఞేయంతత్రైవంమిశ్రవైదికం । తమఃపరస్తాత్పరమంపదంప్రాప్నోతివైష్ణవః । స్వర్గాదిబ్రహ్మలోకాంతం ప్రాప్నోతివైదికః । కైలాసనామమంధరం పదంప్రాప్నోతినైరుకః

క్|అని—ఇత్యాదివచనప్రామాణ్యముచేత వైష్ణవపరమవైదికశబ్దములు పర్యాయపదములుగా వ్యవహరించినారు । గనకాను,లక్షణైక్యము గలిగియున్నదిగనుకను,తప్తముద్రాభిద్రోర్ధ్వపుండ్రాది చిహ్నములుగలది,పరమవైదికం । శైవముతామసము।యీతప్తముద్రాభిద్రోర్ధ్వ పుండ్రాదిధారణము।శ్రుతివిహితమైనందుకు ప్రమాణము । అథర్వణమహోపనిషత్తున బ్రహ్మసూక్తమందున్ను । దక్షిణేతుభుజేవిప్రోబిభృయా ద్వైసుదర్శనం। సవ్యేతుశంఖంబిభృయాదితి బ్రహ్మవిదోవిదుః । ఖాండవవేదము, "దేవా స్తాయేనవిద్ధృతేనబాహునా సుదర్శనేప్రయాతం । స్వర్గమయాంకితామన వాలోకవిసృష్టవితత్వయంతి, బ్రాహ్మణస్తద్వయతి । సర్వావై దేవతానాంసర్వావై విప్రాణాంసర్వావై క్షత్రియాణాంసర్వావై వైశ్యానాంసర్వావైశూద్రాణాం ఇత్యగ్నినావైతూతాతప్తంచక్రంద్విభుజేధారయామ్యర్ధ్వంతూలిఖేత్తస్మా ద్ద్వి రేఖంభవతిపునరాగమనంనయతి బ్రహ్మణస్సాయుజ్యగ్ సలోకతామాప్నోతి"అని। ఇదిగాకమరిన్ని అథర్వణబ్రహ్మసూక్తరుచి బాష్కలయజుర్బృహదారణ్య భేదసుదర్శనోపనిషదృక్సామయజుఃకారక కఠవల్లీకైవల్యతుంగ శాఖలందున్ను, వృద్ధమనువాసిష్ఠవిహగేంద్ర శాండిల్యాదిస్మృతులందున్ను పరాశరవిష్ణువామనాదిత్య లింగాగ్నేయ బ్రహ్మకైవర్త బ్రహ్మాండపద్మవరాహగారుడాది సంహితాహరివంశములందున్ను చెప్పియున్నది,చూచికొనేదనిన్నిఇత్యాదిప్రమాణపురస్సరముగా తప్తముద్రాది చిహ్నములుగల వైష్ణవము పరమవైదికమని సాధించికొన్నారు। వారుపరమవైదికమనుకొన్నమాటె సత్యముయేలాగంటె।పరం।అవైదికంఅనెపదవిభాగముచేతసమర్థించితె।పరం। ఉత్కృష్టమైన అవైదికలక్షణమునకు సరిపోయ్యాని, అందుకు। ఇదంతయుకల్పితాభాసనిర్ణయముగాని యథార్థముగాదదెట్టువలెనంటె। తప్త

ముద్రాదిధారణము వైదిక మాత్రవిషయమైననుపరమవైదికత్వము సంపాదించికొంటిమని సంతోషించికోవచ్చును. మొదలికివైదికకర్మాధికారముద్విజ మాత్రునికల్లావిహితమైనదిగాదు, పరమవైదికుని కేలాగువిహితమయ్యాని, అయితేవారుదాహరించిన శ్రుతులుప్రమాణములుగావా అంటెకావు. యేటువలెనంటే వారుదాహరించిన వచనములున్ను మరియున్నుదాహరింపగల వచనములకన్నిటికి న్నుత్తరముచెప్పెము "దక్షిణేతుభుజే" విప్రో" అనేశ్రుతిన్ని "చక్రంబిభర్తివపుషాభితత్వం బలందేవానామమృతస్యవిష్ణోః సయాతినాకందురితా విధూయ" అనేశ్రుతిన్ని ఖిలసంహితలలోనివనిఅన్నారు గనకానీశ్రుతులు వైష్ణవులుదక్కనితరులైన కల్పసూత్రకారులుగానీ స్మృతివ్యాఖ్యాతలైన విజ్ఞానేశ్వరచంద్రికాకారులుగాని ఉదాహరించుటలేదుగనకాను శ్రుతిస్మృతివిరోధన్యాయముగల్గి యున్నదిగనకాను కల్పితములనితోచుగానివిశ్వాసయోగ్యములైయుండవు. అయితే "చరణంపవిత్రంవితతంపురాణంయేన పూతస్తరతి దుష్కృతాని। తేనపవిత్రేణశుద్ధేనపూతా అతిపాప్మానమరాతింతరేమ" అని "లోకస్యద్వారర్చి మత్పవిత్రంజ్యోతిష్మద్భ్రాజమానంమహస్వత్। అమృతస్యధారాబహుధాదోహమానంచరణం నోలోకేసుధితాందధాతు" అని, "పవిత్రంతే వితతంబ్రహ్మణస్పతె ప్రభుర్గాత్రాణిపర్యేషివిశ్వతః। అతప్తతనుర్నతదామో అశ్నుతె శృతాసఇద్వహంతస్తత్సమాశత" అని, యీలాగుచరణశబ్దపవిత్రశబ్దప్రయోగముచేత చక్రమనితోస్తున్నది, గనుక చక్రాదిధారణము పవిత్రత్వమును సంపాదకమైయున్నది గనుక ప్రాగుక్తఖిలశ్రుతులకున్ను తిత్వప్రామాణ్య విశ్వాసమెకలదంటిరా, అవును, మొదలికిత్యుక్తశ్రుతులందు చక్రాదిధారణవిధానము గలిగియుంటే "చరణఖిలశ్రుతులకు ప్రామాణ్యము గెలిగెది, అదేటువలెనంటే "చరణ

విత్రం" అనేవాక్యమున్ను "పవిత్రంతె వితతం బ్రహ్మణస్పతె" అనేది
న్ని దశాపవిత్రసోమధారా ప్రవర్గ్యఘర్మాది ప్రతిపాదకములై
బోధాయ నాపస్తంబాదులచేత అరుణకేతునఘమాద్యభీష్ట వాదీ
శానాగ్నేయదిగ్జపాదులందు వినియోగింపబడ్డవి, గనుక వినియోగ
విధాయకత్వముల కనుకూలమైయున్నదది గనుక చక్రాదిధార
ణవిధిపరత్వము దుర్లభమాయెను - ఇదిగాక అపామేఘ్యలలో
చరణోష్టిలో, చరణంపవిత్ర మిత్యాదిమంత్రము పురోనువాక్యన్ని,లో
కస్యద్వారమన్నది యాజ్యానుగనుక తదనుగుణముగానై నావ్యా
ఖ్యానము సేయదగినది, యెటువలెనైనానేమి యీమంత్రములు పాం
చరాత్రాగమ వచనములచేత సుదర్శనప్రతిష్ఠాస్నప నాదులందు
వినియోగింపబడినవగుట బట్టి, విని యోగానుసారమున చక్రా
దిధారణ పరంగానున్ను వ్యాఖ్యానము సేయదగినవని యొకయు
క్తి గలదైనాగానీ యీతంత్రవినియోగముగడవ శ్రౌతవినియోగ
ముబలవంతమనే న్యాయముచేత బోధాయనాపస్తంబాదశ్రౌత
వినియోగానుసారమున నేదశాపవిత్ర సోమధారాది పరత్వ
ముగానె వ్యాఖ్యానము సేయదగినది, అవుగాక? సుదర్శనప్రతిష్ఠా
దులందు విధాయకత్వముగలుగుగాక? అది యీమంత్రమందే నా
పరొక మంత్రమందా యెక్కడావినబడదు గనుక పరొకమంత్ర
మందనేమాటలేదే యీమంత్రమందే అంటేమిక్కిలిగూడదు, కొం
తభాగము వినియోజకమున్ను కొంతవిధాయకమున్నంటే అత్మన్య
యమవుచున్నది, గనుక నదిగాకవినియోగత్వశేషత్వము లేక కా
నివిధాయకత్వమున్ను ముద్రాధారణ విధాయకత్వము లేక కాని
వినియోగశేషత్వమున్ను గలుగదు, గనుక నన్యోన్యాశ్రయ దోష
మున్ను ప్రాపించును, కొన్నియెడల మంత్రలింగ సామర్థ్యముచే
త పరొకకర్మమందు వినియోగింపబడినపద్ధటికిన్ని ఆమంత్రముల
కుప్రకరణానుగుణ్యముగానే వ్యాఖ్యానము సేయదగును గాని

వినియోగానుసరణమునగూడదు, కొన్నియెడలను ప్రకరణవినియో
గములోనగూడదును యీమంత్రమునందునే వరసచూచినాచక్రా
ధారణవినియోగ ప్రసంగము లేదు- మరొక మంత్రముచేత వినియు
క్తమైనదంటిరా శ్రుతివాక్యముచేతనా అశ్రౌతవాక్యముచేతనా
శ్రుతివాక్యమంటే దశాపవిత్రసోమధారా ప్రతిపాదకత్వమున్ను
ఈశానాగ్నేయ దిగ్జపాదులందులవినియోగమున్ను వినాచక్రా
ది ధారణాదులందుల నొకానొకటిన్ని వినియోజక శ్రుతివాక్యాం
తరమువినబడదు గనుక లేదే! పాంచరాత్రాగమవాక్యముచేత న
టేనది తాంత్రికమగుగాని శ్రౌతముగానేరదు అయితే "యేనపూత
స్తరతిదుష్కృతాని" అనేపాపనివృత్తి హేతుత్వము చక్రమందు గల
గియున్నదిగదా అంటే ధ్యానజపాదులచేత సంభవించును - అదె
క్కడిమాట పవిత్రపూతశబ్దములచేత తప్తముద్రాధారణమే ప్ర
కటమగుచున్నదంటే "దేవోవస్సవితోత్పునాత్వచ్ఛిద్రేణ పవిత్రే
ణ" అనేమంత్రముచేత సూర్యముద్రా ధరించుకొనవలయును - ఇం
క "పవిత్రంతెవితతం" అనేమంత్రమున్ను కృచ్ఛ్రచాంద్రాయణాది త
పస్సులచేత తప్తముగావలెనని చెప్పుచున్నదిగాని తప్తముద్రాధా
రణము చెప్పుటలేదు, ప్రకరణవిరోధము గలిగియున్నదిగనుక న
వలెనే "తపసాబ్రహ్మవిజిజ్ఞాసస్వ" అనివున్నది తపమనంగానుపవా
సాదులు, ఆలాగె "అతపానశనాత్" అనిశ్రుతిమరిన్ని "సత్యేనలభ్యస్త
పసాహ్యేషఆత్మా" అని "తమేతం వేదానువచనేనబ్రాహ్మణావివి
షంతియజ్ఞేనదానేనతపసానాశకేన" అని, ఆరణ్యవచనముచేత త
స్తాపమునకు మోక్షప్రాప్తిన్ని చెప్పఉన్నది, అదెక్కడిమాటంటే "వ్ర
త్తైగాత్రాదగ్నినాపచ్యమానాదభిశూలంనిహితస్యావధావతే" అ
నేశ్రుతివాక్యముచేత శూలముద్రయును ధరించికొనే వలసివచ్చు
ను, ప్రకరణాద్యనుగుణ్యవిరోధము రెంటికిన్నిసమానమె గనుక ఇం
దుకొరకు "పవిత్ర [illegible] నం" అ
[illegible] చక్రలాక్షి [illegible] ద్వారసుదర్శనం"

కల్పితనిఘంటు వాక్యమున్ను ప్రకరణాదివిరోధానబట్టిన్ని లోక వ్యవహారగృహీత సంకేతనిఘంటు విరోధానబట్టిన్ని ప్రామాణికులైన ఇతర శ్రౌతస్మార్త గ్రంథకారులు పరిగ్రహించుట లేదు । గనకిన్ను శ్రీశాస్త్రిమందు "పవిత్రంచరణంసవిః" అనేసంకేత వాక్యము పౌరుషమాయె గనకననాదిశ్రుతివ్యాఖ్యాన సమర్థముగాదు, ఇటువలెను ప్రత్యక్షశ్రుతి సంవాదము దొరకదాయెగనక నిఖిలశ్రుతుల ప్రమాణములాయెను । అయితే "దక్షిణేతుభుజే విప్రః" అనేవాక్యమున్ను "ధృతోర్ధ్వపుండ్రః కృతచక్రధారీ" అనేదిన్ని పారమేశ్వరాది వైష్ణవాగమములందును పబృహించి నారుగదాఅంటె । ఆపాంచరాత్రాది వైష్ణవాగమములు ప్రమాణములుగావ దెటువలెనంటె॥ శ్లో॥ కాపాలంపాంచరాత్రంచయామళంవామమహార్హతం । ఏవంవిధాని చాన్యాని మోహనార్థాని తానితు। అని। బ్రహ్మాండపురాణము ॥ శ్లో॥ కాపాలం లాకులంవామం పాంచరాత్రం తథైవచ । పరాశరపురాణం । ధర్మాధర్మాది విజ్ఞానేత్వాగమాః పురుషోదితాః । పాంచరాత్రాదయస్సర్వేన ప్రమాణమితిస్థితిః । స్కాందపురాణము । పాంచరాత్రాదిమార్గాణాంవేదమూలత్వమాస్తికె। నహిస్వతంత్రాస్త్వితేనభ్రాంతిమూలాని రూపణె! అన్ని, అయితే వేదోపబృంహకములైన పురాణగణనలోనిదైన పాద్మోత్తరభాగమందున "ఇదంమహోపనిషదిప్రోక్తంచక్రాది ధారణం" అనిపలుకు చున్నది గనక । ఖిలశ్రుతులకు ప్రామాణ్యముగలిగేనంటె ఆవాక్యము తంత్రానుసరణమున పాంచరాత్రాద్యాగమానుసారిగనక పురాణవాక్యమైనా ప్రమాణముగాదు। ఆలాగె పరాశరపురాణం॥ శ్లో॥ యత్తుతంత్రానురోధేనకథితం తత్పరిత్యజేత్ । పురాణేధర్మశాస్త్రేవా య

త్మత్వో వైదికోద్విజః। అని, తంత్రానురోధమునబలుకుట - యెలాగు న జెలియవలెనంటె। ఆపరాశరుడె తెలిపెను॥ శ్లో॥ పురాణేధర్మశాస్త్రే వాయో ర్థశ్రుత్యావిరుధ్యతె। సతంత్రార్థ స్తువిజ్ఞేయస్సర్వదానైవవైదికే । స్మృతయశ్చపురాణానిభారత ప్రముఖాన్యపి క్వచిత్కదాచిద్భ్రష్టానాం - వేదాద్ధర్మాన్ బృవంతిచ । అని, శ్రుత్యాది విరుద్ధమగుట, యెటువలెనంటె నీప్రకరణమందె తర్వాత జెలిపెము । అదిగనక - పద్మవరాహాది పురాణములను భారతమందు జెప్పిన శ్రౌతవిధాన ప్రశంసఅశ్రౌత విధానమునకు శ్రౌతత్వము సంపాదించి ఉత్కర్షించే అర్థవాద లక్షణముగా జెలియబడెను । అయితేనీలాగున । శ్రౌతముగానిదె శ్రౌతమనిఔపచారికముగా వర్ణించు టెక్కడనైనాకలదా అంటె కలదు ఆపస్తంబాదిముని ప్రణీతకల్ప సూత్రములలోనిదైనవైఖానస సూత్రములున్న శ్రౌతమని ఆపాదోత్తరభాగ మందెవైష్ణవాహ్నికకథనమందుకీర్తించినారు॥ శ్లో॥ శ్రుతిస్మృత్యాగమప్రోక్తం ష్ణ్వారాధనమాచరేత్। అని, ప్రారంభించి "శ్రౌతంవైఖానసంప్రోక్తంస్మార్తంవాసిష్ఠముచ్యతె। పాంచరాత్రాగమప్రోక్తమంత్ర మోక్తంతదుచ్యతె। అని, యీలాగేఅని తెలిసికొనేది । ఇక ప్రత్యక్షశ్రుతులని ఉదాహరించిన చరణంపవిత్ర మిత్యాదిమంత్రములన్నథాసిద్ధములై చక్రాదిధారణవిధాయకములా యెగనక । ఖిలసంహితావాక్యములకు శ్రౌతత్వాశ్రౌతత్వ శంకనివర్తింపవలెను । అదిగనకనేత ప్తచక్రాది ధారణమందు నిత్యాది వైదిమంత్రము లుచ్చరింపుచూ జేయుమని వినియోగించుట లేదు మరిమంటే ఆగమ మంత్రోచ్చారణము చేతనే సేయవలెనని వినియోగించినారు - అటువలెనే। విహగేంద్రసంహితయందు। విష్ణ

వాక్యం॥ శ్లో॥ అగ్నినైవతుసంయుక్తం చక్రమాదాయమామకం। దక్షిణం బాహుమూలస్యంద హేద్విగతసాధ్వసః । అథవాక్యేనకేనాపివైష్ణవేనమహాత్మనా । లాంఛనంబిభృయాచ్చక్రం పాంచజన్యంతథైవచ । ఉచ్చారయన్నిమంమంత్రంహృదయె మాంవిచింతయన్ । సుదర్శనమహాజ్వాల కోటిసూర్యసమప్రభ । అజ్ఞానాంధస్యమె దేవవిష్ణుమార్గం ప్రదర్శయ । పాంచజన్యనిజధ్వానధ్వస్తపాతకసంచయ। పాహిమాం పాపినంఘోర సంసారార్ణవపాతితం । ఇతిమంత్రంసముచ్చార్యదహేత్స్వయంభుజంతథా । ఏతేనైవ విధానేన శంఖంచక్రంచధారయేత్ । త్రిషులోకేష్వసందిగ్ధామద్భక్తఇతిగీయ్యతే । అని । అదిగనకముద్రాధారణము తాంత్రికముగానిశ్రౌతముగాదు, అయితె । నిష్కలం నిరాఖ్యాతఃశుద్ధో దేవఏకో నారాయణః । అని । నారాయణోపనిషత్తున శుద్ధుడనిచెప్పె గనకసకల జనాప్తుడున్ను సర్వజ్ఞుడునైననారాయణుడు జెప్పిన ఆగమమప్రమాణముగాదు గనక ఆగమోక్తమైనాచక్రధారణము విహితమెఅంటిరా । అటువంటి నారాయణుడు జెప్పినబౌద్ధాది మతశాస్త్రములున్ను ప్రమాణములే అవును, తదుక్తాచారములున్ను వైదికములేఅవును । అయితె । మాయామోహేనాయమఖిలాన్ దైత్యాంస్తాన్మోహయిష్యతి। అనిన్ని, ఏవమోహంసృజామ్యాశు యోజనాన్మోహయిష్యతి। అనిన్ని, వరాహవిష్ణుపురాణాదివాక్యములచేత రాక్షసమోహనార్థమై సంకేతించిచెప్పినాడని కనిపించెగనుక బౌద్ధాది శాస్త్రములప్రమాణముగుట సకలమతసమ్మతమాయెను- పాంచరాత్రమైతె, ఇదంమహోపనిషదంచతుర్వేదసమన్వితం । సాంఖ్యయోగకృతంతే

షుపాంచరాత్రానుశబ్దితః । అని, భారతమందు మహోపనిషత్తున్ని చతుర్వేదసమ్మతమనిన్ని చెప్పబడ్డది- గనుక నేలాగున మోహనార్థమనవచ్చునంటే ఇదిన్ని బౌద్ధాది శాస్త్రములవలె మోహనార్థమై సృజించినందుకు ప్రమాణము దెలిపెను- కూర్మపురాణమందుభగవద్వాక్యం॥ శ్లో॥ తస్మాద్వై వేద బాహ్యానాం రక్షణార్థాయపాపినాం। విమోహనాయశాస్త్రాణి కరిష్యావో వృషధ్వజ।ఏవంసంబోధితోరుద్రో మాధవేనమురారిణా।చకారమోహశాస్త్రాణి కేశవోపిశివేరితః । కాపాలంలాకులంవామం భైరవం పూర్వపశ్చిమం । పాంచరాత్రంచ కాలంచ తథాన్యానిసహస్రశః అని, పాంచరాత్రమున్ను కొంత మోహనార్థమున్ను కొంత వేదబాహ్యుల నిమిత్తమున్నయ్యే వేసృజించుట, ప్రమాణపురస్సరముగా దెల్పితిమి గనుక వైదికులకుప్రమాణముగాదు-ఉపనిషత్తునకైన శుద్ధత,నారాయణునికి వాస్తవశుద్ధివిషయముగాని వ్యావహారిక శుద్ధివిషయముగాదు - మహామోహాఖ్య పురుషాదిరూపధరుడున్ను గనుక అయితె పాంచరాత్రోత్కర్షపరములైన భారతాదివచనములకేమిగతిఅంటే వేదముఖమునధర్మాధర్మములు తెలుసుకొన నధికారములేని స్త్రీశూద్రాదుల కుపకారముగారచించిన శాస్త్రముపంచమవేదమనిప్రశంసించినట్టువలెను॥ శ్లో॥ అత్యంత స్ఖలితానాం తుప్రాణినాం వేదమార్గతః । పాంచరాత్రా దయోమార్గాః కాలేనైవోపకారకాః। అనేస్కాందవాక్యము చేతను॥ శ్లో॥ క్వచిత్ క్వచిద్భ్రష్టానాం వేదాద్ధర్మాన్ బృవంతిచ । అనే పరాశరవాక్యము చేతనున్ను వేదమార్గపరిభ్రష్టులైన వ్రాత్యాదులకు కాలాంతరమందును పకరింపజేసేది. గనుక వారినిమిత్తమే మహోపనిషత్తున్నుచతుర్వేదసమ్మతమనియును పచరించుటగా దెలిసికొనేది.

గే భారతమందు భీష్మవచనమున్న॥శ్లో॥ సాత్వతంవిధిమాశ్రిత్యప్రోక్తః సంకర్షణేనతు। ద్వాపరస్యయుగస్యాంతె చాదౌకలియుగస్యచ। అని, వేదోక్తధర్మములు నడవనధికారములేని కలియుగాదికాలముల కుపయోగించునని నుతించుటాయెను - అదిగనుక తప్తముద్రోర్ధ్వపుండ్రాదులకు శ్రౌతత్వముదుర్లభమాయెను- ఆలాగె పరాశరపురాణము॥ శ్లో॥ శ్రౌతలింగంతు విజ్ఞేయంత్రిపుండ్రోద్ధూళనాత్మకం । అశ్రౌతంతూర్ధ్వపుండ్రాదినైవతిర్యక్త్రిపుండ్రకం। అనిఉన్నది అయితె నారదీయోపపురాణమందు॥శ్లో॥ యజ్ఞోదానం తపోహోమః। స్వాధ్యాయః పితృతర్పణం। భస్మీభవతితత్సర్వమూర్ధ్వపుండ్రంవినాకృతం । అనిన్ని , బృహన్నారదియ్యం॥ శ్లో॥ ఊర్ధ్వపుండ్ర ధరోయస్తుతులసీమూల మృత్తికాంతస్యైవనేత్రం తస్యస్యాన్మాధిదో ర్బిభుర్యాత్కళాం । అని। విష్ణుధర్మోత్తరము ॥ శ్లో ॥ గంగామృదోర్ధ్వపుండ్రంయంబిభర్తిని టలెయదా । తద్దైవతస్యపి తరోబ్రహ్మలోక మవాప్నుయుః। గంగాతీరమృదాయస్తు బిభృయాదూర్ధ్వపుండ్రకం । తన్నరంయేనిరీక్ష్యంతెతె యాంతిత్రిదివంనరాః । అని । సత్యవ్రతుడు॥ శ్లో॥ఊర్ధ్వపుండ్రో మృదాశుద్ధోలలాటె యస్యదృశ్యతె । సచండాలోపిశుద్ధాత్మాపూజ్య ఏవనసంశయః । అని । యీలాగె హారితస్మృతియందు నూర్ధ్వపుండ్ర తప్తముద్రాదులు వైదికులకు విధించి యున్నవి । ఏతన్మూలములైన । ధృతోర్ధ్వపుండ్రమిత్యాదిశ్రుతులు ప్రమాణములుగావాఅంటే । స్మృత్యాదివచనము లెల్లా నితరవచనముల చేత నిందింపబడ కుండవలెను- యీవిధమున బహుతరముగా నిందింపబడినవిగనక నీవచనములు మూలశ్రుత్యను రూపకములుగావు - యెక్కడ నిందించినారంటె

తెలిపెదము । విష్ణుస్మృతి । శంఖంచక్రం మృదాయస్తు కుర్యా
త్తాయసేనవా । సశూద్రవద్బహిష్కార్య స్సర్వస్మాద్ద్విజక
ణః । యథాశ్మశానగంకాష్ఠమనర్హం సర్వకర్మసు । తథా
క్రాంకితోవిప్రోప్య నర్హస్సర్వకర్మసు । శంఖచక్రాద్యంకన
చనృత్తగీతాదికంతథా । ఏకజాతేరయంధర్మో నద్విజాతేః క
చన । అని । బృహన్నారదియ్యం । యస్తుసంతప్తశంఖాదిలి
హ్నపశుర్ద్విజః । ససర్వస్మయనాభోగీచండాలః కోటిజన్మ
చక్రాంకితతనుర్వాపి రాజన్లింగాంకితోపివా । నాధికారీస
యఃశ్రౌతస్మార్తేషుకర్మసు। గోబిలస్మృతి॥ శ్లో॥ శ్రౌతస్మార్త
యావిప్రోనాంకయేదంగమాయుధైః । అపివిష్ణ్వాదిసంబంధై
పూర్వాపతితోభవేత్ । అజ్ఞానాదథవాలోభాద్వాగతోవా
ర్శనం । ధత్తైకులఘ్నంతం దృష్ట్వాసవాసాజలమావిశేత్ ।
జాగ్రంసలిలెనైవ విలిఖేద్యఃసుదర్శనం । వేదాంతజ్ఞానవా
పి దహత్యాసప్తమంకులం । అని । పరాశరపురాణం॥ శ్లో॥
ర్ధ్వపుండ్రం త్రిశూలంచ వర్తులంచతురశ్రకం । ధారయ
లాటేతుమనుష్యాః పాపకర్మిణః । శంఖచక్రగదాపద్మ
పాశాంకుశాదిభిః । అంకితాశ్చభవంత్యజ్ఞామనుష్యాః పా
ర్మిణః । ఊర్ధ్వపుండ్రంత్రిశూలంచవర్తులంచతురశ్రకం।
చందాదికంలింగం వేదనిష్ఠోనధారయేత్ । స్కాందం । 
నంవిగ్రహేకుర్యాద్వేద పంథానమాశ్రితః । పుండ్రాంతర
మాద్యాపిలలాటెనైవధారయేత్ । బోధాయనః । నాం
న్నదహేద్దేహం దహేచ్చేత్కామకారతః । నాధికుర్వంతి
గాః శ్రౌతస్మార్తేషుకర్మసు । శాతాతపః । అంగేషు
యేద్విప్రోదేవతాయుధలాంఛనైః । అంకయేద్యదివామో
తత్యేవనసంశయః । గౌతమః । ఉత్తప్తలోహదండేన నా
విప్రస్స్వచిద్దహేత్ । యమః । నాంకయేన్నదహేద్దేహం

యుధలాంఛనైః । దహనాల్లేఖనాద్విప్రః పాతిత్యంయాతి తత్క్ష ణాత్ । సూతసంహిత। స్వదేహే పరదేహేవాన కుర్యాదంకనంన రః। యదికుర్యాచ్చచకాలిద్రైః పతత్యేవనసంశయః। మానవపురా ణం। ఆయుధైశ్శంఖచకాలిద్యైర్నదహేచ్చకదాచన। మనుష్యాణాం తు నామ్నాచ విలిఖేచ్చో౽రసీభగ్రిమాత్ । కేనచిల్లాంఛితామర్త్యా న సాక్షీసర్వదాభవేత్ । శ్రౌతస్మార్తసదాచారేనాధికుర్వంతి లాంఛితాః । లాంఛితాశ్చనసంభాష్యానస్పృశ్యాశ్చ తథైవచ । నదర్శనీయాస్తాన్ రాజాదేశాచ్ఛీఘ్రంప్రవాసయేత్ । స్కాం దం । ఊర్ధ్వపుండ్రంద్విజః కుర్యాల్లీలయాపికథంచన । తదా- కారేణశస్త్రేణభిద్యతేయమకింకరైః । అని, ఇత్యాదినిరస్తవచన ప్రాచుర్యమున్నది గనుక ఊర్ధ్వపుండ్ర తప్తముద్రాదిధారణము వైదికవిషయముగాదు విహితప్రతిషిద్ధమై తెపికల్పమగు ననగూ డదు, నిషేధవచనబాహుళ్యము గనుకను బహుతరదోషప్రా ప్తిచెప్పియున్నది గనుకను - ఆలాగుజైమినిసూత్రము "భూయా సాంస్యాత్సధర్మః" అని, బహుత్వమె ప్రమాణమనెగనుక నయితే నూర్ధ్వపుండ్రాది స్థాపకములైన స్మృత్యాదివచనముల కేమిగతి అంటేచెప్పేము-వారుదాహరించిన శ్రుతులందు రెండువిధములై కనుపించుచున్నది అర్చనాంగమొకటిన్ని శూద్రాదివిషయమొక టిన్ని అదిగనుక నీరెండుదెరంగులననుసరించి ఆయాప్రకరణ మందును తర్కించుటగాదెలిసికొనేది యీరెండువిధములున్ను వివరించేము, అందులోనర్చనాంగమనంగా నెటువంటిదంటే దె లిపేము, అర్చనాంగమున్ను రెండువిధములందు చిద్రోర్ధ్వపుం డ్రమాత్రము గోపిచందనమనంగాతీ రతులసీమూల మృత్తికాదుల చేతనొకటధరించికొని విష్ణుపూజచేసేది, ఒకప్రకారము కలదందు కుప్రమాణము నారదియ్యసంహితయందు చతుస్సప్తతితమాధ్యా యము॥ శ్లో॥ అర్చనాంగంబ్రవీమ్యద్యఊర్ధ్వపుండ్రం యథాశ్రుతి।

ధృతోర్ధ్వపుండ్రః పరయా చ భక్త్యా నారాయణం పూజయతీహ ని
త్యం। అఘూర్ఘ్యాదిభిః పూరుషసూక్తమంత్రైస్స ప్రాప్నుయాద్విష్ణు
పదం మహాత్మా। అని, ఆలాగే మహోపనిషద్వాక్యమని వారుదాహరిం
చిన శ్రుతి॥ శ్లో॥ ధృతోర్ధ్వపుండ్రః పరమేశితారం నారాయణం సాం
ఖ్యయోగాభిగమ్యం। జ్ఞాత్వా చరయిత్వా చ నరః ప్రముచ్యతే సం
సారపాశైరిహ చేతి విష్ణుం। అని, ఇక రెండో అర్చనాంగలక్షణ
ము చెప్పేము, యీలాగే అభిద్రోర్ధ్వపుండ్రముధరించి తప్తచక్రా
ద్యంకితులై విష్ణుపూజ చేసుట వొక ప్రకరణము- ఆలాగె భారత
భీష్మపర్వము॥ శ్లో॥ బ్రాహ్మణైః క్షత్రియైర్వైశ్యైః శూద్రైశ్చ కృతల
క్షణైః। అర్చనీయశ్చ సేవ్యశ్చ నిత్యయుక్తైస్స్వకర్మసు। సాత్వతం వి
ధిమాస్థాయ గీతస్సృత్తావర్షణే చ। అని, కృతలక్షణైః, అనంగా శంఖ
చక్రాదివిష్ణుచిహ్నములు గలవారైఅనుట ఆలాగె కఠవల్లీస్థవాక్య
మని వారుదాహరించిన శ్రుతి॥ ధృతోర్ధ్వపుండ్రః కృతచక్రధారీ వి
ష్ణుం పరం ధ్యాయతి యో మహాత్మా। స్వరేణ మంత్రేణ సదాహృదిస్థి
తం సయాతివిష్ణోర్భవనం విచిత్రం। అని, యీలాగు తాముదాహ
రించిన శ్రుతులనె అర్చనాంగమని తెల్పితిమి అయితే విష్ణుపూ
జాంగమై తప్తముద్రోర్ధ్వపుండ్రములు విహితమాయెగదా సర్వ
వర్ణాశ్రమస్థులకున్ను విష్ణుపూజ ఆవశ్యకముగనుక చక్రాదిధా
రణమున్ను సకలవర్ణాశ్రమ ధర్మమాయెగదా అంటే కానేరదు,
శ్రీవిష్ణుపురాణమందే సకలవైదికులనిత్య కర్మపరిసంగమందు॥ శ్లో॥
తతో గృహార్చనం కుర్యాదభీష్టసురపూజనం। అని, మనసువచ్చిన
దేవతను పూజించుమనెగాని విష్ణువునెపూజింపమని ఆవశ్యకము
గా లేదుగనుక నికశూద్రాదివిషయ విహితతప్తముద్రోర్ధ్వపుం
డ్రాదిలక్షణమెటువంటిదంటె- ధవళచ్ఛిద్రోర్ధ్వ పుండ్రబాహు
మూలాంకితతప్తశంఖచక్రాదులుగలది, అందుకుప్రమాణము-చక్రో
పనిషద్వాక్యము ॥తప్త[illegible] ద్విభుజే

ధారయేదూర్ధ్వపుండ్రమాలిఖేత్తస్మాద్విరేఖం భవతిపునరాగమనంనయత్। సబ్రహ్మణఃసాయుజ్యగ్ సమానలోకతామాప్నోతి" అని,యీలాగెవిష్ణుస్మృతి॥శ్లో॥శంఖచక్రాద్యంకనంచనృత్త గీతాదికంతథా।ఏకజాతేరయంధర్మోనద్విజాతేఃకథంచన।అని।ద్విజన్మనః అనంగాబ్రాహ్మణక్షత్రియవైశ్యులకుధర్మముగాదనుట। ఏకజాతేః అనంగానుపనయనసంస్కారాభావముచేతద్విజాతిత్వములేదుగనక నేకజాతిఃవొకపుట్టుగ గలవాడుగనకశూద్రుడు ఆశూద్రునికెధర్మమనుటామెను।దక్షిణేతుభుజేవిప్రోబిభృయాద్వైసుదర్శనం।అనేశ్రుతియందున్న। అవిప్రఃఅని విపరీతరులైన శూద్రాదులనితెలిపెను । ఆయిత్తెఖాండవవేదమని వారుదాహరించినశ్రుతియందు । సర్వేవైవిప్రాణాంసర్వేవైక్షత్రియాణాం సర్వేవైవైశ్యానాం సర్వేవైశూద్రాణాం। అనిసకలవర్ణధర్మముగా విధించెను । ఆలాగేభీష్మ పర్వము॥ శ్లో॥ బ్రాహ్మణైఃక్షత్రియైర్వైశ్యైఃశూద్రైశ్చకృతలక్షణైః। అని, ఇతిహాసపురాణోపబృంహితమైన్నయున్నదిగదా అంటె। అదిస్నిఛిదోర్ధ్వపుండ్రాదిలక్షణముచేత చక్రోపనిషత్సమానార్థకమై యున్నది గనకాను। భీష్మవచనమందున్న। సాత్వతంవిధిమాశ్రిత్య।అని । స్త్రీశూద్రాదివిషయమైన సాత్వతతంత్రోక్తవిధానముచేత బూజింపుమనిఅప్పగింత బెట్టెగనకను వైదిక కర్మాధికారులైన బ్రాహ్మణాద్యుత్తమవర్ణాధికారముగాదు । సాత్వతతంత్రోక్తవైష్ణవధర్మము స్త్రీశూద్రాధికారమగుటకు ప్రమాణమేమంటే। భాగవతదశమస్కంధోత్తరభాగ చరమాధ్యాయమందు॥శ్లో॥త్రివక్రాయా ఉపశ్లోకః పుత్రఃకృష్ణమనువ్రతః।శిష్యఃసాక్షాన్నారదస్యదధ్యౌప్రతమఖండితం। తేనోక్తంసాత్వతంతంత్రంయద్జ్ఞాత్వాభక్తిమాస్

భవేత్ । యత్ర స్త్రీశూద్రదాసానాం సంస్కారో వైష్ణవః స్మృతః । అని,అయితె నీశ్రుతీతిహాసవచనములందున్న బ్రాహ్మణాది చాతుర్వర్ణ్యప్రశంసకు గతియేమంటె । వేదమార్గపరిభ్రష్టులై శ్రౌతధర్మాధికారులు గానటువంటి వ్రాత్యబ్రాహ్మణబ్రువ బ్రహ్మబంధుపతిత పాషండకుండగోళకాదులైన జాతిమాత్రోపజీవులనుటగా దెలిసికొనేదీ । ఆలాగె వైష్ణవసంస్కారప్రతిపాదక పాంచరాత్రాద్యాగమోక్తదీక్షపతితాదివిషమైనందుకు ప్రమాణవచనములు। పరాశరపురాణము॥ శ్లో॥ శ్రుతిస్మృతిపరిభ్రష్టః ప్రాయశ్చిత్తైష్వనున్ముఖః । వేదేతరాగమం శ్రిత్వా తదుక్తం ధర్మమాచరేత్ । వేదేతరాగమములైనందుకు స్కాందవచనము॥ శ్లో॥ పాంచరాత్రాదిమార్గాణాం వేదమూలత్వమాస్తికె। నహిస్వతంత్రాస్తే తేనభ్రాంతి మూలానిరూపణె । అని। పరాశరపురాణమందున్న॥ శ్లో॥ పాంచరాత్రే చకాపాలె పాషండేష్వపరేషుచ । దీక్షితాశ్చభవంత్యేవమనుష్యాః పాపకర్మిణః। యీ పాంచరాత్రమొకటె కాదు -వైష్ణవసంస్కారప్రతిపాదక తంత్రములన్నియునటువలెనె- అని తెలిసికొనేది । వాసిష్ఠలైంగ్యం । తతోవిష్ణోః ప్రసాదేన వేదమార్గాతివర్తినీం । శాండిల్యసంహితాంచక్రె వైష్ణవీంమహతీంమునె । తస్యాంచకుర్వనేదీక్షాం పాషండాః పాపయోనయః । ఆలాగె । వైష్ణవాభిమతమైనహరితస్మృత్యష్టమాధ్యాయము । శాండిల్యఇతివిఖ్యాత స్సర్వశాస్త్రవిశారదః । సతుధర్మప్రసంగేన విష్ణోరారాధనంప్రతి । అవైదికేనవిధినాకృతవాన్ కర్మసంహితాం । అవలంబ్యమతంతస్యకేపితంత్రామహర్షయః। అవైదికేన మార్గేణ పూజయంతిస్మకేశవం । అనికూర్మపురాణె । అథాంశోసత్వతోనామ విష్ణుభక్తః

ప్రతాపవాన్ । మహాత్మా దాననిరతో ధనుర్వేదపరాయణః ।
తేనోక్తం సాత్వతం తంత్రంకుండగోళాదిభిశ్శ్రితం । ప్రవర్తతే
మోహశాస్త్రింవాసుదేవార్చనాన్వితం।అని,అయితే "తస్మాచ్ఛూ
ద్రాణామేవ" అనే చక్రోపనిషద్వచనముచేతనున్ను "యత్ర
స్త్రీశూద్రదాసానాం" అనెభాగవతవచనమునను బట్టి కేవల
శూద్రాదివిషయమైన ఛిద్రోర్ధ్వపుండ్రతప్త ముద్రాధారణాది
దీక్ష వేదమార్గానధికారులైన బ్రాహ్మణవ్రాత్యాదులకు విహితము
గునా అంటే-"అవ్రతానమూచానాః శూద్రసధర్మాణోభవంతి" అ
ని, గౌతమసూత్రమందు వ్రాత్యాదులకు శూద్రసమానధర్మము చె
ప్పినదిగనుక పతితులైనద్విజులకు శూద్రాధికారిఛిద్రోర్ధ్వపుండ్రా
ది సంస్కారము చెల్లును- యీలాగు వేదమార్గభ్రష్టులైన వారు
పాంచరాత్రాది తంత్రోక్తధర్మము నడుచుకొంటె కాలాంతరదే
శాంతరములందునుపకరించును- ఆలాగే స్కాందము॥శ్లో॥అత్యంత
స్ఖలితానాంతు ప్రాణినాం వేదమార్గతః । పాంచరాత్రాదయో
మార్గాః కాలేనైవోపకారకాః । అనిగనుకనే ఆయవైదికధర్మ
యోగ్యమైననుకలికాలాదిని చెల్లునని భారతవచనము॥శ్లో॥ సాత్వతం
విధిమాశ్రిత్యప్రోక్తంసంకర్షణేనయత్।ద్వాపరస్యయుగస్యాంతే
చాదౌకలియుగస్యచ। అనిగనుక తప్తముద్రాదివైష్ణవ సంస్కార
విధాయకమార్గములందుల విప్రక్షత్రియాదిశబ్దములు బ్రాహ్మణ
బ్రువక్షత్రబంధుపతితాది విషయముగాని వైదికకర్మాధి కారిద్విజా
తివిషయముగాదు-ఆలాగె పరాశరపురాణం॥శ్లో॥తంత్రాణితంత్రని
ష్ఠానాంరక్షకాన్యపిచక్రమాత్ । వేదమార్గైకనిష్ఠానాంబాధకాని
విశేషతః । అని, పూర్వోక్తవిష్ణుస్వత్వాదివిరోధబాహుళ్యముగ

∗శాపదగ్ధబ్రాహ్మణులు∗

లదు- తత్పరిహారముశక్యముగాదు గనుక తప్తచక్రోర్ధ్వ పుండ్ర ధారణను బ్రాహ్మణవిషయముగాని మరొకప్రకారమనగూడదు. అయితే నీలాగున పతితానూచానవిషయమైనధర్మమని సకలశాస్త్రఘటఘోషమవుతెరిగియుండిన్ని కొందరుశ్రౌతధర్మాధి కారులైయుండిన్ని యీతాంత్రికధర్మమేనడుచుకొందురందు విశేషించిన్ని దాక్షిణాత్యులైన ద్రావిళ్లుతరుచుగా వైష్ణవతంత్రసంస్కారులైయున్నారిందుకేమిహేతువంటేకలదు- తెలిపేము,పూర్వయుగములందు కొందరుఋషులు బ్రాహ్మణులున్ను గౌతమదధీచిదూర్వాసభృగూపమన్యు కణ్వాదులయెడల నపరాధములుచేసితే వారుగోపించిమీరున్ను మీవంశపువారున్ను కలియుగమందు బ్రాహ్మణాది యోనులబుట్టిన్ని అశ్రౌతమతవైష్ణవ సంస్కారపరులైచెడిపోదురుగాకని శాపములిచ్చినారు గనుక నాశాపమే హేతువైయుండును,ఆలాగేగౌతమశాపము-స్కాందపురాణము॥శ్లో॥ బౌద్ధచార్వామతేచైవపాంచరాత్రేప్యవైదికే । శాక్తేచదీక్షితాయూయం భవేతబ్రాహ్మణాధమాః। అని, కూర్మపురాణైకత్రింశాధ్యాయమందు॥శ్లో॥వామపాశుపతాచారస్తథావైపాంచరాత్రకాః। భవిష్యంతి కలౌతస్మిన్ బ్రాహ్మణాఃక్షత్రియాస్తథా। ఏవంయచ్చభవిష్యంతిశతశోథసహస్రశః । గాయంతిలౌకికైర్గీతైర్దైవతానినరాధమాః॥ కుర్వంతిచోపచారాణిబ్రాహ్మణానాంకులేషువై। అని, యజ్ఞవైభవఖండము॥శ్లో॥శంఖచక్రగదాపాశచాపదండాంకుశాదిభిః। అంకితాశ్రద్ధయాయూయంభవేతబ్రాహ్మణాధమాః । వర్తులాశ్వత్థపత్రార్ధచంద్రదీ[illegible]లింగినః। భవేయుఃశ్రద్ధయాసార్ధం వేదబాహ్య

ద్విజాధమాః। అని, దధీచిశాపము కాశీఖండము॥ శ్లో॥ వేదబాహ్యేషుతంత్రేషు పాంచరాత్రాదిషుద్విజాః। భవేతదీక్షితాయూయంయుష్మాకంవంశజాస్తథా।అంగేషుచాంకితాయూయం శంఖచక్రాంకుశాదిభిః। భవేతశ్రుద్ధయాసార్ధంవేదబాహ్యాద్విజాధమాః।ఊర్ధ్వపుండ్రతధాశూలేవతుర్లెచతురశ్రకే। చిహ్నేవేదవిరుద్ధేచభవేయుః బ్రాహ్మణాధమాః। అని, కూర్మపురాణముదక్షాధ్వరమందు॥శ్లో॥యస్మాద్బహిష్కృతోదేవోభవద్భిః పరమేశ్వరః। వినిందితోమహాదేవః శంకరోలోకవందితః। భవిష్యధ్వంత్రయీబాహ్యాఃసర్వేచేశ్వరవిద్విషః। నిందంతొహ్యైశ్వరం మార్గంకుశాస్త్రాసక్తచేతసః। మిథ్యాధీనసమాచారా మిథ్యాజ్ఞానప్రలాపినః। ప్రాప్యంఘోరంకలియుగంకలిదోషైః ప్రపీడితాః। త్యక్త్వాతపోబలంకృత్స్నంగచ్ఛధ్వంనరకంపునః। భవిష్యతి హృషీకేశఃస్వాశ్రితోపిపరాఙ్ముఖః। అని। అదిగనకనే। భవిష్యత్పురాణమందు॥ శ్లో॥ దూర్వాససోమునేః శాపాత్కుపితస్య మహాత్మనః। కణ్వశాపాద్భృగోః శాపాదుపమన్యోశ్చశాపతః। విప్రాణాందాక్షిణాత్యానాం శాపోపహతచేతసాం। శివేభస్మనిరుద్రాక్షేశ్రద్ధాకించిన్నజాయతె।అని। పరాశరపురాణము। పాపానామపి బాహుల్యాద్దధీచస్యచశాపతః॥శ్లో॥ గౌతమస్యమునేః శాపాత్ శ్రౌతలింగంనరోచతే।అని। యీలాగెకూర్మపురాణము। దధీచశాపనిర్దగ్ధాః పురాదక్షాధ్వరేద్విజాః। యేచాన్యేశాపనిర్దగ్ధాగౌతమస్యమహాత్మనః। సర్వేతేచభవిష్యంతి బ్రాహ్మణాద్యాసుయోనిషు। నిందంతశ్చమహాదేవం తమసావిష్టచేతసః। అని। ఇదేగాకవిష్ణువునుగూర్చి బ్రహ్మయిచ్చిన శాపమున్నొకటిగలదు। పరాశరపురాణము॥శ్లో॥త్వదియ్యాపాంచరాత్రేచ తంత్రేభాగవతేతథా। దీక్షితాశ్చద్విజానిత్యం భవేయుర్నిర్భయా హరే। త్రిశూలేచతురశ్రేవావేణుపత్రోపమేతథా। పుండ్రాం

గాని బ్రాహ్మణవిహితాగ్ని హోత్రజభస్మాది విషయముగా దు॥ఆలాగె॥క్రియాసారము॥ శ్లో॥ శూద్రహస్తస్థితంభస్మద్విజాతి ర్నైవధారయేత్। తథైవాంత్యజతః ప్రాప్తంశూద్రైర్ధార్యంన జాతుచిత్। అని ఇక "బ్రాహ్మణానామయంధర్మోనవర్ణాంతరా ణాం" అనెజాబాలశ్రుత్యుక్త వర్ణాంతరనిషేధము, త్రియంబ కేనమంత్రేణ వేత్యాదితత్రత్యవక్ష్యమాణమంత్రధ్యాన సంయు క్తభస్మధారణవిషయము । ఆలాగె॥పరాశరః॥ శ్లో॥ బ్రాహ్మణా నామయంధర్మో, యత్త్రిపుండ్రస్యధారణం । మంత్రధ్యానాదిసం యుక్తం నైవవర్ణాంతరస్యతు । స్కాందము ॥ శ్లో॥ ధారణం మంత్రతః ప్రోక్తంద్విజానాంమునిపుంగవైః। కేవలంధారణంవిప్రో అన్యేషామపికీర్తితం । అనిన్నీ, ఈలాగుశ్రుతిస్మృత్యాదివచన పర స్పరవిరోధతద్వ్యవస్థాపకత్వాది విభాగలక్షణము తెలియనేరక। సకలవేదవేదాంతభాగమంచు ఘంటాఘోషమైన శ్రౌతభస్మధా రణమును కొన్నిసామాన్యవచనములు సంపాదించికొని ఫలజా త్యాదియుక్తులచేత నధమజాత్యాదివిషయమని యెవరుదూషిం తురోవారు నీచజాతిబుట్టినారని తెలియదగినది, ఆలాగెపరాశర వాక్యం॥ శ్లో॥ యస్యస్యాద్భస్మనిద్వేషస్త్రిపుండ్రోద్ధూళనాదిషు। ఉత్పత్తౌతస్యసాంకర్య మనుమేయంవిపశ్చితా। మహాపాపవతాం న్నూణాంవేదసిద్ధేమహేశ్వరె । త్రిపుండ్రోద్ధూళనాదౌచ ప్రద్వే షశ్చప్రజాయతె । అని। భవిష్యత్పురాణం । విప్రాణాందాక్షి ణాత్యానాంశాపోపహతచేతసాం। శివేభస్మనిరుద్రాక్షేశ్రద్ధాకిం చిన్నజాయతె । అని।వాసిష్ఠలైంగ్యం । యేభస్మధారిణంద్రుష్ట్వా వాచానిందంతిమానవాః । తేషాంశూద్రేణసంభూతి రనుమేయా

విపశ్చితా। యేషాంభస్మనివిద్వేషో వర్తతేహృదయేసదా।సంకీర్తితుభవేద్బ్రహ్మం స్తేషాంవంశపరంపరా। అని।ఆలాగెజాబాలశ్రుతి। త్రిపుండ్రంయేపినిందంతి నిందంతిశివమేవతె। ధారయంతితుయేనిత్యంధారయంతితమేవతె। అని। ఇట్లుభస్మధారణ

ప్ర క ర ణ ము ము గి సి న ది.

## శ్రీజ్యోతిస్తంభాకృత్యురులింగోద్భవం-శ్రీ

శ్రీవిష్ణువు వరాహమున్ను బ్రహ్మహంసరూపమున్నై వచ్చి ఉరులింగాకారమై నడుమనిలచిన రుద్రునిఅడుగులున్ను శిరస్సున్నువెదకి కడగానక తిరిగివచ్చిరని శివరాత్రి మహాత్మ్య లింగపురాణాది తామసపురాణ తామస ప్రకరణములందు చెప్పిఉన్నది. యిది సాత్త్విక శాస్త్రములకు యుక్తముగా డెటువలెనన్నను. యజుర్వేదము॥ఉద్ధృతాసివరాహేణకృష్ణేనశతబాహునా।శ్రీహరివరాహావతారమై నూరుహస్తముల భూమిఎత్తికొనివచ్చి పూర్వప్రమాణమున నిలిపెననియుండగా భూమిమోచిన శేషునికంటె నవ్వలనాది కూర్మమున్నదని మహాసంకల్పప్రమాణము గలిగియుండగా. అందుకుశ్రుతి ॥ క్ష్వాహంతమోమహదహంఖచరాగ్నివార్భూ॥ అని, రోమకూపేష్వనంతాని బ్రహ్మాండానిభ్రమంతివై। అని, అండానాంతుసహస్రాణాం సహస్రాణ్యయుతానిచ। అని. సహస్రశీరుషాపురుషః। అని,పాదోస్యవిశ్వాభూతాని త్రిపాదస్యామృతందివి। అని, ఇత్యాది ప్రమాణములచేత ననంతబ్రహ్మాండములసృష్టిస్థితిలయములకు హేతువైన సహస్రశిరములతోటి మహావిరాట్పురుషుని చెప్పగా నీయొక్క బ్రహ్మాండములోపలి పదేడుగోట్లదలమైన భూమిని వరాహరూపమై త్రవ్వలేకతిరిగివచ్చి ఆ రుద్రు

నితో జెప్పెనని గనుక నిది వైదికశాస్త్రములకు జోరదు - వైదిక శాస్త్ర విరుద్ధములైన ప్రమాణములు ప్రమాణములుగావు- యుక్తియుక్తమున్నుగాదు, యుక్తియుక్తము గాకుండు బెట్లన్నను, సాత్త్విక రాజసములు రెండున్ను హీనాధిక్యములకు వాదింపగా రెంటికిన్ని నడుమవచ్చి తామసము ఘనమాయెనని చెప్పెగనుకను- రుద్రుని అడుగులాదికూర్మమును భేదించికొని దిగిపోవుటనిజమాయె నావరాహముగానె పనిలేదు- శాక యివ్వలనె నిలచెనాశానలేక పోయెననుట పనిలేదు- వరాహమును జెప్పినశ్రుతికి విరుద్ధముగనుకను- యుక్తియుక్తముగాదు అయితె నాపురాణవాక్యముల కే మిగతిఅంటె - ఆరుద్రునిగౌరవము సేయవలసి శ్రీహరినటించినన టనగానున్న గుణమోహ ప్రకరణములుగాను ఎరిగికొనేదని వ్రాసికొన్నారు - ఇది కేవలమున్ను క్షుద్రయుక్తిచేత పరిహార ముగాని లెస్స పరిహారముగాదు- యెటువలెనంటే - తామసత్వ మోహకత్వప్రసంగము పురాణాదికమునకు స్వాభావికముగాక యుంటయును శ్రుత్యాదివిరోధముచేత గలుగుటయును ప్రథమ ప్రకరణమందే లెస్సగా దెలిపినాము - వారు ప్రతినిర్ణయమందున్న అదేఆస్తచేసికొని వ్యవహరించి కొంచున్నారు- అదిగనుక సామాన్యనిర్ణయముగాని విశేష నిర్ణయముగాదు- యుక్తిచేత నే శ్రుత్యుక్తకథనములు ఖండించేదనకావచ్చితే ప్రత్యక్షప్రమాణమే అంగీకరించి వేదాదుల ప్రమాణములని ఖండించిబౌద్ధజైన చార్వాకాదిమతయుక్తులున్నంగీకరింపనే వలయును, కుతర్కమూహించి శృతిస్మృతులు దూషించినందుకు మన్వాదులు దోషము చెప్పినారు॥ శ్లో॥ యోవమన్యేత తెతూభెహేతుశాస్త్రాశ్రయాద్వి

జః। స సాధుభిర్బహిష్కార్యో నాస్తికో వేదనిందకః। అని, అచ్చె
క్కడి మాటంటేనీలాగున నే వామనావతారమై యొక అడుగున
భూలోకమంతా మెట్టి ఒకపాదము స్వర్లోకమందునిచి కడమ
చరణమునకు బలిని విరిచి కట్టివేసి అతని తలమీద నుంచెనని పురాణ
కథయును యుక్తియుక్తమె కాకపోవును. పోనిమ్మనగూడదు, భా
గవతాష్టమస్కంధైక వింశాధ్యాయము॥ బబంధ వారుణైః పాశై
ర్బలిం సుత్యేహని క్రతౌ॥ । అని, పద్వైకేన సమాక్రాంతో భూలోకః
ఖం దిశో దశ। స్వర్లోక స్తద్వితీయేన। అని, ద్వావింశాధ్యాయం॥ పదం
తృతీయం కురు శీర్ష్ణి మే నిజం బిభేమి నాహం। అని, భాగవతకథాయు
క్తియుక్తము గాక పోవును, ఏలాగంటే ఒక పాదము భూమినంతా
వ్యాపించియుండెనా బలియడుగు క్రిందనే పడియుండెను అతని
కట్టివెయనే పనిలేదు లేకున్నట్టాయెనా నాకపాదము మీదికి జాప
నున్న కడమపాదమునకు చోటుజూపమనను న్న పనిలేదు భూమి
యందె అవకాశము గలిగె గనుక ఇది గాక శేషునికంటె నవలకూ
ర్మము మోచియున్నట్టైతె తిరుగా వరాహరూపమై భూమ్యుద్ధర
ణము సేయబనిలేదు యిటువంటి శంకలు చేయుదనకావచ్చితె, మహి
మ్నం॥ శ్లో॥ కిమీహః కిం కాయః స ఖలు కిము పాయ స్త్రిభువనం। కిమా
ధారో ధాతా సృజతి కిము పాదానమితి చ। అనెడిచార్వాకాదికుతర్క
ముపలెనుండెని, అయినా యింతమాత్రమె కాదు విస్తరించెదము
ఊరులింగోద్భవ ప్రసంగమందు విష్ణువడుగులు గానక పోయెనను
ట యుక్తియుక్తమైనందుకు సమాధానము తెలిపేము, భూమిమో
చియున్న కూర్మమట్లెయుండగా రుద్రుని అడుగులు బ్రహ్మాండము
క్రిందికి పోవుగదా ఆకూర్మమూర్తి అయిన శ్రీహరి అడుగులు

గన లేదా అనిన్ని అనేకబ్రహ్మాండకుక్షిన్ని సహస్రశీర్షుడున్ను విశ్వరూపుడున్నైన విరాట్పురుషుడు స్వైరుంగకుండా నాశివలింగమెక్కడ డాగెననిన్ని అనే అభిప్రాయముచేత నీయుక్తి ప్రమోగించినారు ఆలాగె శ్రీహరి సహస్రశీర్షుడున్ను బ్రహ్మాండకుక్షిన్ని అయిన విరాట్స్వైఅవును అయినాగా॥ "విశ్వంనారాయణః" అని, శ్రుతిబాధిస్తున్నది గనుక విశ్వరూపుడైన విష్ణువు "విశ్వాధికోరుద్రోమహర్షిః" అనె శ్రుతిచేత విశ్వాధికుడైన శివునిమహిమమున్ను స్వరూపమున్ను దెలియ సమర్థుడుగాడు, తానువిశ్వము గనుకను పరమేశ్వరుడు విశ్వాతీతుడు గనుకను ఆలాగెపరాశరపురాణం॥ శ్లో॥ తదస్యంవిశ్వమీశానాత్సతువిశ్వాధికః శివః । వినాసాక్షాచ్ఛివంసాంబం ప్రమాణాన్యఖిలాన్యపి । విశ్వాధికతయానాన్యంప్రవదంతికథంచన । అని, యీలాగె పరమేశ్వరుని మహిమమెవరును తెలియలేరని బ్రహ్మవాక్యము. చతుర్థస్కంధం॥ శ్లో॥ నాహంనయజ్ఞానచయస్యయూయంయెదెహభాజోమునయశ్చతత్త్వం। విదుః ప్రమాణం బలవీర్యయోర్వాతస్యాత్మతంత్రస్యకఉద్విధిత్సేత్ - అష్టమస్కంధమందు శివస్వరూపజ్ఞానము బ్రహ్మాదులకు లేదని ప్రజాపతులవాక్యము॥ శ్లో॥ నతెగిరిత్రాఖిలలోకపాలవిరించివైరించసురేంద్రగన్యం। జ్యోతిఃపరంయుత్రిరజస్తమశ్చ సత్వంనయద్బ్రహ్మనిరస్తభేదం । తత్త్రిస్యతెసదసతోః పరతః పరస్యనాంజస్వరూపగమనేప్రభవంతిభూమ్నః । బ్రహ్మాదయః కిముతసంస్తవనేవయంతు తత్సర్గసర్గవిషయా అపి శక్తిమాత్రం । అని, ఆశివుని తత్వమనంగా నిరుపాధికస్వరూపమనుట, అట్టివంటి స్వరూపము, నాహంనయజ్ఞా అని, అహం,

నేనున్ను, యజ్ఞః-విష్ణువునుఎరుగమని బ్రహ్మదేవుడున్ను- నాంజస్వ రూపగమనె అని, శివస్వరూపజ్ఞానమందు బ్రహ్మాదులున్ను శక్తులుగారని ప్రజాపతులు నిశ్చయించినారు- ఆలాగె శ్రీహరిన్ని, చతుర్థస్కంధమందు - ఆరోఅధ్యాయము॥శ్లో॥ అహంబ్రహ్మాచశర్వశ్చజగతఃకారణంపరం । ఆత్మేశ్వరఉపద్రష్టా స్వయందృజ్నిరుపాధికః।యిక్కడ,శర్వః అంటే బ్రహ్మాద్యధికారి,ఇట్లుప్రాయశః పాఠమువలన కాలరుద్రుడనుట,ఆత్మేశ్వరుడనంగా పరమశివుడనుట,నాలుగోవాడుగనుక ఆలాగె‘‘శివంశాంతమద్వైతం చతుర్థంమన్యంతె’’అని, శ్రుతిగలదు గనుక స్వయందృక్ అనంగా నాపరమేశ్వరుడు తనను దానెచూచువాడుగాని యితరులతనినిగానలేరనుట, ఇదిగాకనావేళఅహంబ్రహ్మత్వహంచేతిఅని,అహంకారోద్రిక్తులైనారు గనుక నున్ను కనలేరు, ఆయనఅనుగ్రహముచేతనైతె కందురు,ఆలాగెశ్రుతులు ॥ తమక్రతుంపశ్యతివీతశోకోథాతుః। ప్రసాదాన్మహిమానమీశం।అని,గనకనత్యంతతపస్విలైన అపరోక్షజ్ఞానులైనవారనుట। నారదుడు విష్ణుమాయామోహితుడై ఆడురూపమునొంది బిడ్డలగన్నట్లున్ను। మార్కండేయుడ కాలప్రళయసముద్రమునబడి భ్రమసిపిదపనతని కటాక్షమువలన తెలిసికొన్నట్లువలెను । ఇక్కడనుబ్రహ్మవిష్ణువులాది మూర్తులైనాగాని తమకన్ననధికుడైన శివునిమాయచేత మోహితులై యొకానొక కాలమందు భ్రమసితిరుగా ఈశ్వరకారుణ్యమున తెలిసికొందురు । ఆలాగెనాప్రకరణమందలిబ్రహ్మవాక్యం ‘‘శుకవత్తవవిశ్వేశక్రీడాయై కేవలంవయం’’అనిఅయితె బ్రహ్మవిష్ణువులకున్ను మోహకత్వముకలదా అంటెకలదు, వారివాక్యములనె తెలిపెదము।ఆది

త్స్యపురాణమందు—బ్రహ్మవాక్యము॥ శ్లో॥ త్వన్మాయామోహితః శంభో న వేద్మి త్వాం పరంశివం । అని॥ ద్రోణపర్వము॥ శ్లో॥ సుదుర్లభాక్ దేహివరా న్మమేష్టానభిష్టుతః ప్రతికార్యశ్చ మోహః । అని॥ పాద్మమందున్ను । నశక్తిం భస్మనో జానె ప్రభావం తేకుతో విభో॥ అని అదిగనక యుక్తియుక్తము గాదనుట పూర్తి చాలని ముచ్చట॥ ఇక ప్రమాణము గాదనేటందుకు ప్రమాణప్రాబల్యమును తెలిపెదము॥ శ్రుతి॥ బాష్కలసంహితయందు "యుద్ధేసంయుక్తావుభౌ చదృష్ట్వా బ్రహ్మావిష్ణూరజసాబద్ధవై రౌమథ్యేతయోర్దృశ్యతి జాత వేదస్థాణు రుద్ర తిష్ఠద్భువనస్య గోప్తా దృష్ట్వా స్థాణుముపరవ్యయోద్ధం ప్రతస్థతుర్దూరమసౌ దిదృక్షుర్వ రాహోవిష్ణుర్నిమమజ్జ భూమౌ బ్రహ్మత్సపాతభూమాదివమాశుగృధ్రః । అని, బృహదారణ్యము॥ శివాయనమః శివలింగాయనమః॥ జ్వాలాయనమః॥ జ్వాలలింగాయనమః॥ అని పరాశరపురాణము॥ శ్లో॥ రుద్రాధిక్యమవిజ్ఞాయ బ్రహ్మనారాయణౌపురా॥ అహం బ్రహ్మత్వహం చేతివిభ్రమాదకృతాం రణం॥ క్రోధేనమహతా యుక్తో బ్రహ్మసర్వజగత్పతిః । శశాపవిష్ణుం గర్భస్థో భవత్వితి విమోహితః । ఇత్యాది, శప్తోవిష్ణుర్విరించేన మహామోహవశంగతః । మహాక్రోధేన సంయుక్తః శశాపచతురాననం॥ శంకరేణభవేచ్ఛిన్నం త్వదీయ్యం పంచమం శిరః । ఏవం ప్రస్ఖలితౌమోహాత్తావప్యుభయతో ద్విజ । అవిజ్ఞాయశివాధిక్యం మహామోహస్యవైభవాత్ । అని యింతపర్యంతము తృతీయ్యాధ్యాయమందు చూచుకొనేది॥ వామనపురాణము॥ శ్లో॥ తతః పితామహో దేవః కేశవశ్చ జగత్పతిః । ఆజగ్మతుస్తమద్దేశ్యం యత్ర లింగం భవస్యతు, ఇత్యాది । నైవాంతమంబరాద్బ్రహ్మావిస్మితః పునరాగతః॥ విష్ణుర్గ

త్వాథ పాతాళాన్ సప్తలోకపరాయణః। చక్రపాణిర్వినిష్క్రాంతో లింగం నలభతే ముసే। విష్ణుః పితామహశ్చోభౌ హరలింగం సమేత్యహి।కృతాంజలిపుటౌ భూత్వాస్తోత్రం దేవస్య చక్రతుః । అని యీ వామనపురాణము రాజస మగుగనక ప్రమాణము గాదన గూడదు, పులస్త్యుడు చేసిన వామనపురాణము ప్రమాణము గాదనే దాకా వచ్చితె॥శ్లో॥పురాణసంహితాకర్తా భవాన్ పుత్రభవిష్యతి। దేవతాపారమార్థ్యంచ యథావద్వేత్స్యతే భవాన్ । అనే విష్ణుపురాణవాక్యము చేత పులస్త్యానుగ్రహమువలన పరాశరుడు నిర్మించినది తాము సాత్త్వికమని అంగీకరించిన విష్ణుపురాణమును అప్రమాణమె అవును । అది గనక ఇత్యాది ప్రత్యక్షప్రమాణసిద్ధమైన ఉరులింగోద్భవ ప్రసంగము కల్ల అనుట వేదబాహ్యము, శ్రీరఘునాయకులు సేతువందు లింగప్రతిష్ఠ సేయుటయును బ్రహ్మహత్యానివర్తింపజేసికొనుటయును అసత్యము అది వైదికశాస్త్రములకు చొరదు ఎటువలెనంటె మొదట రావణునికి బ్రాహ్మణ్యము గలిగితెగదా హత్యవచ్చేది హత్యగలిగితెగదా లింగప్రతిష్ఠ సేయుట యథార్థమయ్యేది- వాడు బ్రాహ్మణుడే కాడు - ఎటువలెనంటె ఆచారమువలననా క్షేత్రమువలననా అంశమువలననా కాలమువలననా బ్రాహ్మణుడయ్యేది, యీలక్షణములు ఏమియు లేవు, యేలాగంటె మద్యపానమనుష్యమాంస భక్షణ దేవబ్రాహ్మణద్రోహములు చేయుచున్నాడు గనుక ఆచారమువలన బ్రాహ్మణుడుగాడాయెను ఉభయకుల పవిత్రుడైనా పతితుడాయెనా మరిబ్రాహ్మణ్యము లేదు వానితల్లి సుమాలికూతురైన కైకసి రాక్షసిగనుక క్షేత్రమువలన బ్రాహ్మణ్యము లేదు భగవద్ద్రోహి

మైన హిరణ్యకశిపునంశము గనుక నంశమువలననున్ను బ్రాహ్మణ్యములేదు ఆసురమైన సంధ్యాకాలజనితుడు గనుక కాలమువలననున్ను బ్రాహ్మణుడనలేదాయెను అని, యిటువంటిశంకలు కొన్ని యూహించికొని తమకుతోచినట్టు పరిహరించికొన్నారు, అయితేనేమి,యీయుక్తులు వరుసనేనిరసించెదము,మద్య పానమాంసభక్షణాదులంటే మునుపటి యుగములందు బ్రాహ్మణశ్రేష్ఠులకున్ను జెల్లును, యీవృత్తాంతము కచశుక్ర ప్రసంగమందున్ను వాతాపీల్వల ప్రసంగమందున్ను తెలియబడియున్నది మనుష్య మాంసభక్షణముగదా అంటె రాక్షసబ్రాహ్మణులకు జెల్లును, దేవతాబ్రాహ్మణులు రాక్షసబ్రాహ్మణులు మానవబ్రాహ్మణులున్నని ఇత్యాదిభేదములుకలవు కలిగితేవారికి బ్రాహ్మణ్యమెసాధారణము:గాని ఆచారముకలదు యిప్పుడున్ను భూలోకమందు మనుష్య బ్రాహ్మణులందు తెనుగులు ద్రావిళ్లు మహారాష్ట్రులు సారస్వతులు మిశ్రీలు కన్నోజీలు వొడిశాలు అని, దేశజాతిభేదముచేత బహువిధ బ్రాహ్మణులున్ను పర్యుషితాన్నమత్స్యాద్యభక్ష్యాభక్ష్యప్రసంగభేదమున్ను ప్రత్యక్షసిద్ధమైయున్నది। అట్లని బ్రాహ్మణ్యమున్నులేక పోవుటలేదు। సర్వసమముగానేనడుచుచున్నది। అదిగనకమద్యపానాదికర్మము:చేత రావణునికాచారలోపమున్ను బ్రాహ్మణ్యశూన్యతయనుశంకింపగూడదు। యికవానితల్లి రాక్షసిగనకక్షేత్రమువలన బ్రాహ్మణ్యములేదనె యుక్తిన్ని కేవలక్షుద్రయుక్తి । అట్లైతెదాశకన్యకకుబుట్టిన వ్యాసులకున్ను మృగమందుబుట్టిన ఋష్యశృంగునికిన్ని కలశాదులబుట్టిన కుంభసంభవాదులకున్ను బ్రాహ్మణ్యములేకపోవచ్చును అదిగనకమహా

షిణీపీర్యమునకుబుట్టిన రావణునికిన్ని బ్రాహ్మణ్యముగలుగుగాని క్షేత్రమునబట్టి వరొకవిధముగా నేరదు । అథవాబ్రాహ్మణబీజమువలనబుట్టిన్ని ఆచారహీనుడాయెనా వ్రాత్యబ్రహ్మబంధుజాతిమాత్రోపజీవీత్యాది శబ్దవాచ్యులగుదురుగాని బ్రాహ్మణులుగారనలేదు। అంతమాత్రమునవధ్యులుగారు॥ శ్లో॥ వపనంద్రవిణాదానంస్థానాన్నిర్యాపనంతథా । ఏషహిబ్రహ్మబంధూనాంవధోనాన్యోస్తిదైహికః । అని భాగవతవచనముగలదు । యెటువలెనైనానేమి ॥ శ్లో॥ ఆతతాయినమాయాంతమపి వేదాంతగంరణే జిఘాంసంతంజిఘాంసేయాన్నతేనబ్రహ్మహాభవేత్। అనిస్మృతిగలదైనాగానీ యిదిఅర్థశాస్త్రవాక్యముగనుక గౌతమస్మృతి॥ శ్లో॥ మునిభిశ్శుద్ధిరుదితా ప్రవర్తేఽకామతోద్విజం। కామతోబ్రాహ్మణవధేనిష్కృతిర్నవిధియ్యతే।అని,సుమంతస్మృతి॥ శ్లో॥ నాతతాయివధేదోషోన్యత్రగో బ్రాహ్మణరథాత్ । అనెడిధర్మశాస్త్రముగలదుగనక ఆవాక్యవిరోధముచేతను ఆతతాయినమాయాంతంఅనె అర్థశాస్త్రవాక్యము పూర్వపక్షమాయెగకన ప్రమాణముగాదు।అర్థశాస్త్రాత్తుబలవద్ధర్మశాస్త్రమితిస్థితిః।అనిప్రాబల్యనిర్ణయముగలదుగనక । ఇటనిస్మృతివ్యాఖ్యానములందు నిర్ణయించినారుచూచికొనేది । అదిగనకనే కేవలపదభ్రష్టుడై నిషాదస్త్రీనిదగులుకొని సంతానమువడసి దానితో కాపురముచేసినపతితుడుసగా బ్రాహ్మణజాతిసామర్థ్యముచేత గరుత్మంతునికత్తుకకునిప్పువలె వేధించితిగకపోయెను యీకథమహాభారతమందాదిపర్వమందుచూచికొనేది । యికహిరణ్యకశిపునంశముగనకనంశమువలన బ్రాహ్మణ్యములేదనెయుక్తిన్ని యుక్తముగానిదే।అం

శమువిచారించితే పరమభాగవతులున్ను భగవత్పార్శ్వచరులు
నైన జయవిజయులుగనక నందునీచజాతిత్వము లేదు। తదవతా
రమైన హిరణ్యకశిపుడున్ను కశ్యపప్రజాపతికిన్ని దాక్షాయణిఅ
యినదితికిన్ని శుద్ధుడైపుట్టినాడుగనక నతనిఅంశమైనాకొదవలే
దు। అదిగనకనంశమువలన బ్రాహ్మణ్యమీలేదనగూడదు। కాలము
వలనలేదంటేనగును । సంధ్యాకాలముగనుకనే రాక్షసబ్రా
హ్మణుడాయెనదిగనకనే వరుసవిచారించినా రావణునియందు
బ్రాహ్మణ్యనివృత్తిసంభవింపదు అదిగనకనే॥ శ్లో॥ అగ్నిహో
త్రాశ్చ వేదాశ్చ రాక్షసానాంగృహేగృహే। అనియున్నదిగనక। య
స్య వేదశ్చ వేదాచ అనెడాబ్రాహ్మణ్యమున్ను లేదాయెను। వేదా
గ్నిహోత్రసంపన్నులుగనకనయితే నికనొకశంక । భూలోక
మునవలెనె ఊర్ధ్వలోకమునను న్ను పదునెనిమిదిజాతులుగల
వు,అందులోరాక్షసులు సంకరజాతులుగనక బాహ్యదేవతలుగ
నకనున్ను వారినిజంపితే దోషములేదనేఅవునైతే । ఆజాతినిర్ణ
యనీచోత్కర్షములా లోకమువారికేకాని యీలోకమువారికి
పనిలేదు। మనుష్యులకు దేవయోనులంతానధికులే । ఇదిగాకసా
క్షాత్కారమున దేవతాశ్రేష్ఠుడై లోకపాలకుడైదుష్ట శిక్షసిష్టర
క్షలుసేయుచున్నదె వేంద్రునికిసగా విశ్వరూపవృత్రాసురనిమి
త్తమైన బ్రహ్మహత్యప్రాప్తించెను। యిదియజుస్సంహితయందు
న్ను స్కాందభారతాదులందున్ను చెప్పిఉన్నది। మనుష్యావతా
రమై సదాచారమునడుచుకొనె శ్రీరామునికిన్నీ అగ్నిహో
త్రవేదాధ్యయనాది సంపన్నుడైన రావణునివధనిమిత్తమైన హ
త్యప్రాపించుటకేమియాశ్చర్యము । అయితేనుభయకులశుద్ధుడైన

హిరణ్యాక్ష హిరణ్యకశిపులజంపినవరాహావతార సింహావతారములందున్ను సోమకాసురునిజంపిన మత్స్యావతారమందున్ను బ్రహ్మహత్యతగలకపోయెను। రామావతారమున కెక్కడి హత్యవచ్చెననేశం కానున్నాతుదా మొదలున్నంటనిదిగనక జాతియుక్తిఅనిపించికొనును। అసేదుత్తరముజాతిఅనే న్యాయసూత్రముగలదుగనక నేలాగంటె నరసింహాద్యవతారములు తిర్యగ్యోనిసంబంధములుగనక నక్కడహత్యానున్న పనిలేదు, తత్ప్రాయశ్చిత్తమున్న పనిలేదు।ఇదిగాకఆయాఅవతారములను వెంబడిగానేరుదుర్దుసిక్షించినాడుగనక రాజదండితులైనవారికి తద్దోషప్రాయశ్చిత్తాది ప్రసంగములు లేవని స్మృతులుచెప్పిఉన్నవి, శ్రీరఘునాయకులుక్షత్రియుడున్నసదాచార వర్తిన్నిగనక నాచరింపవలసెను। యింకొకఆక్షేపముసంపాదించికొన్నారేమనిన। యేడువెలబ్రహ్మహత్యలుచేసినఘంటాకర్ణునికాబ్రహ్మహత్యలన్ని నరమేధములుగాగైకొని యైహికాముష్మిక మోక్షము ప్రసాదించిన కృష్ణావతారముకంటె నధిక తారకబ్రహ్మమైన రామునికి హత్యగలదా అని,ప్రయోగించినారు- అవును ఘంటాకర్ణుడు భస్మోద్ధూళనాది నిష్ఠుడున్ను రుద్రాధ్యాయ రుద్రధ్యాన పరాయణున్ను గనుక॥ శ్రుతి॥మద్యంపీత్వాగురుదారాంశ్చగత్వా స్వర్ణస్తేయంబ్రహ్మ హత్యాంచకృత్వా। భస్మచ్ఛన్నోభస్మశయ్యాశయానారుద్రాధ్యాయీముచ్యతేసర్వపాపైః। అనె శ్రుత్యుక్త ప్రాయశ్చిత్త ప్రవర్తకత్వము చేతను తనుదానె దోషరహితుడైయున్నాడటువంటివానికి మోక్షము స్వతస్సిద్ధమాయెను॥శ్రు॥జ్ఞాత్వాదేవంసర్వపాశప్రహాణిః క్షీణైః క్లేశైర్జన్మమృత్యుప్రహాణిః। అని, శ్రుతి తెలుపుచున్న దిగ

నుక నాలాగంటి వానికి మోక్షమెవరైనా నియ్యవచ్చును - అదిగాక - పశ్యమేయోగమైశ్వరం । అనిన్ని "తమేవచాద్యంపురుషంప్రపద్యేయతః ప్రవృత్తిఃప్రసృతాపురాణీ" అనేడిన్ని గీతావాక్యప్రమాణముచేత శ్రీకృష్ణుడున్ను రుద్రభక్తుడు గనుక రుద్రభక్తుడైన ఘంటాకర్ణునికి స్వతస్సిద్ధమైన శివతాదాత్మ్యరూపమోక్షమును తెలుపుడు జేసినాడని తెలియదగినది - కావున్నట్టాయెనా రుద్రపార్శ్వదుడైన ఘంటాకర్ణునికి మోక్షమియ్యను కృష్ణునికి నిమిత్తములేదు- ఇదిగాక రుద్రునికి బ్రహ్మకపాలముచేత నంటికొని బ్రహ్మహత్యప్రాప్తమైతే కాశీలో మాధవుడు లక్ష్మీచేత భిక్షమువెట్టించి హత్యానివృత్తి చేయించెనని ప్రతిబంధిశంకయొకటి యూహించినారది రావణవధవలె మరణోద్దేశమరణఫలకముగాదు గనుక హత్యకు పనిలేకున్నకిన్ని భిక్షాటనాదిచర్యలు నటనమగుటన్నున్ను ప్రాచీనప్రకరణమందు విస్తరించి తెలిపినాము చూచికొనేది- అదిగనుక శ్రీరాముడు బ్రహ్మహత్యాశంకనయ్యేవే లింగప్రతిష్ఠా పూజలుసేయుటసిద్ధము- ఆలాగుననే పరాశరపురాణము॥పదెనోఅధ్యాయమునందు॥ శ్లో ॥ సేతుమధ్యమ

## ✻ రామలింగప్రతిష్ఠ. ✻

హతీర్థే గంధమాదనపర్వతే। యస్తురామస్తుకల్యాణః సాక్షాద్దాశరథిఃశుభః । నిహత్యరావణంమూర్ఖం తత్పాపవినివృత్తయే। స్థాపయామాసమాంలింగేస్వనామ్నాదేవనాయకం । అని, ఆదిత్యపురాణము ॥ ప్రతిష్ఠాప్యమహాదేవంసేతుమధ్యేచరాఘవః।లబ్ధవాన్ పరమాంభక్తింశివేశంభోరనుగ్రహాత్ । రామేశ్వరఇతిబ్రూతోమహాదేవ పినాకధృత్ । యస్యదర్శనమాత్రేణబ్రహ్మహ

త్యాంవ్యపోహతి। ఉత్తరరామాయణమందు భరతలక్ష్మణులగూర్చి శ్రీరామవాక్యము॥ శ్లో॥ నైవపశ్యామిభెషజ్యమంతరేణవృషధ్వజం తస్మాద్యజ్ఞేనమహతాపూజయామోమహేశ్వరం। అని, యీలాగు నను ప్రసిద్ధియున్నది. * * *

## —*శ్రీకృష్ణకైలాసయాత్ర.*—

శ్రీకృష్ణుడు సంతానార్థమై కైలాసయాత్రచేసి శివునిచేత వరముపుచ్చుకొనుటకునిమిత్తమేమనివ్రాసినారు- పూర్వమందు రుద్రుడు విష్ణువునుప్రార్థించి నీవు మనుష్యావతారములందు తనుగొలిచి తనచేత వరముపుచ్చుకోవలెనని వేడుకొన్నాడు ఆలాగే,వరాహపురాణమందు రుద్రగీతలందు॥శ్లో॥అన్యదెవవరందెవప్రసిద్ధంసర్వజంతుషు। మత్తోన్యభూత్వాభవానేవమామారాధయకేశవ।మాంభజస్వచదెవెశవరంమత్తోగృహాణచ। అని, శ్రీహరివాక్యము॥ శ్లో॥ దేవకార్యవిశెషెషుమానుషత్వముపెయివాన్।త్వామెవారాధయిష్యామిమమత్వంవరదోభవ।అనిన్ని॥శ్లో॥అహమప్యవతారెషుత్వాంచరుద్రమహాబల । తామసానాం మోహనార్థంపూజయామియుగెయుగె । అనిన్ని యీలాగు ప్రమాణసిద్ధమైయున్నదిగనుక వరదానపాలనార్థమున్ను మోహనార్థమున్ను రెండునిమిత్తములుగలవు గనుక నందుకొరకుగాని పరతత్వబుద్ధినిగ్గాని ఐహికప్రయోజనార్థముగాని కాదని వ్రాసుకొన్నారు యిందుకు శివుడు నారాయణాది సకలదేవతలకున్ను పాస్యుడనిన్ని నారాయణాదులు పాసకులనిన్ని నారాయణోపనిషద్భాష్యవ్యాఖ్యానప్రకరణమందు ప్రమాణపురస్సరముగా చెప్పినారముగనుక, యిక్కడ నది విస్తరింపబనిలేదు - అయితే వరదాన

పాలన మోహనార్థములన్నందుకు వచనప్రమాణమున్నదిగ దాలంటే, ఆవచనముల నాప్తవచనములు యెటువలెనంటే, శ్రుతిస్మృత్యుపనిషత్పురాణేతిహాసాదులందునను స్ఫూర్తమైనసకలవర్ణాశ్రమధర్మమైన శివపూజ మోహనార్థమనేటి పురాణవచనముల నాప్తములగునో కాదో తెలిసికొనేది, అదిగాక నీవచనములందు మొదటివాక్యము "మానుషత్వముపేయివాన్" అన్నిన్ని, తర్వాతవాక్యము "అహమప్యవతారేషు" అన్నిన్ని, మానుషావతారము గొలిచెననేగనుకను, రుద్రప్రార్థనావాక్యమందు, "మత్తోన్యైభూత్వాభవానేవ మామారాధయకేశవ । అనే గనుకను ఆదివిష్ణువు సాక్షాత్కారమైన శివపూజ చేసుటకున్ను వరముపుచ్చుకొనుటకున్ను వరదానపాలన మోహనార్థత్వాదులు గల్పింపగూడవాయెను. అది యిష్టాపత్తిన్నిగాదు, సాక్షాత్కారమైననే పూజకత్వప్రసంగము వస్తున్నది గనుక అందుకు మునుపుదాహరించినదైనాగాని కొన్ని విశేషవాక్యప్రమాణములు దెలిపెదము. ఋగ్వేదము ॥ తవశ్రియేమరుతో మర్జయంతెరుద్రయత్తెజనిమచారుచిత్రం । పదం యద్విష్ణోరుపమన్యధాయితేన।అని, ఆలాగే పరాశరపురాణ షోడశాధ్యాయం॥శ్లో॥ రౌద్రలింగం మహావిష్ణుర్భక్త్యాచారుశిలామయం । చారుచిత్రంసమభ్యర్చ్యలబ్ధవాన్పరమంపదం । సాచలక్ష్మీస్సమాభ్యార్చ్యతామహావిష్ణోస్తువల్లభా । యస్యలింగంసమభ్యర్చ్యసపూజ్యస్సర్వచేతనైః॥ అని, లక్ష్మీసమేతుడై మహావిష్ణువే శివలింగపూజచేసి యాతత్ప్రాప్తపదవినొందెనని ప్రత్యక్షశ్రుత్యుపబృంహకపురాణవాక్యప్రమాణసిద్ధిఆయెగనుక వింతపుల [illegible] వ్యాదికల్పనగూడదము, మహావిష్ణు

వనిన్ని ఆదిలక్ష్మి అనిన్ని ఆదివిష్ణువు ప్రసంగముగనుక, మరిన్ని ద్రోణ పర్వమందు, వ్యాసాశ్వత్థామసంవాదమందు, "రుద్రంనారాయణోదృష్ట్వాప్రవవందేవిశ్వశంభువం।" అని ప్రారంభించి, "ఏవమేతాన్ వరాన్ లబ్ధ్వాపురస్తాద్విద్ధిశౌరిణా। సఏషదేవశ్చరతిమానుషీం మోహయన్ జగత్। అనిన్ని, పుష్కలాంశ్చవరాన్ ప్రాదాత్తవవిద్వాన్ హృదిస్థితాన్। జన్మకర్మతపోయోగా స్తయోస్తవచపుష్కలాః। తాభ్యాంలింగేర్చితఃశంభు స్త్వయార్చాయాంయుగేయుగే। సఏషరుద్రభక్తశ్చ కేశవోరుద్రసంభవః। సర్వరూపంభవంజ్ఞాత్వా లింగేయోర్చయతిప్రభుః। ఏషఏవహియష్టవ్యోయజ్ఞైశ్చాపిసనాతనః। సర్వభూతమయంజ్ఞాత్వా లింగేర్చయతియఃప్రభుం। తస్మిన్నధికాంప్రీతిం కరోతివృషభధ్వజః।అని, వేదవ్యాసులయ్యే వేశ్రీకృష్ణోత్కర్షప్రసంగమందు శివుడు పూజ్యుడున్ను వరదుడున్నని శ్రీమహావిష్ణువు పూజకుడున్ను శివవరలబ్ధమహిముడున్నని స్పష్టముగా తెలుపుచున్నాడే సెగనుక నిందుకు మోహకత్వాదివ్యపదేశములుగూడవు, "సహోవాచవ్యాసః పారాశర్యః। అని, ఇత్యుక్తప్రామాణికుడైనవ్యాసులవాక్యముగనుక ఇదిగాక నీలాసున తపఃపూజలచేత శివుని ప్రసన్నునిజేసికొని వరములుపుచ్చుకొనిన ఆదివిష్ణువు ప్రసంగమునకు మానుషాద్యవతారత్వకల్పనముగూడదు, యేలాగంటే, ఈ వ్యాసవచనములందే, "ఏవమేతాన్ వరాలబ్ధ్వాపురస్తాద్విద్ధిశౌరిణా।సఏషదేవశ్చరతిమానుషీమోహయన్ జగత్। పూర్వకాలమందునే మహావిష్ణువైనానేమి శివునిచేత నిట్టువంటివరములనొందెనో ఆదేవుడు వరసామర్థ్యముచేత శ్రీకృష్ణాద్యవతారములందు మనుష్యుడై

జగత్తున భాగవతప్రకారముగా మోహపెట్టుచున్ను సంచరిస్తు న్నారని ఆదిమత్వం తెలుపుడుచేసెను అదిగనుకనే హరివంశాష్ట త్రింశోత్తరశతతమాధ్యాయమందు శ్రీకృష్ణునిగూర్చి యీపూర్వ వృత్తాంతము తెలిపెను, శ్రీకృష్ణః॥శ్లో॥అహంబ్రహ్మకపిలాధాష్య నంతః పుత్రాఃసర్వేబ్రాహ్మణాశ్చాతివీర్యాః । త్వత్తస్సర్వేదేవ దేవప్రసూతాఇత్యాది । ఇతిసంస్తూయమానస్తుభగవాన్గోవృ షధ్వజః । ప్రసార్యదక్షిణంహస్తంవాసుదేవమథాబ్రవీత్ । పా రిజాతంచహర్తాఽసి మాభూత్తేమనసివ్యథా । యథావకాశమా శ్రిత్యతపస్త్వమకృతాద్విభో।తథామమవరంకృష్ణసంస్మృత్యస్థైర్య మాప్నుహి।అవధ్యస్త్వమజేయశ్చ మత్తశ్శూరతరస్తథా। భవితా సీత్యవోచంయత్తత్తథానతదన్యథా।అని, గనుక విష్ణువుచేసినశివ పూజాదికము మోహనార్థవరదానపాలనార్థములనే యుక్తిపర మభాగవతులున్ను సాత్త్వికస్మృతికర్తలున్ను పదవాక్యప్రమాణికులు న్నగు పరాశరవేదవ్యాసులుచెప్పినమహావిష్ణుకృతశివలింగపూ జాదులందు వ్యభిచరించెను, అది మనుష్యావతారవ్యాప్తమాత్ర ముగనుక ఇదిగాక మరియునొక ఉపాసకత్వముగలదు,ఆదికాల

***విష్ణువుశంఖచక్రాదులనొందుట.***

మందు రాక్షసబాధనొంది దేవతలువచ్చి విష్ణువును శరణుజొ చ్చితే రాక్షసులు దుర్జయులు వారినిజయించేటందుకు తగినఆ యుధముగావలెనని విచారించి హిమవత్పర్వతమందు శివలింగ ప్రతిష్ఠచేసికొని నిత్యము వేయితామరలపూజచేసెదనని సంకల్పిం చికొని పూజించగా నతనిభక్తి దార్ఢ్యపరీక్షకై ఆకమలము లందు నొకటి కడమచేసితే ప్రతిజ్ఞాకమలపూరణార్థమై తనక న్నుదీసి పూజించితే శ్రీమహాదేవుడు ప్రసన్నుడై అతడు గోరి

నట్టుల సుదర్శనాఖ్యచక్రమున్ను తనయందు దృఢభక్తిన్ని ప్రసాదించి మరిన్ని పద్మప్రతినిధిగా కన్నుదీసి పూజించెగనుక పద్మాక్షుడనే ప్రఖ్యాతనామమున్ను దయచేసెను - యిందుకు ప్రమాణము॥ ఆదిత్యపురాణస్థమానవీయసంహితైకోనచత్వారింశాధ్యాయము ఋషయః॥శ్లో॥ సుదర్శనాఖ్యంయచ్చక్రంలబ్ధవాంస్తత్కథంహరిః। మహాదేవాద్భగవత స్సూతతద్వక్తుమర్హసి। ఇత్యాది, హిమవత్పర్వతంగత్వా పూజయామాసశంకరం। లింగంతత్ర ప్రతిష్ఠాప్యస్నాప్యగంధోదకైశ్శుభైః। హృతపుష్పోహరిస్తత్ర కిమిదంత్వితిచింతయన్। జ్ఞాత్వాస్వనేత్రముద్ధృత్యసర్వాతంత్రావలంబనం। పూజయామాసదేవేశం। ఇత్యాది, ఏవముక్త్వా దదౌచక్రం సూర్యాయుతసమప్రభం। నేత్రంచపద్మసదృశం విష్ణవేప్రభవిష్ణవే। లోకేతుపుండరీకాక్ష ఇతిఖ్యాతింగతోహరిః। ఇత్యాది, మయిభక్తిర్దృఢాపిష్ణో భవిష్యతితవానఘ। అజేయస్త్రిషులోకేషు మత్ప్రసాదాద్భవిష్యసి। అని,ఆలాగే, వామనపురాణము॥శ్లో॥అథాభ్యేత్యజగన్నాథంసహస్రశిరసంవిభుం।ఆరాధయామాసహరిఃస్వయమాత్మానమాత్మనా। సాంగవర్షసహస్రంతు పాదాంగుష్ఠేనతస్థివాన్ ।తతఃప్రీతోహరః ప్రాదా ద్విష్ణవేతువరంపరం। ప్రత్యక్షం తైజసంశ్రీమద్దివ్యచక్రంసుదర్శనం। ప్రదేశాంతరం। అమోఘపక్షోమరరాజపూజితోహృతోమయానేత్రగతస్తపోబలాత్।అని, విష్ణువాక్యము. యీలాగే సౌప్తికపర్వ వరాహపురాణపూర్వఖండములు చూచికొనేది, అయితే నిక్కడ నొకటి శంకించినారేమనిన, యీ మొన్నటి జలంధరాసురునివధించేనిమిత్తము నిర్మించినచక్ర మడిగిపుచ్చుకొనెననియున్న దిగనుక

నిది యుక్తియుక్తనుగాదేలాగంటే, యీజలంధరునికంటే త్రొ
లుతటి హిరణ్యాక్షాదుల జంపేటప్పుడున్ను అతఃపూర్వమందు
న్ను చక్రాద్యాయుధములున్నవి యివి అనాదులని శ్రుతులందు
జెప్పియున్నదిగనుక, విష్ణుని కనంతావతారములుగల వందులో
నిదియునొక అవతారము, అందు తన మాటతప్పకుండా వర
ము పుచ్చుకొన్నాడంతేకాని స్వాభావికముగాదు అని, వ్యవస్థ
గల్పించికొన్నారు. యిది పురాణేతిహాస పారంగతత్వములేని
మూఢసమాధానమ దెటువలెనంటే యీ చక్రప్రదానాదాన
చక్రనిర్మాణభేదములున్ను ప్రతికల్పమందున్ను గలవు. జలంధ
రవధార్థమే నిర్మించినదిగాక ననాదిఅయిన విష్ణుచక్రమున్ను
శివప్రసాద లబ్ధమేకాని స్వతఃసిద్ధముగాదు మొదట శివునివలన
లభించిన చక్రమే యొకానొకకాలమందు అజేయత్వముచేత వి
ష్ణువుగర్వించితె పరమేశ్వరునివలనబుట్టిన చక్రముదివ్యము గనుక
నతనిగర్వమునకోర్వక నంతర్థానమైతె తిరగా శివునిగూర్చితత
పస్సుచేసి సంపాదించికొనెను. యిందుకు క్రమముననే పురాణ
ప్రసంగము దెలిపేము. పూర్వమ నాదికాలమందు ప్రాకృతల
యవేళ నేకోదకమై కొంతగాలమున్నతర్వాత పరమేశ్వరునికి
తిరగా ప్రపంచ నిర్మాణబుద్ధిపుట్టి అప్రాకృత ప్రాకృతసృష్టికొం
తనిర్మించిన తర్వాత బ్రహ్మవిష్ణువులబుట్టించితె వారు మాయా
మోహితులై యుద్ధముచేసి అలసి మూర్ఛపోతె నిద్దరినడుమ
నూ నురులింగాకారమై నిలిచితె చూచి తుదమొదళ్లు పరీక్షించె
దమనిపోయి సమర్థులుగాక తిరిగివచ్చి స్తోత్రముచేసితె నాలిం
గమందు ప్రసన్నుడై మీరిద్దరూక్రమముననె సృష్టిస్థితి కర్తలై

యుండమంటే విష్ణువు దుష్టనిగ్రహముకొరకు తగిన ఆయుధ
ముదయసేయువలెనని విన్నపముచేసికొంటే నాలాగే పరమేశ్వ
రుడు తన నేత్రత్రయమువలన సూర్యసోమాగ్ని తేజఃపుంజాత్మక
మైన చక్రమునిర్మించి ఆచక్రమువలననే గదయొకటి పుట్టించి
యిచ్చెను - అప్పుడే అమ్మవారున్ను తనముఖమువలన శంఖ
మున్ను నేత్రములవలన పద్మమున్నుపుట్టించి అవి ధరించేటం
దుకు మరిన్ని రెండుచేతులు గలుగజేసియిచ్చెనని స్కాందపు
రాణమందుననీశానసంహితయందున్నుజెప్పెను-అగస్త్యఉవాచ॥
శ్లో॥ ఉత్పత్తింశంఖరాజస్య చక్రరాజస్యచైవహి । విస్తరేణవ
దేదానీం విష్ణోర్విశ్వేశ్వరస్యమె । సకథంలబ్ధవాన్ విష్ణుర్దేవదే
వోత్త్రియంబకాత్ । శంఖచక్రౌమహాబుద్ధే కస్మిన్ కాలేసముత్థితౌ।
స్కాందః॥ఆదావిదంజగత్కృత్స్నం బ్రహ్మస్థావరజంగమం । నష్ట
మాసీదిదంభూత మభవచ్ఛశివేచ్ఛయా। నబ్రహ్మానవిష్ణుర్నేంద్రో
నసూర్యోననిశాకరః । నదిగీశానభూమ్యాదిలోకాః సర్వేచసుప్ర
తాః। తమోభూతేతదాదేవః పరమాత్మాశివఃపరః । ప్రకృతిం
స్వామవష్టభ్యత్రిధాభయిత్వాచలీలయా। తస్యాంసంజనయామాస
బ్రహ్మాణంవిష్ణుమేవచ । ఇత్యాది. తమసాశివమజ్ఞాత్వా బాలావి
వవిచేరతుః।ఇత్యాది, యుద్ధమేవమభూద్విప్రక్రుద్ధయోరత్యనార
తం । ఇత్యాది, తత్రోపవిష్టయోస్తావ ద్బ్రహ్మవిష్ణ్వోర్మహాత్మనోః।
మధ్యేసమభవల్లింగంసహస్రాస్థూలమైశ్వరం । ఇత్యాది, లింగా
ద్యంత దర్శనగమనాగమనశివలింగ స్తుత్యాదికథనము చూచికో
నేది. లింగమధ్యప్రసన్నశివవాక్యం ॥ తస్యాంజాతౌయువాంమ
త్తో బ్రహ్మవిష్ణూసురో[illegible] [illegible] సృష్టిమాత్రం[illegible]పూర్వాం

జగతాం లోకభావనా । దాస్యామిశక్తిం స్రష్టుం తేస్వయం రక్షసి సత్తమ । యయా రక్షతి విష్ణుశ్చరక్షాశక్తించవిష్ణవే। యువయోః పితరావా వామంబికాత్ర్యంబకాభిధా।యువాంచ పితరౌదేవా జగతాం నాత్ర సంశయః । మయైవాంధీకృతౌ పూర్వం పతితౌచ జలోపరి । మయైవరక్షితౌపశ్చాద్బలజ్ఞానప్రదాయినా । అహంకారవశంప్రాప్తౌ మామజ్ఞాత్వా యువాంపునః । యుద్ధం శ్రాంతౌ చకారుశ్చాన్మయైవపరిరక్షితౌ। యువయోర్మోహనాశార్థం లింగమేతత్ప్రదర్శితం । విశ్వరూపంజగద్రూపమాద్యంతరహితంశివం । యువయోస్తోషితస్తేనమయైవపరమాత్మనా।లింగమధ్యేవరంరూపందర్శితం యోగిభిస్స్మృతం । యువామృతే జగన్నాథౌనకశ్చిదపిదృష్టవాన్ । చక్షుషాజీవమానశ్చ జనిష్యో జాతఏవచ । యోగినోపినపశ్యంతి మన్మూర్తం జ్ఞానచక్షుషా। యువయోర్దర్శితంయత్తదక్షరంనిష్కళంపరం । యదేతచ్ఛశినాయుక్తంహస్తపాదాదిసంయుతం । రూపంమమసుదుర్దర్శం యోగినామపిశాంకరం । ఏతద్రూపంసుభక్తానాం సర్వమాంగళ్యదంశుభం । జపతాంధ్యాయతాంనిత్యమర్చతాంచయతాత్మనాం। యువాంచలింగమధ్యే మాంసదాభ్యర్చయతంస్థితౌ । అభ్యర్చితౌహందాస్యామి కామానిహసుదుర్లభాన్ । యస్యాన్యోపియదిద్రూపమేతద్భక్త్యామమానిశం।అంబికాత్ర్యంబకంసౌమ్యం తస్మాన్నాన్యోస్తిమేప్రియః । తస్మైవాప్యఖిలాన్ భోగాన్ క్షిప్రందాస్యామిదుర్లభాన్ । సగణంచప్రణేష్యామి మత్సమీపంమృతంనరం । యువాంచార్చయతంభక్త్యా లింగంకృత్వాసునిర్మలం । సృష్ట్వాసర్వంజగత్సర్వా న్నామ్నాంతేసమవాప్స్యథ । త్వయాసృష్టం

జగత్సర్వంత్వమేవాదిరితిపరిభో। నిశ్చిత్యత్వాంభజిష్యంతి ధ్యానే
నచజపేనచ । త్వయాసృష్టమిదంసర్వం రక్షిష్యత్యేవ కేశవః।అవ
తారశతాన్కృత్వా దైత్యాన్హత్వాసహస్రశః । ఏషవిష్ణుశ్చవి
విధైర్జ్ఞానవైశ్చాపిమానద । పూజాంచలప్స్యసేచత్వం మత్ప్రసా
దాన్నసంశయః। దేవానామసురాణాంచ యక్షరాక్షసపక్షిణాం।
త్వదర్చకానాంత్వంచాపి ప్రయచ్ఛస్వసమీహితాన్ । ఇత్యుక్తో
దేవదేవేన శివేనపరమాత్మనా । ప్రణమ్యభగవాన్విష్ణుః శివంవచ
నమబ్రవీత్ । తుష్టేనభవతాదేవ రక్షాశక్తిత్రయంశివ । దత్తామ
హ్యంజగన్నాథ రక్షిష్యామ్యనయాకథం। అవతారశతాన్కృత్వా
దానవాన్సుమహాబలాన్ । బ్రహ్మదత్తవరైర్దృప్తాన్ నిహనిష్యా
మ్యహంకథం । నిరాయుధోహంనిర్వీర్యో నిశ్శక్తిశ్చమహేశ్వర ।
కథంజగదిదంవ్యాప్తంరక్షిష్యామిసురారిభిః । ఇత్యుక్తోభగవాన్భ
ర్గోహరిణావిశ్వమూర్తినా । తమాహమేఘనాదేన సర్వేణహ
రిమీశ్వరః । ఆయుధంచాస్యదాస్యామి తపోవిఘ్నాపనుత్తయే। దే
వారీణాంచసహత్యై రక్షాయైజగతామిహ । ఇత్యుక్త్వాభగవా
న్విష్ణుందేవదేవఉమాపతిః । ఏకాగ్రమనసాధ్యానమగమత్పరమే
శ్వరః । ధ్యాయతస్తస్యదేవస్య ప్రాదురాసీత్తమోనుదం। చారు
నేత్రత్రయాదస్య సహస్రాదిత్యసన్నిభం। అగ్నేఃసూర్యాచ్చసో
మాచ్చ తన్మయాల్లోచనత్రయాత్ । త్రితేజోమయమత్యుగ్రంజ్ఞా
నాస్త్రింవజ్రపంజరం । నాభాసోమామృతమయో హ్యరేషభ
గవాన్రవిః । పాత్రింతేషుభగవానగ్నిశ్చ క్రస్యస్యాచ్ఛివాత్మనః।
సచక్రింమతిమాన్భూత్వా కింకరోమీత్యభాషత । కృతాంజలిః
రస్తస్థౌ బహుబాహుస్త్రిలోచనః। తంచక్రింపాణినాలంబ్యవిష్ణ

వేప్రదదౌ శివః। విష్ణోర్వై దక్షిణంచాహు మభజత్సోపిహర్షితః। తతోదేవస్యవైశంభో ర్గదాగక్రాద్వినిస్సృతా । దైత్యదర్ప హరాఘోరా సర్వరత్నవిచిత్రితా । షట్చాస్త్రీరూపిణీదివ్యా షడ్ధారా స్త్రీస్వరూపిణీ। ఆజ్ఞప్తాశంభునాచాపి విష్ణుమేవసమా శ్రితా । వామమాశ్రిత్యవైబాహుం విష్ణో స్తస్యస్థితాభవత్।తతో దేవీజగద్ధాత్రీ భవానీసాపరాత్పరా । శివాంకసంస్థితాదధ్యౌ విష్ణోరర్థేశసంజ్ఞయా। తస్యావక్త్రాత్సముత్పన్నః శంఖరాజశ్శశి ప్రభః । సర్వదేవమయఃశాంతః సర్వశత్రునిబర్హణః। సోప్యా జ్ఞప్తస్తయాదేవ్యావిష్ణోఃపార్శ్వమథాగమత్ । దేవ్యానేత్రాత్స ముత్పన్న మంబుజంసుప్రభంశుభం । రమాలయమనోహారి సర్వ లోకవిభూషణం।తంచవిష్ణుంమహాత్మాన మాజ్ఞయాపద్మముత్తమం। సమాశ్రయత్తతోవిష్ణుర్విస్మయంపరమంయయౌ । పూర్వంతుద్వి భుజోవిష్ణుర్గదాంచక్రంచహర్షితః । దధారశంభునాజ్ఞప్తఃస తుచింతామవాపహ । ద్విభుజోహంకథంత్వద్య ఆయుధానాంచ తుష్టయం। ధరిష్యామ్యంబయాదత్తా వుభౌశంఖాంబుజావపి। ఏవంచింతయతస్తస్యవిష్ణోః దేవ్యాఃప్రసాదతః।ప్రాదురాస్తాంకరౌ పీనౌతాభ్యాంతౌచాప్యధారయత్ । తతోవిష్ణుఃప్రసన్నాత్మాశం ఖచక్రగదాధరః।నమస్కృత్యశివంశాంతం కృతార్థోస్మీత్యభాషత। తతోజలదగంభీరఘోషేణభగవాన్ఛివః। విష్ణుమాహమహాత్మా నంకృతార్థోసీతికేశవ।ఇత్యుక్త్వాంతర్దధే దేవఃపరమాత్మాసదాశివః అని, అనాదిసకలప్రపంచ నిర్మాణపూర్వకాలమందుననే చక్రా ద్యాయుధములుపరమేశ్వరుడునిర్మించియిచ్చినాడు, యిదిగాకనీ మధ్యజలంధరవధనిమిత్తమునిర్మించిన చక్రమున్నొకటిగలదు,అది

న్న విష్ణువు తనకన్నది విచి పూజించి సంగ్రహించికొనుట దెలిపినాము
ఇదిగాక గర్వగ్రస్తుడైన విష్ణువును భ్రమించి కానరాకపోతె తిరగాశి
వుని గూర్చి తపస్సు చేసి పూజించి ఆయన అనుగ్రహమువలన తిర
గా సంపాదించికొనెనని ఆయీశానసంహితయందె అగస్త్యుని
గూర్చి స్కందుడు॥ శ్లో॥ తతః కృతయుగస్యాదౌ దైత్యాహి బలగర్వి
తాః। ఇత్యాది। దేవాః । సర్వం విజ్ఞాపయామాసు ర్దైత్యానాంచ
విచేష్టితం విష్ణవే దేవతాస్సర్వే భిన్నాః సుదృఢపీడితాః । విష్ణు
శ్చాపి తదా దేవా నాహాహంకారసంయుతః । దానవాంస్తాన్
హరిష్యామి నాసహ్యం మమవిద్యతె । ఇత్యాది, ఇతినిశ్చిత్య గర్వేణ
శివమాయావిమోహితః। విష్ణు ర్దానవనాశాయ చక్రముద్ధర్తు
మైతుత । కరాభ్యాం గృహ్ణాతస్తస్య చక్రం పర్వతవత్స్థితం । నా
లంచక్రం చాలయితు ముద్ధర్తుమపి వైకుతః । తతః ఛిన్నశ్చసహ
సా విష్ణుర్భూమావపపాతచ । కిమేతదితి గోవిందశ్చింతయామాస
విశ్వభృత్ । ప్రాప్తే తతశ్చ సమయే చక్రం చాంతర్ధధే క్షణాత్ ఇ
త్యాది, ఇత్యేవం నిశ్చయం కృత్వా విష్ణురుత్థాయ తత్ర వై । సంశో
ధ్యాత్మానమవ్యగ్రో దధ్యౌ మంత్రం జపన్మునిః । నిత్యశో నియమే
నైవ లింగం సమ్యక్సమాహితః। పద్మైర్దశశతైర్భక్త్యా పూజయ
త్పురుషోత్తమః । ఇత్యాది, ఇత్యుక్త్వా భగవాన్ఛర్వః ఖడ్గంత్వ
క్షమయం శుభం। దదౌ చర్మ చకృష్ణాంచ మేఘరూపం శతావహం।
హలంచ ముసలం చైవ దదౌ శమదమాయవా । ధనుర్బాణంచ
భగవాన్ పంచభూతగుణాత్మకం । దదౌ కంజమయీం మాలాం
ముకుటం జ్యోతిషాం ముఖం । ఛందోమయం సుపర్ణంచ గరుడం
కశ్యపాత్మజం । ఆత్మతేజోమయం తస్య పాదూనం ప్రదదౌ శివః।

సుదర్శనంవైచక్రంచ శంఖంచాపిదదౌతథా। పునఃకిమిచ్ఛసిహరే మత్తోయదస్తితద్వద । నిశ్శంకస్తేప్రదాస్యామి నాత్రకార్యా విచారణా। ఇత్యుక్త్వాభగవాన్విష్ణుస్తథేత్యుక్త్వాబ్రవీత్పునః।నమస్కృత్వాజగన్నాథం సర్వకారణకారణం । అహంచతవవైదాస్యం కరిష్యామిచశంకర । అహంకారప్రశాంత్యర్థం సర్వదా తవశంకర । తస్మాదాదిశమేదాస్యం నిత్యథాకర్తుమీశ్వర। కృపాంయచ్ఛ జగన్నాథయదితుష్టోసిమేశివ। ఇత్థమభ్యర్థితఃశంభుర్విష్ణునాప్రభవిష్ణునా । అహంగంభీరయావాచా విష్ణుంవిశ్వేశ్వరఃశివః।ఈశ్వరః। యదిచ్ఛసిహరేదాస్యం మమకర్తుంసదానఘ। మేఘోభూత్వావహస్వత్వం మాంప్రీత్యాసర్వదాహరే। తేన మాంబ్రాహ్మణాదేవా శ్చాహుర్వైమేఘవాహనం। చతుష్పాద్వృషరూపీత్వం బ్రహ్మణఃపుత్రతాంగతః । ధర్మస్సర్వార్చితశ్శశ్వద్వాహనోమేభవానిశం । ధ్వజేపిమమగోవింద తేనమాం వృషభధ్వజం । అహంవృషభవాహంచ సూరయోవేదతత్పరాః।

అని,ఇదిగాక - శ్రీకృష్ణుడున్ను ధర్మరాజునుగూర్చి అశ్వత్థామ దౌష్ట్యప్రసంగమందు పండ్రెండేళ్లు తపముచేసిసంపాదించి కొన్నాను చక్రమనిసౌప్తికమందు నుందలించెను. యీలాగు శ్రీహరికి ఆదిమధ్యావసానములందు శివునివలననే చక్రము సంపాదనముగాని స్వతస్సిద్ధముగాదు - అర్జునునికిపాశుపతాస్త్రము వలెనే - పూర్వమందు నింద్రకీలాద్రియందునను తర్వాతకైలాసయాత్రాయుద్ధములందు శివునివలననేసంపాదింపబడె గనకనటు వలెనే విష్ణువునుచక్రమున్నని తెలిసికొనేది, ఇందుచేతనే పాంచజన్యము సంపాదించికొన్న శ్రీకృష్ణుడున్ను- అమృతమథనకాలము

నబుట్టిన శ్రీదేవినిసంపాదించికొన్న విష్ణువున్ను శ్రీవిశ్వామిత్రుని చేతనస్త్రికులుపుచ్చుకొనిన శ్రీరఘునాయకులువలెను కన్నుదీశి శివునిపూజించి చక్రముప్రతిగ్రహించిన విష్ణువునొకఅవతారము అయ్యెనని పరిహరించికొన్నారు - ఆలాగుననగూడదేమంటె,శివుడాదికృతయుగకాలమునకంటె పూర్వసృష్టియందు విష్ణుబ్రహ్మలబుట్టించి ఆకాలమందె చక్రాద్యాయుధములిచ్చెనని నిస్సందేహముగానీ యీశానసంహితయందు వివరించెగనక। యిందుకు పురాణాంతర విరోధశంకయున్నవనిలేదు యెటువలెననిన।పాంచజన్యలక్ష్మీదివ్యాస్త్రిముల సంపాదించికొనిన శ్రీకృష్ణవైకుంఠరామచంద్రావతారములవలె విశేషాకారమున చక్రముప్రతిగ్రహించిన అవతారభేదము నామస్వరూపపూర్వకముగా జెప్పినపురాణములులేవుగనక - వారున్నిదేవిచారించికొని పులిమిపుచ్చుకొని దాటిపోయినారు - వచనాదిప్రమాణములేని కేవలయుక్తికుతర్కమనుపించుకొనును ఆరీతిని తర్కబలమున్నుచాలదేలాగంటె। అకృతకత్వహేతువునబట్టి ఘటమువలెనే శబ్దముచాక్షుషమున్నుగావలెనని ప్రయోగించినట్టువలెనే అసదుత్తరముగనకఇదిగాక రాక్షసబాధవచ్చినకాలమున చక్రముమూల విగ్రహమున్నుండగా నతడె అవతారమైకావలసెనా మూలమూర్తిని।భజించిపుచ్చుకొనక నింతప్రయాసపడి నేత్రముదివిచి పూజించిశివునివలన చక్రముగ్రహింపవలసిననిమిత్తమేమి మోహనార్థవరదానపాలనార్థములంటె నవి మనుష్యావతారకార్యములుగనక నన్యథాసిద్ధములాయెను అయితే విశ్వకర్మసూర్యుని సానబట్టినరాపిడితొచక్రాదులుచేసి యింద్రాదులకిచ్చెనని భారతాదులందు వర్ణించియున్నదిగనక చక్రజననము విరోధించెగదాఅంటే విరోధించదు శంకరమేలు ప్రభువులవశిస్త్రాస్త్రిభూషణాదులు

బహువిధచమత్కారవస్తు నిర్మాణకర్తలైన శిల్పికారులొకానొక సమయమున తమశిల్పినై పుణ్యమునెరపేనిమిత్తమువారు ధరించి కొన్న వస్తువులవంటి వైనాగానీనిర్మించి తెచ్చికానుకయిత్తురు గనక అటువలెనే విశ్వకర్మనిర్మాణప్రసంగమున్ను భారతాదు లందు జెప్పటగాని అనేకపురాణేతిహాసప్రసిద్ధమైన కథఅప లపింపశక్యముగాదు । ఇకనొకప్రతిబంది విరోధమూహించినా రేమనిన। రుద్రునిసంహారకార్యమునకు నియోగించితె నతడునిరా యుధుడనై యేలాగుసంహారముచేసెదనని వేడుకొనగా విష్ణువుక రుణించి అప్పుడేమాసుదర్శనముచేత నొకఆయుధమడిగి పుచ్చు కొమ్మంటె ఆలాగే చక్రమునుగూర్చి తపంబుజేసి ఒకశూలవర ము వరముగాపుచ్చుకొని సంహారకర్తఆయెను । అందుకుప్ర మాణమనివచనము।శూలమును వేడి రుద్రుడు॥ శ్లో॥ శస్త్రిరాజంస మారాధ్యసంహృత్యజన తాంస్వయం । సపవదత్తవాన్ఛూలం కృపయాసహితోమను । అనియున్నదనిభ్రాసికొన్నారు । యి దిన్నిపూర్వమందు॥శ్లో॥గాయత్రీవల్లభత్వాద్ధ శరధతనయస్థాపితా రాధితత్వాచ్చారెః కైలాసయాత్రావ్రతముదిత తయాభీష్టసం తానదానాన్నేత్రేణ స్వేనసాకందశశతకమలై ర్విష్ణునాపూజిత త్వాత్తస్మై చక్రప్రదానాదపిచ పశుపతిస్సర్వదేవప్రకృష్టః। అనె చోటిప్రశ్నకు । రుద్రుడునిత్యమున్ను శ్రీహరినిగూర్చి శూలము నిమిత్తమై వేయేసి సంపంగిపుష్పములచేత భక్తియుక్తుడై పూజ సేయగా నొకపుష్పతక్కువైతె నందుకుసమానముగా తనను కన్నుగోసి విష్ణువునుపూజచేసి శూలమడిగిపుచ్చుకొన్నాడని,కూర త్తాళ్వారు॥శ్లో॥శూలాభిలాషాద్రుద్రో వైపూజయామాస కేశవం। తస్మైసుభ్రదాయకృపయాదదా శూలంచశార్ఙభృత్। అనిశ్లోకము

ఖమున నుత్తరమునిచ్చి నాడని ఆధునికులున్ను శుంఠలునైననశ్శృంగులుఃవిష్ణునేత్రపూజకున్ను చక్రదానమునకున్ను ప్రతిగల్పించికొని వాదించుచున్నారు । అదిఅప్రసిద్ధస్వకల్పితవచనముగాని శాస్త్రశ్రుతిశిద్ధముగాదు । ఆకల్పితవచనప్రకారముననైనా కొదువలేదు। తారుదాహరించిన వచనములందే । తస్యైవాజ్ఞాంపురస్కృత్యచరాచరగురోర్హరేః। కల్పాంతేసంహరిష్యామి।అనివుండుటచేత విష్ణువునడిగిచక్రమునుగూర్చి తపము సేయుట సంహారకర్తృకాలాగ్ని రుద్రవిషయము గనుక పరమశివ నేత్రత్రయసముద్భూతమైన చక్రమునుపాసించి శూలము సంపాదించుకొనుట నికర్ష సంపాదకనుగాదు. ఇక, ఆదివిష్ణువైన మూలమూర్తినాటనుంచి అనుస్యూతమైన సంప్రదాయ సిద్ధముగా నుపాసనోపాసకత్వతత్ఫలశ్రవణము సాంగముగా నేక ప్రకరణమందే వ్యక్తమైయున్నది. అదిగనుక ఆదివిష్ణువునకు తదవతారములందలి ఉపాసకత్వము స్వాభావికమేగాని మరొకవిధముగాదు. వరదానపాలనమోహకత్వ ప్రతిపాదకవచనములు విప్రలంభములున్ను అయుక్తములున్ను అప్రసిద్ధములున్ను కుతర్కములన్నా నేకశ్రుతిపురాణేతిహాసాదివిరుద్ధములుగనుకనున్ను, ‹‹భూయసాంస్యాత్స ధర్మః›› అని, జైమినిసూత్రమందు ననేక శ్రుతిస్మృతిసిద్ధమేప్రమాణమనె గనుక వరదానకాలమందు. హరివంశవచనము ॥ దేవెషుమమపూజార్థం త్వయాకృతమిదంతథా । అద్యమేమకుటారూఢంత్వత్పదాబ్జయుగంహరె । అని, హరివంశము ‹‹కఇతి బ్రహ్మణోనామ ఈశోహంసర్వదేహినాం । ఆవాంతవాంగసంభూతౌతస్మాత్కేశవనామవాన్ ›› అని, ఉపాస్యుడైనరుద్రుడు ఉపాసకుడైన కృష్ణుని ప్రార్థింప నిమిత్తమేమం టెచెప్పెదము.

ఈశానసంహితయందు॥ శ్లో॥ ఏవ విష్ణుశ్చ వివిధైర్మానవైశ్చాపి మా
నద । పూజాంలప్స్యసి వైత్వంచమత్ప్రసాదాన్నసంశయః। దేవా
నామసురాణాంచ యక్షరాక్షసపక్షిణాం । అనిన్ని, కూర్మపు
రాణము॥ అర్చనీయోన్యానమస్కార్యోమత్ప్రీతిజననాయహి । అని
న్ని వరమిచ్చినాడు గనుక స్వప్రతిష్ఠిత సర్వపూజ్యత్వోత్కర్షార్
థమై కృష్ణుని గౌరవము చేసినాడు నచ్చినభక్తుడు గనుక నభేద
ప్రకటనార్థమై యుపచరించుట. ఆలాగుననే అనేకప్రస్తావము
లయందున భేదముగా గౌరవము సేయుటగలదు. విష్ణువునుగూర్చి।
శ్లో॥ నావయోర్విద్యతే భేదో మచ్ఛక్తిస్త్వంనసంశయః । త్వన్మ
యంమన్మయం సర్వమవ్యక్తపురుషాత్మకం । అని, వ్యాసగీతలం
దు ॥ మమైషాపరమామూర్తిర్నారాయణసమాహ్వయా। సర్వ
భూతాత్మభూతస్థా శాంతా చాక్షరసంజ్ఞితా । యేత్వన్యథాతుప
శ్యంతి తెసంసారెపతంతిచ । యెభక్తిమాన్యాశ్చహరౌజాయంతె
చపునఃపునః । యెత్వాంమంవిష్ణుమవ్యక్తంమాంచ దేవమహేశ్వరం।
ఏకీభావేనపశ్యంతి నతెషాంపునరుద్భవః । తస్మాదనాదినిధనంవి
ష్ణుంమామేవభావయేత్ । యోన్యథాసంప్రపశ్యంతిమామేకం దె
వతాంతరం । తెయాంతినరకాన్ ఘోరాన్ నాహంతెషువ్యవ
స్థితః । అని, ఇత్యాద్యౌపచారిక ప్రసంగములుగలవు గనుకను
పాస్యోపాసకులున్ను సోహంభావ నిరంతర ధ్యానయోగముల
వల్లనుండి చేసిన అభేదప్రకటనోప జీవకమైన ఉపచారములుగా
దెలిసికొనేది. యీలాగుననే హరివంశమందుననున్ను వరదాన
కాలమందే అభేదముగా నుపచరించినాడు. ॥శ్లో॥ త్వత్తస్సమభవద్వి
శ్వంత్వయిసర్వంప్రలియ్యతె । అహంత్వంసర్వగోదేవత్వమేవా
హంజనార్దన । అనిగనుక నత్యుత్కటభక్తిచేత శివదీక్షితుడై

తనభక్తుడైనందువలనను భక్తపరవశానందము వెల్లి విరియగానా పలేక. నీపాదములు నాశిరమెక్కెనని, లోకమందు శైశవచేష్ట లచేత ముద్దుమిక్కుటమై నప్పుడెంతవారైనా అన్నట్టుంవలెనే, యీలాగంటి భక్తవాత్సల్య లక్షణములుపరమకారుణికోత్తము డైన పరమేశ్వరునివలన తరుచుగాగలవు. అర్జునునిచేత వింటి పెట్లబడితా నతనిశత్రుక్షయము చేసుటయును, బాణాసురునివాకి టకావలి యుండుటయును ఇత్యాదులు ప్రసిద్ధములై యున్నవి గను కను, హరివంశమందలి రుద్రవాక్యములున్ను. నీనామములు ప రమాత్ముడనైన నాకువాచకముగానె అంగీకరించెదమని తానుప్ర ధానముగానున్ను శ్రీకృష్ణుని నప్రధానముగానున్ను దెలిపెగను కను భక్తప్రకటన ప్రకరణములుగా దెలిసికొనేది. అయితేనీ లాగున నెంతభక్తునినైనా నీపాదయుగ్మము నామకుటమెక్కేన నికొనియాడేది గలదా ? అంటే, నిటువంటివాదములు సర్వత్రసు లభములు ॥ "సఆత్మనోవపాముదఃఖిదత్" అనె, శ్రుత్యర్థార్థ వాదములువలెనే ఆయాప్రసంగములందుగలవు. ఇదిగాకతనున మ్మికొలిచినభక్తుని వెంబడినితానుతిరుగుట యేమినిమిత్తమంటే, నతని పాదధూళిచేత తాను పవిత్రుడనయ్యేనని వెంబడింతునని శ్రీమన్మహాదేవుని ప్రతిజ్ఞావచనమొకటిగలదు, సూతసంహితయం దలి జ్ఞానయోగఖండమందు॥ శ్లో॥ నిరపేక్షంమునింశాంతంనిర్వై రంసమదర్శినం । అను వ్రజామ్యహంనిత్యం పూయయేత్వంఘ్రి రేణుభిః । అని, యీలాగుననే ఏకాదశస్కంధమందు శ్రీకృష్ణ వాక్యమున్నుకలదు చూచికొనేది, అదెక్కడిమాటంటిరా ? మరిన్ని తృతీయస్కంధమందలిపదియారో అధ్యాయము,॥ శ్లో॥ తద్వఃప్రసా దంయామ్యద్య బ్రహ్మదైవపరంపరహి మే । [illegible] ప్రారంభించి, య

ష్ఠేవయా చరణపద్మపవిత్రరేణుంసద్యఃక్షతాఖిలమలం ప్రతిలబ్ధశీలం।
న శ్రీర్విరక్త మపిమాంవిజహాతియస్యాః ప్రేక్షాలవార్థ మితరేని
యమాభజంతే। అని, సనకాదులగూర్చి వైకుంఠమందు నాదివిష్ణువు
చేసిన స్తుతిన్ని, స్వాభావికమెలవును, వారిగడవ నికృష్టుడున్న
గును, ఇదిగాక నిక నొకశివనికృష్టాంతరము సంపాదించినారే
మనిన, యీలాగు నీచరణములు నాశిరమెక్కెనని వాఙ్మాత్రమే
నా ప్రత్యక్షమేమైనాకలదాఅని తామేశంకించికొనిసైంధవవధా
ర్థమర్జునుడు ప్రతిజ్ఞచేసినతర్వాత శ్రీకృష్ణునిపాదములుపూజిం
చితె ఆపూజగంగాధరుడైన రుద్రుని శిరముననుండగా నర్జును
డుచూచి ఆశ్చర్యపడి శివునికి ధ్యేయమైన బ్రహ్మమని తెలసిశ్రీకృ
ష్ణునికె ప్రపన్నుడాయెనని సంతోషించికొని అక్కడి ప్రమాణ
మని యొకశ్లోకము వ్రాసికొన్నారు॥ శ్లో॥ పార్థోపనీతంమధుసూ
దనస్యపాదారవిందార్పితచిత్రపుష్పం । దదర్శగంగాధరమౌ
లిమధ్యేబభూవవీరఃకృతనిశ్చితాత్మా । అని, యీశ్లోకమాద్రో
ణపర్వమందు నాప్రకరణమందులేదు గనుక కల్పితముగా తెలియ
బడెను, ఇందుకక్కడి పూర్వోత్తర ప్రసంగములున్న వచనము
లున్న దెలిపేము, అర్జునుడెప్పుడున్న నిత్యశివపూజాపరుడు,
అభిమన్యువధదినమందు శోకవ్యాకులత్వముచేత నెప్పుడున్న చే
సె శివపూజసేయ మరచియుండగా మహానిశియందు శ్రీకృష్ణుడ
ర్జునునిజూచి నీవు నిత్యమున్న చేసే త్ర్యంబకపూజ యింతకమునుపు
సేయవైతని తెలపించితే నాకృష్ణునంటె శివపూజాక్రియమంతా స
మర్పించె నాపూజయ్యేవేశివునందుజూచెనని యున్నదిగాని కృష్ణ
నిగూర్చె పూజించెననికాని కృష్ణపాదమందని కానిశివుని శిరమం

దని కాని యీలాగంటి కల్పిత ప్రసంగములులేవు, ద్రోణపర్వ మందలి డెబ్బదియారో అధ్యాయమందు॥ శ్లో॥ తతోనిత్యంమహాత్మా నమపశ్యద్వానరధ్వజః । సహస్రమివసూర్యాణాం దీప్యమానం స్వతేజసం । ఇత్యాది, వాసుదేవస్తుతంధృష్ట్వాజగానుశిరసాక్షి తిం । పార్థేనసహధర్మాత్మాగృణన్బ్రహ్మసనాతనం। ఇత్యాది, తతఃపార్థఃప్రసన్నాత్మాప్రాంజలిర్వృషభధ్వజం । దదర్శోత్ఫు ల్లనయనఃసమస్తంతపసాంనిధిం ।। పంచోపహారంశనక్తైర్నైశంవె త్తికమాత్మనః । దదర్శత్ర్యంబకాభ్యాశే వాసుదేవనివేదితం। అని, అదిగనుక వారుదాహరించిన, పార్థోపనీతం। అనే, శ్లో కమెక్కడిదో తెలియదు, యిందుచేత వారిపాలింటికాకల్పితశ్లో కముశోకపాత్రియమాయె గనుక నిందుచేతనే వారుదాహరించెవ చనములున్ను వారిపాడింత్యము న్నీలాగే కల్పితబలమని తెలియ బడెను. అయితే నైతైనాగాని కృష్ణునందుజేసినపూజ శివునందు గనుపించెగదా కృష్ణుడె అధికుడగునంటే నాలాగుకానేరదు, యే లాగంటే, అర్జునుడె ఇంద్రకీలాద్రియందు స్థండిలమందుశివపూ జచేసితే నాపూజ కిరాతరూపుడైన పరమేశ్వరుని శిరమందుకని పించెనని అరణ్యపర్వమందు ముప్పదియేడో అధ్యాయమందు కిరా తార్జునియ్య ప్రస్తావమందు॥ శ్లో॥ శరణ్యంశరణంగత్వా భగవం తంపినాకినం । మృణ్మయంస్థండిలంకృత్వామాల్యేనాపూజయద్భ వం । ఇత్యాది, తచ్చమాల్యంతథాపార్థఃకిరాతసిరసిస్థితం।అప శ్యత్పాండవశ్రేష్ఠోహర్షేణప్రకృతింగతః। పపాతపాదయోస్తస్య తతఃప్రీతోభవద్భవః । అని, ఉన్నదిగనుక నీమృణ్మయస్థండిలము న్నుశివునికి ధ్యేయమైన [illegible]

## * గంగోత్పత్తి. *

ఇంతమాత్రమే కాదు శివుడుశిరమున విష్ణుపాదోదకముధరించికొనియుంట సకలప్రసిద్ధమైయున్నదనిన్ని అందుకనేకపురాణములందు బ్రహ్మఋషివాక్యములుగల వదిగాకనాధరించికొన్న శివునివాక్యములే తెలిపెదమనిన్ని వచనములు। పద్మపురాణమందు పార్వతినిగూర్చి॥శ్లో॥సర్వేశ్వరోహరిర్విష్ణుర్ద్వితీయ్యంపరముత్తమం।ఊర్ధ్వంప్రసారయామాస బ్రహ్మలోకాంతమచ్యుతః। అనివర్ణించి। తాందృష్ట్వామేరుమధ్యాత్తు ప్రవహంతీంశుభాననే। ఆత్మనఃపావనార్థాయ సిరసాతామధారయన్। అని।యిటువలెనే।విష్ణుపదీగంగా । అన్నందుకు శ్రీనరసింహోత్తర తాపినీ ఇత్యాదులందునున్నవి చూచికొనేదనిన్ని భాగవతమందు—యచ్ఛౌచనిస్సృతసరిత్ప్రవరోదకేన తీర్థేనమూర్ధ్ని విధృతేనశివః శివాభూత్ । ఇత్యాదులుగలవని ఉదాహరించినారు । యిందుకు।సమాధానముచేసెదము । ఇటువంటివాక్యములెన్నిగలిగినా స్తుతిప్రకరణస్థములుగనుకనుపురాణాంతరవిరోధముగలిగియున్నవి గనకను గుణవాదములుగాని యథార్థకథనములుగావు। అథవాగంగ మొదటికి విష్ణువలనబుట్టులేదబ్బర । అయినా। విష్ణుపదోద్భవమైఅవుగాక శివుడదిధరించుగాకనీచతలేదు। యెటువలెనంటె యోనివలనబుట్టిన అవతారములకుసగా నీచత్వము లేదు బ్రహ్మపాదాంగుష్ఠాదులబుట్టిన దక్షాదులవలెనే విష్ణుపాదమునబుట్టిన మాత్రమున నేమినీచత్వము । అటువంటిగంగనుధరించిన శివునికి నాధిక్యహానిలేదు స్వభక్తానుగ్రహహేతువుగనక।అదెకడమాటంటె॥శ్లో॥అగ్నిర్ముఖంతేఖిలదేవతాత్మా క్షితిర్విదు ర్దేవత

వాంఘ్రిపంకజం । అని,అష్టమస్కంధ సప్తమోధ్యాయమందు। భూమిశివునిపాదమనివర్ణించెను । అటువంటిభూమినెత్తిబెట్టి కొని మోచికొనియున్న విష్ణువుకున్నటువలెనే నైచ్యప్రాప్తమగును। అయితెనిదిలోకరక్షణార్థముగదా । అంటెశివుడున్నుభగీరథతపః ప్రీతుడైఅతనిమీది అనుగ్రహముచేత ధరించినాడుగానీ పాదోదకబుద్ధినిగాదు । అందుకుప్రమాణము।రామాయణబాలకాండము। దేవదేవేగతేతస్మిన్ సాంగుష్ఠాగ్రనిపీడితాం। కృత్వావసువతీంరామ సంవత్సరముపాసత । అథసంవత్సరేపూర్ణే సర్వలోకనమస్కృతః। ఉమాపతిఃపశుపతీ రాజానమిదమబ్రవీత్। ప్రీతోస్మ్యహం నరశ్రేష్ఠకరిష్యామితవప్రియం । సిరసాధారయిష్యామిశైలరాజసుతామహం। అనిన్ని,భాగవతనవమస్కంధనవమాధ్యాయము। తథేతిరాజ్ఞాభిహితంసర్వలోకహితఃశివః। తథారావయుతాంగంగాం । అనిన్ని, అదిగనుక ననంతకల్యాణగుణాకరుడున్ను పరమదయామూర్తిన్ని భక్తవత్సలుడున్నైన భగవంతుడు భక్తానుగ్రహార్థమై ధరించె గనుక ఆధిక్యహానిలేదు. యీ గంగాధారణకర్మమే సకలదేవతాధిక్య సూచకమైయున్నది. ఇతరదేవతలుధరింప శక్తులుగారనె గనుక అటువలెనే, రామాయణమందు ॥ గంగాయాఃపతనంరాజన్ పృథివీనసహిష్యతె। తాంవైధారయితుంవీరనాన్యం పశ్యామిశూలినః । రక్షసర్వానిమాన్ లోకానలోకాన్ కర్తుమహసి । దేవానాంచవచఃశ్రుత్వాసర్వలోకమహేశ్వరః।సఓమిత్యబ్రవీత్సర్వాన్ పునశ్చేదమువాచహ । అని,నవమస్కంధము, గంగావాక్యము॥ కశ్చధారయితా [illegible] ... [illegible]త్యమహేత్తలే । భగీరథః ॥ ధారయి

ప్యతి తెవెగంరుద్రస్త్వాత్మశరీరిణాం। యస్మింతతమిదం ప్రోతంవిశ్వంశాటీవతంతుషు । అనిన్ని, ఇదిగాక గంగ కతిశయపావనత్వమున్ను శివదేహ సంపర్కముచేతనే సభవించినది గాని, స్వతఃసిద్ధముగాని విష్ణుసాంగత్యముచేతగాని కాదు, అటువలెనె, బాలకాండము॥ తెతత్రిఋషిగంధర్వావసుధాతలవాసినః భవాంగపతితంతోయం పవిత్రమితిపస్పృశుః । అని, యీలాగే విష్ణుపురాణం ॥ శంభోర్జటాకలాపాత్సా వినిష్క్రాంతాస్థిశర్కరాన్ప్లావయిత్వాదివంనిన్యేయాపాపాన్ సగరాత్మజాన్ । అని, యీలాగున గంగాధారణము భగీరథాను గ్రహార్థమగుటనందునను శివునికాధిక్యసూచకమగుటాయెను శివుడుధరించుటవలనగంగకు పవిత్రతగలుగుటాయెను విష్ణుపురాణభాగవతరామాయణ భారతాది పురాణేతిహాసాదులందు ఘంటాఘోషముగా విస్తరించి వర్ణించియున్నది. గనుకనే తద్విరుద్ధమైన పాదోదక బుద్ధిచేత ధరించినాడన్న ప్రసక్తి. విరోధేగుణ వాదస్యాత్, అన్నారు గనుక గుణవాదముగా దెలిసికొనేది. అయితె నెటువలెనైనానేమి ప్రథమము విష్ణుపాదమునబుట్టిన గంగనే తర్వాత శివుడు ధరించెగదా అది పాదోదకము ధరించుటగాదా అంటె, ఆగంగ, విష్ణు పాదోద్భవ అనే సంవాదము యుక్తియుక్తమున్ను ప్రమాణసిద్ధమున్నుగాదు, యెటువలెనంటె, విష్ణుపాదోదకమని వర్ణించె గుణవాద వాక్యములందున్ను, వామనునిఅంగుష్ఠనఖముదాకి ఊర్ధ్వాండ కటాహము భిన్నమైతే నందువలన బహిరావరణోదకమువచ్చి లోనప్రవహించి గంగ అనిపించికొనెననిన్ని. బ్రహ్మ తనకమండలూదకముచేత వామనుని పాదప్ర

క్షాళనముచేసితే నాసలిల మభివృద్ధినొంది గంగ ఆయెననిన్ని కే
వలము వామనుని పాదమందే జన్మించెననిన్ని, యీలాగు బహు
విధములుగా వర్ణించె గనుక ఆపురాణ ప్రసంగములు గుణవా
దమందువినాగా ప్రమాణములుగావు, వామనావతారమందె గం
గజన్మించెననుట యుక్తియుక్తము గాదాయెను. అటకు మునుపె
మత్స్య కూర్మవరాహ నారసింహా వతారములందున్ను అవతలిమ
న్వంతరములందున్ను గంగ లేకపోయినదవును, ఆలాగే అవునన
గూడదు, ఆకాలములందు గంగాది వర్ణనము బహుపురాణప్రసి
ద్ధము గనుక అయితే గంగకు స్వాభావికమైన ప్రథమజన్మ మెటు
వంటిదంటె. బాలకాండము, రామవాక్యం ॥ దుహితుః శైలరా
జస్య జ్యేష్ఠాయావక్తుమర్హసి త్రివిథాహేతునాకెన ప్లావయె
ల్లోకపావనీ। కంథంగంగాత్రిపథగావిశ్రుతాసరిదుత్తమా। త్రిషు
లోకేషు ధర్మార్థకర్మభిః కైః సమన్వితా । తథాబ్రువతికాకు
త్స్నే। అని, ప్రశ్నవాక్యము, ఉత్తరము బ్రహ్మవాక్యము॥ ఇయం
హైమవతీగంగాజ్యేష్ఠాహిమవతస్సుతా। అని, అందుననే వైనతే
యవాక్యము ॥ గంగాహిమవతో జ్యేష్ఠా దుహితాపురుషర్షభ।
తస్యాంధురుమహాబాహో పితౄణాంసలిలక్రియాం। అనిన్ని
వామనపురాణము ॥ ఇత్యేవంబ్రహ్మణాశప్తా హిమవద్దుహితా
మునె। ఆపామయీబ్రహ్మలోకం ప్లావయామాసయోగినీ। అని,
యీలాగుననే పురాణములందు గంగ హిమవంతుని పెద్దకూతు
రనిన్ని. బ్రహ్మశాపముచేత నుదకరూపమై బ్రహ్మలోకాద్యూ
ర్ధ్వలోకముల ముంచుకొనిపారెననిన్ని వి స్తరించియున్నది గనుక
సామాన్య విధిర్విశేష విధిర్బలవాన్ అనె న్యాయముచేతనుహి

మవద్దుహితయగుట సిద్ధము. అయితే నికనొకశంక ॥ తతఃప్రవ హతిబ్రహ్మన్ సర్వపాపహరాసరిత్ । గంగాదేవాంగనాంగా నామనులేపనపింజరా । విష్ణుపాదవినిష్క్రాంతాప్లావయిత్వేం దుమండలం । సమంతాద్బ్రహ్మణః పుర్యాంగంగాపతతివైదివః। వామపాదాంబుజాంగుష్ఠ నఖస్రోతొవినిర్గతా విష్ణోర్బిభర్తియాం భక్త్యాశిరసాహర్నిశంశివః । అనే, పురాణకథనానబట్టి విష్ణు పాదమునబుట్టెనని ప్రమాణ సిద్ధమైయున్నది గనుక నిందుకు విరోధముగాకుండా మును విష్ణుపదమందుబుట్టిన గంగనే పిదప భగీరథునికొరకు యిచ్చేటప్పుడు హిమవత్పర్వతమందు ప్రవ హించిన మాత్రమున, జహ్నుకన్య అన్నట్టువలెనే, హిమవంతుని బిడ్డనుటయునున్నగౌణమగుట, జహ్నునివలెనె హిమవంతుడున్ను మార్గవశమున ప్రాప్తమగుటనంటే నిదిన్నియుక్తిగాదు. యెటువ లెనంటే, ప్రథమముహిమవంతునివలన నతనిభార్యయైన మేనకయం దుబుట్టెననిమాతృపితృవర్ణనమున్ను గర్భజననమున్ను చెప్పినదిగ నుకజహ్నుకన్యాత్వమువలెనేగౌణమనగూడదు.అదిగాక హిమవం తునికిబుట్టినతర్వాత మరినదీత్వము ప్రాప్తమైతే దేవతలుతమ లోకాన ప్రవహింపవరించినతర్వాత భగీరథునినిమిత్తమై భూలో కమునకు వచ్చెనన్నియథాక్రమముగా వర్ణించినారుగనక భగీ రథానుగ్రహార్థమై భూలోకావతరణము గడవమున్నేహిమవం తునికిజన్మించెనని యున్నదిగనక మార్గవశప్రాప్తమనగూడదు। అలాగె।బాలకాండముహితా శైలరాజస్యేత్యాది।తథాబ్రువతి కాకుత్స్థేకృత్యంతం చోదితారామవాక్యే । విశ్వామిత్రోమహాము నిః।వృద్ధింజన్మచగంగాయా వక్తుమేవోపచక్రమే । శైలేంద్రో

హిమవన్నామ ధాతూనామాకరోమహాన్। తస్యకన్యాద్వయం రామ రూపేణప్రతిమంభువి । యామేరుదుహితామేనా తయో ర్మాతాసుమధ్యమా । నామ్నామనోరమానామ పత్నీహిమవతఃప్రియా । అథజ్యేష్ఠాంసురాస్సర్వే దేవతార్థచికీర్షయా। శైలేంద్రవరయామాసు గంగాంత్రిపథగానదీం । దదాధర్మేణ తనయాం హిమవాన్ లోకపావనీం । గంగామాదాయతేగచ్ఛన్ కృతార్థేనాంతరాత్మనా । ఖంగత్వాప్రమంరామ గతింగతిమతాంవర । సురలోకంసమారూఢా విపాపాజలవాహినీ।అని। యీలాగున ప్రశ్నోత్తరరూపకమైన జన్మకర్మప్రసంగమందు విష్ణుపాదోద్భవత్వ ప్రసంగవాసనామాత్రమున్నులేదు । యీరామాయణకధనవిరుద్ధములైన పద్మపురాణాదివర్ణిత విష్ణుపదోత్పన్నత్వమె గౌణముగాజూచికొనేది । రామాయణమున్నెటువలెనైనా నేమిభాగవత పద్మపురాణోత్తరాదులువలెనే నారాయణప్రభావ ప్రశంసాపరమవును । అయినాగానీ। నతేవాగనృతేకావ్యేకా చిదత్రభవిష్యతి।అని।వాల్మీకికి బ్రహ్మదేవునివరముగలదుగనక నబద్ధమురాకుండా అర్థవాదపరమైన విష్ణుపదోత్పన్నత్వకధనమె తెలిపెను । అదిగనకసజాతీయ్యవిరోధ పరిహారముదుష్కరము రెండుపక్షములవచనములున్నా వైష్ణవపురాణేతిహాససంబంధములేకనకనయితె నీలాగునవిష్ణుపదోద్భవ గానిది న్ని అవుననిఉత్కర్షిం చేటందుకైనా నేమిసంబంధమంటేకలదు వామనావతారసమయోర్ధ్వ ప్రసారితవిష్ణుపాదాంగుష్ఠనఖవినిర్భిన్న బ్రహ్మాండోర్ధ్వకటాహారంధ్రిద్వారాలోపలికిప్రవహించిన కుటిలాఖ్యబాహ్యజల ప్రవాహమువచ్చి గగనగంగయందు

గలిసెగనక నదిగారణమైన పాదాంగుష్ఠ ప్రభవత్వము గంగయం
దారోపించి విష్ణుపాదోదకమనిన్ని యేదైనానొకనిమిత్తమున రు
ద్రుడుధరించుటగలదు గనకభక్తిచేతనే శివుడుధరించినాడనిన్ని
ఆయాస్తుతి ప్రకరణములందులవర్ణించినారాలాగె । వామనపు
రాణము । విష్ణ్వంఘ్రినాప్రసరతాకటాహే భేదితేంబరాత్ । కు
టిలాతస్య పాదాగ్రాత్సాంరుటిలాతతః । అనిఅయితేనింతమా
త్రమున రథ్యాజలయోగముచేత గోదావర్యాదినదులు రథ్యా
జలములన్నట్టుంబలెనె విష్ణుపాదనఖమువలన వచ్చినబహిరావర
ణజలయోగముచేత గంగ విష్ణుపాదోదకముగానేరదు। ఇదిగాక
బ్రహ్మాండకటాహ సమీపమునసాచిన పాదమువలనబుట్టి। గగన
అనుపించికొన్న గంగనుతిరగా హిమవంతునినడిగి దేవతలు తమ
లోకమునకు దివుచుకొనిపోయిరనిన రామాయణకథనము వ్యర్థ
మైపోవును, అయితె గంగావిష్ణుః దీజహ్నుతనయాసురనిమ్నగా
అని, నిఘంటుప్రసిద్ధమైన యోగరూఢులచేత విష్ణుపదీ అని, ఉ
న్నది అందుచేత విష్ణుపదోత్పత్తి తెలుపుడవుచున్నదిగదా అంతె
విష్ణుపదశబ్దముచేత ధ్రువలోకముగడవమీదైన లోకమువివక్షింప
బడుచున్నది. ఆలాగె. విష్ణుపురాణమందు, గంగావతరణప్రకరణ
మందు, పూర్వవాక్యం। యావన్మాత్రప్రదేశేతు మైత్రేయావస్థితో
ధ్రువః। క్షయమాయాంతితావత్తుభూమావాభూతసంప్లవాత్ । ఊ
ర్ధ్వోత్తరమృషిభ్యస్తుధ్రువోయత్రవ్యవస్థితః। ఏతద్విష్ణుపదందివ్యం
తృతీయంవ్యోమ్నిభాస్వరం। అపుణ్యపుణ్యోపరమె క్షీణాశేషార్తి
హేతవః। యత్రగత్వానశోచంతి తద్విష్ణోఃపరమంపదం। అని. యీ
ప్రకరణముభూరాదిలోకవర్ణనపరమగుటను ధ్రువునికంటెనుపరి

లోకమువర్ణించి ఆలోకమందే విష్ణుపదమని ప్రతిష్ఠించి, అస్మిన్ ప్రతిష్ఠితో భాస్వాన్ మేఢీభూతస్స్వయం ధ్రువః । ఇత్యాదివచనములచేత నావిష్ణుపదాఖ్యలోకమే జ్యోతిశ్చక్ర మేఘమండలానకు ఆధారముగావర్ణించి, ఏవమేతత్పదంవిష్ణో స్తృతీయమమలాత్మకం । ఇత్యాదివచనములచేత విష్ణుపదస్వరూపము ప్రతిపాదించి, తతః ప్రవహతిబ్రహ్మన్ । అని, ఆవిష్ణుపదమనే లోకానసుంచి గంగానిర్గమనవర్ణనము చెప్పబడెగనుక విష్ణుపదము శరీరావయవపరముగాదు, మరేమంటే, వియద్విష్ణుపదంవాతు అనే ఆకాశపరము, విష్ణోఃపదంవిష్ణుపదం । అనే యోగముకంటే రూఢిబలవంతముగనుక, రూఢిర్యోగమపహరతి । అన్నారు, రూఢి బలవంతమైనందుకు, రథకారోగ్నినాదధీత । అనే వ్యాఖ్యానమందు నిర్ణయింపబడ్డది చూచికొనేది- యీలాగైతే, వామపాదాంబుజాంగుష్ఠనఖస్రోతో వినిర్గతాం । అని, యున్నదిగనుక నచేతనమైనఆకాశమునకు వామపాదాంగుష్ఠనఖాదివర్ణనము యుక్తముగాదుగదాఅంటే, ప్రకరణవశాన హిమవదుత్పత్తి ప్రతిపాదకవచనవిరోధపరిహారార్థమై విష్ణుపదవాచ్యాకాశమునకయ్యేవేమనోహరపాదాంబుజత్వమున్ను అందువలన గంగవెడలెననిన్ని ఉత్ప్రేక్షచేతస్తుతించుటగాదెలిసికొనేది, యీలాగున నచేతనముల నవయవనిరూపణోత్ప్రేక్షగలుగవు, ప్రాణావుపరమాహనూఅధిషవణేజిహ్వాచర్మగ్రావాణోదంతా ముఖమాహవనియో నాసికోత్తరవేదీ । అనేచోటను ప్రమాణాంతరవిరోధముచేత గుణవాదము చెప్పబడెను, ఇదిగాక గంగాజననమున్ను తద్ధారణమున్ను అనాదిన్ని నిరుపాధికమున్నని వాయుపురాణమందు చెప్పియున్నది చూచికొనేది. ఈరుద్రుడు కాలకూటము మ్రింగి లోకములను రక్షించె

## శ్రీకాలకూటభక్షణము. శ్రీ

ననుటకు తనశక్తినిగాదు, గారుడమంత్రోచ్చారణధ్యానసామర్థ్య మునను న్ని విష్ణ్వనుగ్రహముననున్ను ధరించినాడు, అదియంతయు విష్ణువే భక్షింపగా వ్రేళ్లసందునజిక్కిన శేషము భక్షించినాడు గాని సర్వమున్ను గొనుటలేదు, యిందుకు ప్రమాణము, పాద్మోత్తరఖండము॥ శ్లో॥ తంధృష్ట్వాఘోరసంకాశంపాత్రిసుభూతం మహావిషం। ధ్యాత్వానారాయణందేవం హృదయేగరుడధ్వజం। నామత్రియమహామంత్రం జపన్భక్త్యాసమన్వితం। తద్విషంసుమహాఘోరం మాంధంసర్వభయంకరం। అనిన్ని, నామత్రియప్రభావాచ్చ. విష్ణోస్సర్వజగత్పతేః। విషంతదభవజ్జీర్ణం మంత్రిమానుష్టుభంశుభం। ఓంనస్సంపుటీకృత్య జపన్విషధరోహరః। గారుపురాణం, పార్వతినిగూర్చి రుద్రుడు॥ శ్లో॥ అపికాశ్యమిదందేవీగుహ్యాద్గుహ్యతరంపరం। పురామహోబ్ధిమథనె పతంగేంద్రం విషాపహం। ఆరాధ్యగరళంఘోర మాభుజ్యమమృతంయథా అనిన్ని। ఇదిగాకకాలకూట భక్షణకాలమందు। రుద్రుడునారాయణధ్యానముచేసితె కృతయుగకర్తయైన శ్వేతవిష్ణువు ప్రసన్నుడైతె ఓస్వామీ విషముహరించెదనని దేవతలకభయమిచ్చినానుఇప్పుడుయీవిషముహరింపలేకున్నా నంటెనా శ్వేత విష్ణువుఆవిషమంతయు తానేభక్షించితనవ్రేళ్లసందునజిక్కిన శేషమురుద్రునిచేత మ్రింగించేను, చాలామ్రింగిన విష్ణువుకుశరీరమెల్లా నల్లనాయెను।కొంచెముమ్రింగిన రుద్రునికికంఠముమాత్రమె నలుపాయెను । ఇదిగాక నావిషమున్ను కాలాంతరమున కంఠమునసనుండి తలకెక్కకుండా నమృతమయుడైన చంద్రునిశిరమందునుంచి లోపలికిదిగ

ఖండా గరుడధ్వజధ్యానమున్ను గల్పించిరి । విష్ణువు మ్రింగగా మిగిలినవిషము పుచ్చుకొన్నందుకు ప్రమాణమని । ఋగ్వేదమందే ద్వో అర్థమందు । కేశివిషస్యపాత్రేణ యద్రుద్రేణాపిబత్సహ। అనిఉదాహరించికొన్నారు ఇది కేవలమున్ను పదవాక్యప్రమాణపారీణత్వములేక తమకుతోచినరీతిని వ్యాఖ్యానముచేసికొన్నారు। అదెటువలెనంటె నీశ్రుతివాక్యవ్యాఖ్యానమునకుపబృంహణవచనముదాహరించుటలేదు । గనకనుబహుతరశ్రుత్యుపబృంహకపురాణేతిహాసవిరుద్ధముగనకను । లోకప్రసిద్ధివిపర్యాసముగనకను।ఆవిరుద్ధధర్మ మెటువలెనంటె తెలిపెదము। శ్రీమద్భాగవతాష్టమస్కంధ సప్తమాధ్యాయము॥శ్లో॥నిర్మథ్యమానాదుదధేరభూద్విషంమహోల్బణం హాలహలాంహ్వమగ్రతః।సంక్రాతిమీనోన్నకరాహికచ్ఛపాస్తిమిద్వపగ్రాహతిమింగిలాకులాత్ । తదుగ్రవేగందిశిదిశ్యుపర్యధోవిసర్పదుత్సర్పదసహ్యవీర్యం। భీతాఃప్రజాదుద్రువురంగసేశ్వరా అరక్ష్యమాణాఃశరణం సదాశివం। ఇత్యాది।ప్రజాపతయః । నతెగిరిత్రాఖిలలోకపాల విరించివైరించసురేంద్రగమ్యం। జ్యోతిఃపరంయత్ర రజస్తమశ్చసత్వంనయద్బ్రహ్మనిరస్తభేదం। ఇత్యాది।ఏతత్పరంప్రపశ్యామోన పరంతెమహేశ్వర।మృడనాయహిలోకానాం వ్యక్తిస్తేవ్యక్తకర్మణః । అని। యింతపర్యంతము ప్రజాపతులుచేసిన స్తోత్రమందలి ఉత్కర్షమనుసంధించికొనేది । తదనంతరమందుగౌరీ శివసంవాదముచూచికొనేది । యేసమామంత్ర్యభగవాన్ భవానీంవిశ్వభావనః। తద్విషంగగ్ధుమారేభె ప్రభావజ్ఞోన్వమోదత । తతఃకరతలీకృత్యవ్యాపిహాలాహలంవిషం । అభక్షయన్మహాదేవః కృపయాభూతభావ

మేశ్వరుఁడు తనసామర్థ్యముచేతనే సేయుటసిద్ధము । యీపు
రాణేతిహాసములజెప్పని మహిమముకల్పించి ప్రశంసించినగారు
డపద్మపురాణవాక్యములు గారుడములుగారుడములుగా డెలిసేది,
స్తుతిప్రకరణస్థములుగనక నౌపచారికత్వముచేతనర్థవాదలు।ఇక
విష్ణువంతామ్రింగగానించుకంతమిగిలితెహ్రుదుడు ద్రావెననుమాట
యున్న కేవలయుక్తియుక్తముగాదు।తస్యాఃష్ణురహంవాపి।అనే।
బ్రహ్మవాక్యమువిష్ణువుచేతనున్న గాదనియుండెగనకను। విషాగ్ని
చేత నభిభూతుఁడాయెననేగనకను।ఆవిషము తేరిచూడనున్నసామ
ర్థ్యముతేనివేళ్ళమ్రింగనేలాగుసమకొనును। అదిగనకవిషమంతాశి
వుడేహరించినాడుగానిమరొకటిగాదు,ఆలాగే। రామాయణోత్త
రకాండము,,హాలాహలంవిషంసర్వంసజగ్రాహామృతోపమం''అని
విశేషాకారానసర్వమని ప్రయోగించెగనుక నందులోకొంతశివు
డుకొంతవిష్ణువున్నని వ్యాఖ్యానము సేయగూడదు, కాఁడున్నట్టాయె
నారామాయణమునకెఅప్రామాణ్యమువచ్చును, అదితమకిష్టాపత్తి
న్నిగాదు.ఇక, కెశివిషస్యపాత్రేణరుద్రేణాపిబత్సహ। అనె, బుఖ్య
నకున్నరామాయణ వాక్యానుకూలముగానె వ్యాఖ్యానము చూ
డదగినదాయెను, మరొక ప్రకారముగా నుపబృంహణ వచనము
లేదు గనుకను, ,, ఇతిహాసపురాణాభ్యాం వేదంసముపబృంహ
యేత్।'' అని, వేదోపబృంహణాంగమైన యితిహాసలక్షణము
గలది గనుకను, యీ రామాయణము విశేషించిన్ని వేదార్థో
పబృంహణార్థమై వచింపబడ్డది. ఆలాగే, ,,తౌతుమెధావినౌదృ
ష్ట్వావెదెషుపరినిష్ఠితౌ । వేదోపబృంహణార్థాయ తావగ్రాహ
యతః ప్రభుః । అనె, గనుకను వేదవిరుద్ధత్వము రామాయ

ణమ్మునకుగూడదు, అదిగనుక నే నరసింహోత్తర పురాణమందు॥
శ్లో॥ మథితాద్వారిధేర్జాతంకాలకూటమహావిషం। మృత్యుంజయత్వయాసర్వంగిళితంసురసన్నిధౌ।అని, యీలాగు సర్వమున్ను హరించెననే వచనములు తరుచుగలవు విస్తరభయమున వ్రాయతైతిమి. విష్ణువంతా మ్రింగగా వ్రేళ్లసందున జిక్కినవిషము శివుడు మ్రింగనేమి నిమిత్తము,అతనికడుపు పట్టకుండగానా? లేక, మధురవస్తువు గనుక నా?జరామరణాదులుడిపేర సాయనము గనుక జిహ్వ చాపల్యముననా? అమృతమైతే వ్రేళ్లసందునాజిక్కకుండా నాకిపోవుచున్నాడు, విషముగాగా యింతమాత్రము శేషము దొరికెను యీతలిహాప్రసాదము సాపడితే నాత్మతరించుననుచు నా? మరొకవిధమేమైనా నున్నదా తెలియదు. * *

## ✱త్రిపురసంహారము.✱

త్రిపురవిజయమున్నీలాగేవిష్ణుశక్తినేకాని రుద్రుడుస్వసామర్థ్యాన లేదు, యెటువలెనంటే దేవతలు త్రిపురాసురవధనిమిత్తము రుద్రునిప్రార్థించితే రుద్రుడుతిరుగా వారిప్రార్థించి మీరందరున్ను నాకుపశుపతిత్వమీవలెనని అడిగికొంటే వారాతీరున నొప్పితె నాతరువాత త్రిపురముల మీదనడచి యుద్ధముచేసికొంత రాక్షస సేనజంపితే. రాక్షసులావచ్చిన మూకను సిద్ధరసకూపమందునిల్పితే వారు బ్రదుకుచూరాగా రుద్రుడు తనచేతగాక శ్రీహరిని ధ్యానముచేసితే ప్రసన్నుడై తాగోరూపమై బ్రహ్మను దూడజేసికొనిపోయి ఆసిద్ధరసమంతా గ్రోలి మరిన్ని. ఆరాక్షస స్త్రీలపతి వ్రతాత్వము భంగముచేసితేగాని జయింపలేడని అది నిమిత్తము బుద్ధావతారమై ఆపని నిర్వహించిన్ని శివుని రథథా

రముచేత భూమి గుఱ్ఱంగుచూరాగా వృషభాకారమై రథమునో
చిన్న బాణాగ్రమందు తానిలిచి ఆపురము దహించిన్న. యీలా
గు బహుతర సాహాయ్యముచేసి శ్రీహరి గెలిపించినాడుగాని రు
ద్రుడు తనశక్తిని గెలుచుటలేదని కొన్ని సామాన్యవచనములు
దాహరించికొన్నారు, అవునాలాగే యిన్నివిధములనున్ను ఉపక
రించి శ్రీహరి త్రిపుర దహనకాలమందు సహాయమగుట గలదు'
అయ్తెనా నింతమాత్రమున శివునికన్న నధికుడని చెప్పగూడదు,
శివుడు రథికుడున్ను నియామకుడున్ను గనుక. అదెక్కడిమాటం
టే నాకాలమందు రథమైనభూమిన్ని గుఱ్ఱములైన వేదములున్ను
రథచక్రములైన చంద్రార్కులున్ను సూతకృత్య వత్సకృత్యములు
నిర్వర్తించిన బ్రహ్మదేవుడున్ను, విల్లైన మేరువున్ను, నారియైన
శేషుడున్ను, పార్ష్ణి గ్రాహపార్శ్వచరులైన దేవపారిషదగ
ణములున్ను, రుద్రునికన్ననధికులెకావలయును, అదియున్నవునన
గూడదు, ప్రధానాప్రధానని యామకని యమ్యాది భేదమెరుగక
తత్తత్ప్రయోజన సాధకత్వ జ్ఞానముచేత నాధిక్యము నిర్ణయించె
దనకావచ్చితె ప్రత్యక్షసిద్ధమైన స్వామి భృత్యాది లోకవ్యవహా
రమునకున్ను విపర్యాసము వచ్చును, అయితె రథాదులైన భూ
మ్యాదులవలెగాదు రుద్రుడు తనచేతగాకననేక పలువిధములప్రా
ర్థించితెవచ్చి ఆయా ప్రయోజనములు బుద్ధాద్యవతారముల
చేతను మట్టుపరచి గెలిపించినాడు గనుక శ్రీహరి ప్రధానము
అన్నట్టాయెనా రావణవధార్థమై చేసిన పౌరుషమునకు శ్రీరా
ముడున్ను అప్రధానమేఅయిపోవును, యెలాగంటే, ఒకానొకవేళ
యుద్ధరంగమందు [illegible] పరమర్శజ్ఞానముచేత హెచ్చ

రించిన విభీషణుడున్ను, నాగపాశములనూడ్చిన వైనతేయుడున్ను, అందు కుపదేశించిన నారదుడున్ను, సంజీవిదెచ్చిన్ని వాహనమై బహు ప్రకారముల నుపకరించిన హనుమంతుడున్ను, సహాయులై శత్రుసంహారము చేసిన సుగ్రీవాదులున్ను, ఆదిత్య హృదయది వ్యాస్త్రాదు లుపదేశించిన అగస్త్యుడున్ను, శ్రీరఘునాయుడు లగడవ నధికులున్ను, ప్రధానులున్ను అగుదురు, ఇత్యాద్యతి ప్రసంగమునక నవస్థ నిర్వర్తింప నిది సర్వత్రసులభము, అయితె, అర్జునునకు సారథ్యము సేయడా? అంచుచేత నతనికన్న తక్కువనవచ్చునా? ఆలాగె, యిదిన్ని. మరియు వృత్రాసురవధచేసి ఆగెలు పింద్రునకియ్యడా? యీలాగు, భక్తవాత్సల్యమున నిష్టముచేనూడిగముచేసి గెలిపించినట్టువలెనె యిదియనన గూడదు, అదేమంటే, శివుడు రాజున్ను, విష్ణ్వాది దేవతలు భృత్యులున్నగుట అనాది సిద్ధము, అందుకు ప్రమాణము, పరాశరపురాణము॥ శ్లో॥ రాజాధిరాజాస్సర్వేషాం త్ర్యంబకస్త్రిపురాంతకః । తస్యైవానుచరాస్సర్వే బ్రహ్మవిష్ణ్వాదయస్సురాః । అని, అదిగనుక భృత్యుడెంత ప్రభావము చేసినా భృత్యశ్రేష్ఠుడగుగాని ప్రభువుగడవ నధికుడు గానేరడు, అందరివలెగాదు విష్ణువు పరమేశ్వరునిచావున స్వామ్యుడున్ను, మహానమ్మిన భృత్యుడున్ను గనుకనీసమయమున నేకాదు మరియు నెన్ని యెడలనే పనికైనానమరి శివుని అనుగ్రహము వడసినాడు, ఆ ప్రసంగములు కొన్నిసూచించెదము, బ్రహ్మోత్తర ఖండమందు॥ శ్లో॥ వాగ్దేవీధృతవల్లకీశతమఖో వేణుందధత్పద్మజః స్తాలోన్నిద్రకరోరమా భగవతీ గేయప్రయోగాంచితా । విష్ణుస్సాంద్రమృదంగవాదనపటుర్దేవాస్సమంతాత్ స్థితాః । సేవంతేతమను

ప్రదోష సమయే దేవమ్మృడానీపతిం । అని, మద్దెలకాడై సేవిం చెనని యున్నది. ఈశానసంహితయందు, విష్ణుప్రార్థనము ॥ శ్లో॥ అహంకారప్రశాంత్యర్థం సర్వదాపరమేశ్వర। తస్మాదాదిశ మే దాస్యంనిత్యధాకతుర్మీశ్వర । రుద్రవాక్యము॥ శ్లో॥ చతుష్పా ద్వృషరూపీత్వం బ్రహ్మణః పుత్రతాంగతః । ధర్మస్సర్వార్చి తః శశ్వద్వాహనో మేభవానిశం । ధ్వజేచమమగోవింద తేనమాం వృషభధ్వజం । ఆహుర్వ్యృషభవాహంచ సూరయో వేదతత్పరాః। అని, వాహనధ్వజరూపములైన్ని వాసిష్ఠ లైంగ్యమందు, ఈశ్వర వాక్యము॥ శ్లో॥ విష్ణుశ్చమాయయాబ్రహ్మన్ భార్యాభూన్మమ సుం దరీ। తయాసహమహాక్రీడాంకృత్వావేషందిగంబరం। అని, దారు వనక్రీడయందు, భార్యాకృత్యము నడపిన్ని; కాశీవిరహము చేతమం దరపర్వతమందు వసించినప్పుడు దూతకృత్యము చేసిన్ని; లోకర క్షణార్థము పట్టముగట్టితె ప్రధానిత్వము నడపిన్ని, యీలాగు, పరమేశ్వరుడు నియమించినట్టు నడచుకొనే విష్ణువుకు త్రిపురసం హార సమయమున నడచుకొన్న నియమ్యత్వమన గా నెంత. అయితే, భృత్యులను ప్రార్థించె ప్రభువులుగలరా? అంటే, లోకమందెం త సామర్థ్యముగల ప్రభువులైనా నొకానొక సమయమున సా మంతామాత్యాదులగూర్చి యీసమయాననీప్రయోజనమునీవు నిర్వహింపక తరింపముగదాఅని, ప్రార్థించి నడపించుకొని తరు వాతనున్ను నిన్నుంచిగదాయీదుర్లభపుపనిసాధించుకొంటిమని ఉపచరింతురు, యీలక్షణము రామాద్యవతారములందున్ను, వర్త మాన ప్రభువులందున్ను, గలదు తెలిసికొనేది. అయితే, శ్లో॥ త్రిపు రంజఘ్నుషఃపూర్వంబ్రహ్మణావిష్ణుపంజరం। శంకరస్యకురు శ్రేష్ఠర

క్షణాయనిరూపితం।వాగీశేనతుశక్రస్యబలంహంత్రుప్రయాస్యతం। అని,విష్ణుధర్మోత్తరమందున్ను॥ శ్లో॥ అద్వితీయ్యంయదాబ్రహ్మతారకబ్రహ్మనామకం।జపిత్వాసిద్ధిమాప్నోతిసత్యంసత్యంవదామ్యహం॥ ఇమమేవజపన్మంత్రంరుద్రస్త్రిపురహంతకః । బ్రహ్మహత్యా వినిర్ముక్తఃపూజ్యమానోభవత్సురైః ।అని,హారీతస్మృతియందున్ను విష్ణుపంజరరామమంత్రపఠన ప్రభావమున త్రిపురములుజయించినాడని చెప్పుచున్నదిగదా అంటే అవును ఈ ప్రసంగము, "వ్రతానాముత్తమం వ్రతం" అన్నట్టువలెనే యేవ్రతమైనానేమి యేమంత్రమైనానేమి ప్రశంసించేటప్పుడు అందువలననే సకలదేవతలున్ను తమతమపదవిసంపాదించికొన్నారని ఉత్కర్షార్థమై స్తుతించేటి అర్థవాదములుగలవు, అలాగే నిక్కడన విజపించినవారికి కోరికలుఫలించుననివిధించి ఫలశ్రుతియందు లోకులకు విశ్వాసముపుట్టేటికొరకు పూర్వమందీ విష్ణుపంజరముజపించి యీమహిమనయ్యేవేరుద్రుడు త్రిపురములుజయించెను - రామమంత్రప్రసంగమందు, నీమంత్రజపసిద్ధిచేతనే త్రిపురవిజయముచేసెనని న్ని "॥శ్రు॥సఆత్మనోవపాముదఃఖదత్ "అని, బ్రహ్మదేవుడు తనశరీరము ఛేదించి ఆవపచేత యజ్ఞముచేసెనని శ్రుతియందుచెప్పిన అర్థవాదమువలెనే రుద్రునిసగా ప్రయోజనార్థమై జపించెననెడి అర్థవాక్యములుగాతెలిసికొనేది,అదెక్కడిమాటన్నట్టాయెనా యిందుకొకబాధకముచెప్పెదము॥శ్లో॥త్రిపురంహంతుకామేనపూజితఃశూలపాణినా।రామచంద్రేణతద్వచ్ఛసీతాయాయతతాపురా।దృష్ట్వాసీతాంసహీభార్గవీరేణచహనూమతా। అమృతోత్పాదనార్థాయతదాదేవాసురైరపి।అమృతంహరతాపూర్వంవైనతేయేనపక్షిణా। ఆరా

ధితాగణాధ్యక్షారుక్మిణ్యాసహితేనచ।అని, స్కాందపురాణమం
దలి విఘ్నేశవ్రతకల్పమందు జెప్పిన, రామహనూమత్సురాసురగ
రుత్మత్కృష్ణాదులంతా వినాయకవ్రతనిష్ఠచేతనే అధికులైనారని
న్ని, ఉపాసకులనిన్ని నిశ్చయింపబడెను. యిటువంటిప్రశంసలు
సమస్తవ్రతప్రసంగములందునాగలవుగనుక వాటియందున్నప్రసం
గమువచ్చును,అదిగనుక“త్రిపురంజఘ్నుషః”అనిన్ని,“ఇమమేవజప
న్మంత్రం” అనిన్ని, ప్రశంసించిన అర్థవాదములు, విష్ణ్వాధిక్య
ప్రతిపాదనమందున్న రుద్రోపాసకత్వ నిర్ణయమందున్న ప్ర
మాణములుగానేరవు, ఇదిగాక విష్ణువుకు మొదటికి స్వతస్సిద్ధబ
లముగలిగితేగదా మర్యాకరికుపకరించేది “వాతాద్విష్ణోర్బలమా
హుః”అని, శ్రుతియందుపరిమాణాధికరణన్యాయముచేతను; “స
ర్వోవైరుద్రః” అనియున్నదిగనుక సర్వగతుడౌటబట్టిన్ని అష్ట
మూర్తిత్వముచేత వాతశబ్దవాచ్యుడైనపరమేశ్వరునివలననే బలి
మిగలవాడనిచెప్పెను,ఆలాగే ద్రోణపర్వము॥శ్లో॥మత్ప్రసాదాన్మ
నుష్యేషు దేవగంధర్వభోగిషు।అప్రమేయబలాత్మాత్వంనారాయ
ణభవిష్యసి।అని, ఉపబృంహకవాక్యైకకంఠ్యముగనుక,“అక్ష రా
ద్దీప్తిరుచ్యతే”అని,కూటస్థుడుగనుకను,నాశరహితుడుగనుక,అక్ష
రశబ్దవాచ్యుడైన శివునివలననే విష్ణువుకు తేజస్సున్ను సంభవించె
ననిచెప్పెను, బ్రహ్మగీతలందు॥శ్లో॥ హరిరహమ పరస్సురాసురా
ద్యాఃపరమశివప్రభయాతిరస్కృతాశ్చ। భాస్కరకిరణైరహోనియ
ద్వత్పరమశివస్తతఏవబోధకారీ।అని, శివునికైతేస్వతస్సిద్ధమైనబల
ముగలదు,చతుర్థస్కంధమందు॥ శ్లో॥ నాయంనయజ్ఞోనచయస్య
యాయం యే దేహభాజో మునయశ్చతత్వం। విదుః ప్రమాణంబల

వీర్యమోరాద్వాతస్యాత్మతంత్రస్యకఉద్విధిత్సేత్। అని, అదిగనుకని రుపాధికశక్తిమంతుడైన శ్రీ మహారుద్రునికి సోపాధికబలాఢ్యులైన విష్ణ్వాదులఅపేక్షవలన నేమిప్రభుత్వలక్షణముగనుక రధికత్వాది వ్యవహారమునడిపికొన్నాడు, ఆలాగే, యజుస్సంహితయందు, "శ్రు॥ తేషామసురాణాంతిస్రః పురఆసన్న యస్మైయవమాథరజతాథ హరిణీతాదేవాజేతుంనాశక్నువన్ తాఉపసదైవాజిగీషన్ తస్మాదాహుర్యశ్చైవం వేదయశ్చనోపసదావై మహాపురంజయంతీతిసఇషుగ్ సమస్కుర్వతాగ్నిమనీకగ్ సోమగ్ శల్యంవిష్ణుంతేయనం తే బ్రువన్కఇమామశిష్యతీతి రుద్ర ఇత్యబ్రువన్ । రుద్రోవైక్రూరః సోస్యత్వితి" అని, మొదల నాత్రిపురములను దేవతలు జయింపలేకవచ్చి యీపురములు జయించేవాడెవడుగలుగునో అనివిచారించి, అగ్నిసోమవిష్ణువులగూర్చిన ముగురిని నమ్ముగాజేసి యీ అగ్నిసోమవిష్ణ్వాత్మకమైన బాణముప్రయోగించి మహాపురములు జయించేటందుకు యిక రుద్రుడేకాని సమర్థులు లేరని యీలాగే విచారపూర్వకముగా రుద్రునిచేతనేకాని కాదని నిశ్చయించిరని, శ్రుతి చెప్పె గనుక బాణమైనవిష్ణు వప్రధానమున్ను, ప్రయోక్తఅయిన రుద్రుడుప్రధానమున్నాయెను । ఇదిగాకచంద్రాగ్నులతోసమానత్వమున్ను పారతంత్ర్యమున్ను విష్ణువందుగనుపించెను । ప్రార్థనాదికముకనబడదాయెను। దేవతలుస్వాతంత్ర్యమున నె అగ్నిచంద్రోపేంద్రులనమ్ముగాజేసిరనేగనక। ఇదిగాక। శ్రుతియందె । తానేరుద్రవాసృజత్యత్రిస్రః పురోభిత్త్వైభ్యోలోకేభ్యోసురాన్ ప్రాణుదత। అని రుద్రుడెజయించెనని మందలించెగాని విష్ణుశక్తిగానీ విష్ణుపంజరరామమంత్ర సామర్థ్యమున

గానిజయించెననుట లేదాయెనదిగనక యీశ్రుతివిరుద్ధములైన విష్ణుధర్మోత్తరాది వాక్యములు విరోధాధికరణన్యాయముచేతనౌ పచారికములుగాదెలిసికొనేది । దేవతలకుదుర్జయులైనాగాని త్రిపురాసురులు రుద్రునికితృణప్రాయమైతే నింతఆడంబరముగూర్చికోవలెనా అంటేనది ప్రభుత్వలక్షణము । కొంచెపుపనికై నాదమకుగల సన్నాహమంతాజూపుదురు । ప్రభువులబుద్ధిస్వతంత్రముగాని పరతంత్రముగాదు । ఆలాగె। మహిమ్నస్తుతియందు। "దిధక్షోస్తే కోయం త్రిపురతృణమాడంబరవిధిర్విధేయైః క్రీడంత్యోన ఖలుపరతంత్రాః ప్రభుధియః" అని।ఆలాగె । నరసింహపురాణము।శ్లో॥రథః క్షమాచక్రయుగౌ సూర్యచందౌతురంగమాః। వేదాఃసూతోవిరించి శ్చజ్యాశేషోధనురద్రిరాట్ । సితాస్త్రమింది రాధీశ ఇత్యాడంబరపూర్వకం । తృణవత్సంహృతానీశపు రాణిత్రీణిలీలయా । అని। ఇదిగాక మొదలతాననుగ్రహించినియ మించిన అధికారమహత్త్వమున మత్తులై ప్రేష్యప్రేషకభావమెరుగకున్న దేవతల కెరుకపడేనిమిత్తము ఆసమయమున నటువంటిసారథ్యాదికైంకర్యములు నడిపించికోవలసినదిగనక స్వభావసిద్ధమైన దైనాగానీ తనప్రభుత్వమున్ను వారిభృత్యత్వమున్ను క్రొత్తగానపుడుదెలిసే నిమిత్తముదేవతలగూర్చి మీరందరూపశువులున్ను నేనుపశుపతినిన్ని గావలయునని ప్రార్థించినట్టున్ను వారువొప్పినట్టున్ను వరదానపరిగ్రహవ్యాజముచేత తెలుపుదుచేసివారి బనిగొనెను । ఆలాగె।శ్రుతియందు"సోబ్రవీద్వరంవృణా అహమేవపశూనామధి పతిరసాని" అని"తస్మాద్రుద్రః పశూనామధిపతిః" అని।అయినాగాని పాశుపత్యవరయాచనముగూడు నాయాచనదై

న్యమూలముగనక శ్రేష్ఠత్వవిరోధమువచ్చెగదా అంటె బ్రహ్మాది జీవులకు పశుపత్వమున్ను పరమేశ్వరునికి పశుపతిత్వమున్ను అనాది సిద్ధమైనది। అయినాగాని పరమకారుణికుడైన భగవంతుడా పరమే శ్వరుడు । తామసవిద్యాదిపాశగ్రస్తులమైన మనలపశువులనిన్ని। అవిద్యాస్మితారాగద్వేషాదిసంసారధర్మము పాశరూపమనిన్ని అం దుకు। బంధమోక్షకర్తయైన పశుపతిపరమేశ్వరుడనిన్ని యీలా గంటె త్రివిధమైన పశుపాశపతిజ్ఞానశూన్యులై జననమరణాదిదుః ఖములనుభవించె దేవతలజూచి దయవచ్చిపరమపురుషార్థము న్ను ఆత్మతరుణోపాయమునైన్ను పాశుపత్యజ్ఞానోపదేశముచేత ననుగ్రహించెనిమిత్తమై। త్రిపురవిజయరూపోపకారప్రదర్శనమనె వ్యాజముచేత నాదేవతలనభిముఖముచేసికొనివారికి। నేను పశుపతి నిన్ని మీరుపశువులున్న నిపాశుపత్యజ్ఞానముపదేశించిన వాడా యెను, యీపశుత్వమోక్షార్థమై పాశుపతవ్రతమాచరింపుమని మోక్షోపాయమున్నుపదేశించెను। యీవృత్తాంతముకర్ణపర్వ మందుచూచికొనేది । అదిగనక సకలలోకాప్తుడై రాగద్వేషర హితుడై నిర్మత్సరుడైనపరమేశ్వరుడు తానుపశుపతిగనక నేపశు వులైన సురాసురాదిజీవులందు విష్ణువవలె పక్షపాతముసేయక మధ్యస్థధర్మమునలోకమందుల పశుకర్తయుంబలెనే దుర్బలులై నవారిని రక్షించేదిన్ని దుష్టులైనవారిని సిక్షించేదిన్ని। ఇందుకా లాగుననె । బ్రహ్మవిష్ణుదక్షయమమన్మథాది దేవతలనున్ను జలంధ రాంధకాసురాదిరాక్షసులనున్ను సిక్షించుటసర్వప్రసిద్ధమైయున్న ది। ఇదిగాక పరయాచ్ఞాదైన్యమున్ను సంభవింపదు। లోకమందు నొకానొకజనుడు తనబిడ్డల బహుమాన పూర్వకముగా ప్రార్థిం

చి హితోపదేశము చేసినట్టువలెనే "ఆతెరుదర్పితర్మరుతాగ్సుమ్నమెతు" అనే, శ్రుతిప్రమాణముచేత దేవతలకు దండ్రియైనరుద్రుడు తనబిడ్డలైన దేవతల ప్రార్థనా పూర్వకముగా పాశుపత్యజ్ఞానోపదేశముచేసినాడు గనుక "పుత్రాదిచ్ఛేత్పరాజయం" అన్నారు గనుక తనకుమాళ్లను తానడుగుకొనుట యేమినైచ్యము, అయితే, "వరంవృణా" ఇత్యాది పాశుపతవరణ ప్రతిపాదకశ్రుతులకు గతియేమంటే, నర్థవాదత్వమేగతి। అదెటువలెనంటేచెప్పెము, శ్రుతులు, "ప్రాజాపత్యా వైపశవస్తెపాగ్రుద్రోధిపతిః। పశూనాంచతుష్పముతదాంచద్విపదాం అనిన్ని, పశుపతయేనమః। అనిన్ని ఆలాగెపురాణము॥ శ్లో॥ బ్రహ్మవిష్ణుసురేంద్రాద్యాః పశవఃపరికీర్తితాః। తేషాంపతిత్వాద్దేవేశః శివఃపశుపతిస్మృతః। అని, స్వతఃసిద్ధంపతిత్వంమెయుష్మాకంవసీతాపిచ। అనిన్ని, ఇత్యాద్యనాదిమత్వబోధక శ్రుతిపురాణాంతర విరోధముగలదు గనుక పరయాచన ప్రతిపాదక శ్రుతులకు స్వకీయార్థ ప్రతిపాదనమునందు ప్రామాణ్యము లేదు, మరేమంటే, అనాదిమత్వ పశుపతిత్వాది విధివాక్యగతార్థమునె ప్రతిపాదించును, లేకున్నట్టాయెనా "సర్వావైవరంవృణా ఇతి" వరంవృణీష్వ। అని, సఏతమెవవరంవృణీత। అని, పశూనామాధిపత్యం। తదస్యైపశూనానున్నమెతి। అహంమెవపశూనామధిపతిరసాని। అని, తస్మాద్రుద్రః పశూనామధిపతిః। అనిన్ని యిటువలెను. శ్రుతులందు నొకపశుపతిత్వ మనేకమారులు వచింపనున్నా యియ్యనున్నా నిమిత్తమేమి. యిది యుక్తియుక్తమగునో కాదో తెలిసికొనేది. అదిగనుక నీశ్రుతివాక్యము అర్థవాదములగుట సిద్ధము. అర్థవాదలనంగా భట్టువాండ్లవలెస్తుతి

చేయుచువచ్చేది।ఆత్మజ్ఞానముదురవబోధముగనక నదిలెస్సగాప్రక
టనముచేసెనిమిత్తమైతెరుచుగావరదానాదానము లుచ్చరింపబడిన
విగాని వఃరొకవిధముగాదు।అయితెప్రాజాపత్యాఃపశవః।ఇత్యా
దిశ్రుత్యుక్తపాశుపత్యప్రతిపాదనమున్న ఆగంతుకవిషయమేలవు
ననగూడదు । అదేమంటె వేదమునకనిత్య సంయోగాఖ్యదోషప్ర
సంగమువచ్చును। గనకనాదిమత్తైనవేదానకు ఆదిమత్పాశుపత్య
ప్రతిపాదకత్వముయుక్తముగాదుగనక । నయితె । హరిశ్చంద్రో
వైరాజాబభూవ । అని । ఇంద్రంవృత్రంజఘ్నివాగ్సం । అనిన్ని।
ఆదిమత్ప్రవృత్తిప్రతిపాదకములుగనకనీశ్రుతులకు న్నాదిమత్వప్రసం
గమువచ్చునని బాధకముచెప్పనూగూడదు । యీవాక్యములకెప్ర
వాహరూపముచేతనాది మత్వముశాబరభాష్యజైమిని సూత్రాదు
లప్రతినర్థప్రతిపాదకాద్యనిత్యసంయోగపరిహారార్థముప్రతిపా
దించినారుగనక । అయితెవాటికివలెనేరుద్రపశుపతిత్వవరణప్రతి
పాదక శ్రుతులకు నాదిమత్వముగలుగుననశక్యముగాదు।।పకఎవరు
ద్రోనద్వితీయాయతస్థె" అనిన్ని।ఇమాంలో కానీశత ఈశనిభిః।అని
న్ని। శ్వేతాశ్వతరాదశ్రుతివాక్యములందు రుద్రైకత్వమువినబడు
చున్నదిగనక।అయితేనట్లుపరమేశ్వరునికిస్వరూపముచేతననాదిమ
త్వముగలిగినాగాని-ప్రవాహరూపముచేత నాదిమత్వముగలుగును
"సహస్రాణిసహస్రశోయెరుద్రఅధిభూమ్యాం" ఇత్యాదులచేతనా
దిమత్వంగనిపించుచున్నదంటిరా । ఆదిరుద్రావతారభూతరుద్రప
రముగనుక అనాదిమత్వవిరోధము లేదు ఇదకాక నీప్రసంగమున
కొకబాధకతర్కమున్న దాహరించెదము । పరమేశ్వరునికిపశు
పతిత్వము వ[illegible]సిద్ధ[illegible]చెవాదు । వైదికుడా। వేదబా

హ్యుడా । వైదికుడైనట్టాయెనా । దేవతాభ్యోవరంప్రాప్యస
ముద్ధాప్యచవానరాః । అనే। రామాయణవాక్యమున్ను ప్రమా
ణమేకనక విష్ణువుకున్ను వరయాచనమపకర్షణమేఅవును - అదిస
మ్మతింపబడుచున్నది। ఉభయత్రసమానమేఅవును । వేదబాహ్యు
డాయెనావానికి వేదముప్రమాణముగాదు గనుక వేదప్రతిపాద్య
ములైన పాశుపత్యవరణ ప్రసంగమునకాశ్రయాసిద్ధి గ్రస్తత్వము
ప్రాప్తమగును । అదిగనకప్రకృతమునవిచారించితె పాశుపత్యవర
ణమాధిక్యద్యోతకమేకాని అపకర్షాపాదకముగాదు । యెటువ
లెనంటె॥శ్లో॥తావప్యతిబలోన్మత్తౌమహామాయావిమోహితౌ। ఉ
క్తవంతౌవరాన్మత్తోప్రియతామితికేశవం । విష్ణురువాచ। భవేతా
మద్యమేతుష్టౌమమవధ్యావుభావపి । కిమన్యేనవరేణాత్ర హ్యేతా
వద్ధివృతంమయా । అని।మార్కండేయపురాణోక్తమైనమధుకైట
భులగూర్చి విష్ణువరయాచనమువలెనె అవుగాక। వారికిపశుత్వ
మున్నుతనకు-పశుపతిత్వమున్ను రుద్రుడుదేవతలనడిగి పుచ్చుకొను
టయాథార్థ్యమగును । అయినాగానిహాని ఆధిక్యమునకు లేదు।
యెటువలెనంటె । అమాత్యభృత్యపురోహితసామంతాదులచేత
సామ్రాజ్యపదమందునభిషిక్తుడైన రాజకుమారుడు తనకుపట్టము
గట్టిన అమాత్యాదులగడవతక్కువగానేరడు । అతనికి - స్వామి
త్వనియామకత్వ ప్రముఖస్వాతంత్ర్యాదికమున్ను నిర్వర్తింపదు।
అటువలెనేస్వాభావికత్వముచేత పశువులైనదేవతలఅంగీకారము
చేత పశుపతిత్వమునొందినశివునికి । నియామకత్వమున్ను దేవతల
కునియమ్యత్వమున్ను మరిన్నిదృఢమాయెగానికొద్దివడదు। ఈలాగె
లోకమందున్ను నొ కా నొకపుడు [illegible] ప్రార్థనం

చిస్వయంవరప్రవర్తనమైన కన్యకచేతవరింపబడి ఆకన్యకకు తా పెనిమిటియై సతీపతిన్యాయమే నడిపించికొనును । అలాగెఅధి కృహానిలేదని తెలిసికొనేది, అదిగనక విష్ణ్వాదిదేవతలకజేయులైన త్రిపురాసురులను జయించుటకును శిక్షించుటకును సర్వస్వతంత్రుడై నపశుపతికిగాక తక్కినపశుకోటిలోని దేవతలకు శక్యముగాదు। ఇందుచేతత్రిపురవిజయార్థము వారువ్రాసికొన్నసాధకములు— బాధకములాయెను॥

—॥ వ్యాసవాగ్భుజాస్తంభనం ॥—

సత్యంసత్యంపునస్సత్యముద్ధృత్యభుజముచ్యతే వేదశాస్త్రా త్పరంనాస్తినదైవంకేశవాత్పరం। అనికాశీలోచెయ్యెత్తినవ్యాసుల హస్తమట్టె స్తంభించెననికొన్నిపురాణములగలదు। అదివైదికశా స్త్రవిరుద్ధముగ నకప్రమాణముగాదెటువలెనంటె । వేదోక్తము లైన వైదికానుష్ఠానములకన్నిటికి విశేషమైననిత్యకర్మముసంధ్య ఆ సంధ్యకు మొదట కేశవ శబ్దమున్నాకడపటను కేశవంప్రతిదచ్ఛతి అనికేశవశబ్దమున్నది । ఈలాగుసంధ్యకాద్యంతములందున్నుచ్చ రింపబడెకేశవుడే వైదికాధిదేవతగనక వ్యాసులున్నునదైవంకేశ వాత్పరం।అనెను।అంటెనదిసత్యముగాదని। రుద్రుడెపరతత్త్వంఅనె గనక అదివేదవిరుద్ధమని తెలుసుకొనేది । ఇదిగాక “సహోవా చవ్యాసఃపారాశర్యః” అని। యజురారణ్యభాగమునచెప్పినది।గనక శ్రుతిప్రశంసిత ప్రామాణ్యుడైన వ్యాసునివాక్యవిరుద్ధములైన। కా శిఖండాదివాక్యములు పూర్వపక్షములని నిర్ణయించికొన్నారు ఇంకను ప్రత్యుత్తరముముందలించెదము। సంధ్యకాద్యంతములందు కేశవనామోచ్చారణమావశ్యకముగాకునికిన్ని వెదికావైదికదేవ

తానిర్ణయమున్ను ద్వితీయప్రకరణమందు పూర్వమందు లెస్సగా చేసినాముగనక పిష్టపేషణమగునని యిక్కడను పేక్షింపబడెను। కావలసిన వారైనఅక్కడచూచికొనేది। అయితే శ్రుత్యుక్తప్రమాణికులైన వ్యాసునివాక్యమబద్ధముగా నేచున్నా అంటె అవునందుకా వ్యాసవచనవిరోధమె తెలిపెదము। నబ్రహ్మేశసమంబ్రూయాచ్ఛక్తిభిశ్చైవ పార్వతీం। బ్రూయాద్యదిసమంశంభుం బ్రహ్మాణ్ణాద్భిస్సురైః। యఃకశ్చిత్తామసావిష్టః కదాచిన్నైవతంస్పృశేత్। సర్వస్మాదధికంబ్రూయాచ్ఛగవంతముమాపతిం। తదాదేవీంచగిరిజాంద్విజః శ్రేయోర్థభాగ్భవేత్ । అనివ్యాసగీతలందువిష్ణ్వాదులతోసమానముసగా రుద్రునికిజెప్పరాదన్ని తమోగుణావేశమున నొకానొకమూర్ఖుడు ఇతరదేవతలతో సమానముగా జెప్పినట్టాయెనా వాడుముట్టుకొనఅర్హుడుగాడనిన్ని వ్యాసుడు నియమించెగనక తానేమెలాగుబొగడి కేశవునిగడవపరమైనతత్వము లేదని ప్రమాణికముజేయువచ్చును । ఈవ్యాసగీతలుకూర్మపురాణస్థమని తామసత్వవ్యపదేశకల్పనముగూడదు । వ్యాసవచనముగనక। కాకున్నట్టాయె నాదాముదాహరించిన । సహోవాచవ్యాసః పారాశర్యః।అనైశ్రుత్యుక్త ప్రామాణ్యమునకు వ్యభిచారమువచ్చును।యీలాగునసకలదేవతాధికుడుశివుడెఅని।ఆవ్యాసులకుతండ్రియైనపరాశరునివాక్యమున్నుగలదు॥ శ్లో॥ సర్వస్మాదధికత్వంయేనవదంతిపినాకినః। సమమన్యైర్వదంత్యేవం తెమహాపాతకైర్యుతాః। ఆధిక్యంసర్వమానానాంయథావేదస్యవిద్యతే।తథా రుద్రస్యదేవానామాధిక్యంవిద్యతెనఘ । ఆధిక్యంసర్వదేవేభ్యోస్సునుతేశంకరస్యయః। సం... ...త్తిర్ణమ...త్తి...సగచ్ఛతి॥

అని। దేవానాంప్రథమం దేవం జన్మనాశాదివర్జితం।రుద్రంవిశ్వాధికంనైవ మన్యంతే పాపకర్మిణః। అని। దేవతాసారమాధ్యాంచ యథావద్వేత్స్యసేభవాన్ । అనేవిష్ణుపురాణస్థవుల స్త్యవరముచే తనీపరాశరుడున్ను దేవతాతత్త్వజ్ఞానమందు ప్రామాణికుడు।అది గనకనే వేదమందు । సహోవాచఃపారాశర్యః । అనిపరాశరుని కుమారుడైన వ్యాసుడని ప్రామాణ్యమందు ప్రతిష్ఠార్థమై ప్రయోగింపబడెను అదిగనకపరాశరవాక్యమునకు మోహకత్వాదులుక ల్పింపగూడదు । యీలాగెసూతసంహితయందు । హీనంవాపిస మంవాపిహరిణాబ్రహ్మణాహరం । యేపశ్యంతిసదా తేతుపచ్యం తెనరకాణ్ణవె।హరిబ్రహ్మాదిదేవేభ్యఃశ్రేష్ఠంపశ్యంతియేహరం। తే మహాఘోరసంసారాన్ముచ్యంతె నాత్రసంశయః।అని । అయితేను భయవాదులున్ను వ్యాసవచనములె ఉదాహరించితిరి। యీతుల్య బలవిరోధమందు బలాబలనిర్ణయమేలాగంటె । యస్మాత్పరం నాపరమస్తికించిత్ । అని।నతస్యకార్యంకరణంచవిద్యతెనతత్సమ శ్చాభ్యధికశ్చదృశ్యతె। అన్నిశ్రుతులందు రుద్రునిగడవనితరమైన పరతత్త్వముని షేధింపబడ్డది ఆలాగెశ్రుతీయ్యుస్కంధమున్ను।నిర స్తసామ్యాతిశయోహియస్స్వయం। అనిసాత్త్వికపురాణోపబృంహి తప్రత్యక్షశ్రుత్యుపజీవ్య జాతియ్యమూలకశివాధిక్య ప్రతిపాదక కూర్మపురాణస్థవ్యాసగీతా వచనవిరోధముచేత మూలశ్రుతిహీన మైన।నదైవంకేశవాత్పరం । అనేవాక్యముబాధితమాయెగనక ఆ వాక్యముప్రమాణముగాక నిర్మూలమాయెను। యీలాగునస్వవచ నవిరోధము తేటపరచితిమె । ఇదిగాకశ్రుత్యుక్తప్రామాణికపురు షాంతరవచన విరోధమున్ను తెలిపేము,మానవపురాణమందుమను ష్యవాక్యము । అత ముమ్ముమభ్యస్వాస్స్వాసాబసదేవ్వాహ్వా

యః। పరతత్త్వంవిశేషేణ ధ్యేయమేవసదాహృది । తస్యశేషతయా ధ్యేయా బ్రహ్మవిష్ణ్వాదిదేవతాః । కదాచిదపి మోహాద్వైస్వప్రధానతయానహి । అనిపరతత్త్వముసాంబుడైన శివుడనిన్ని బ్రహ్మవిష్ణ్వాదులతనిసంబంధులనిన్ని । వారెప్రధానమునిన్ని చెప్పెగనక నీమనువచనవిరుద్ధమైన వ్యాసవచనములు ప్రమాణములుగా నేరవు॥ ఇకకూడశ్రుతి। సహోవాచవ్యాసః పారాశర్యః । అనివ్యాసుడుపలికెననెను । అనంగాశ్రుతిపురాణాదులేపరిరచెనని ప్రశంసించుటగాని వ్యాసుడాడినదల్లాప్రమాణమని తెలుపుటలేదు । మనువచనమైతెసర్వప్రమాణమని తెలిపెను । ఆలాగెయజుస్సంహితయందు॥యద్వైకించమనురవదత్తద్భేషజం। ఆనియించుకంతయీమనువేమనిపలుకుచున్నాడోఅదంతాతధ్యమనిమనువచనమాత్రమునకెల్లాప్రామాణ్యమువిధించెను । ఆలాగె।బృహస్పతిస్మృతి - మన్వర్థవిపరీతాతుయాస్మృతిస్సానశస్యతె । అని। అదిగనకశ్రుతిమూలసజాతీయవచనవిరుద్ధమైన । నదైవంకేశవాత్పరం । అనే వచనమువ్యాసోక్తమైనాగాని వేదబాహ్యముగనకవేవైదికశాస్త్రములలోకిజేరదాయెను । భ్రిమప్రమాదములబలికినాడుగనక।యెటువంటిమహాత్ములకైనా నానాకానాకవేళభ్రిమప్రమాదములు గలవు।అహంకారనిష్ఠుడైశివదూషణముచేసినబ్రహ్మపంచమవదనచ్ఛేధమునొందినట్టువలెనే యిక్కడాభ్రాంతినివృత్త్యర్థమై వ్యాసభుజస్తంభనజేయుట నిజముగాని మిథ్యయనగూడదు॥అనాద్యంతం పరంబ్రహ్మనదేవానర్షయోవిదుః" అని। వేదాంతవిజ్ఞాననిశ్చితార్థాం। శివస్యతత్త్వంశివఏవవెత్తి। తస్మాచ్చవిష్ణుర్గిరిజాకుమారోనందీచశిద్ధాంతవిదోనచాన్యే । అని।అదిగనకవ్యాసులకున్ను పరతత్త్వనిర్ణయముదుర్లభము । ఇదిగాక వ్యాసులుభ్రిమపడినప్రసంగములు అనేకములున్నేగలవు ... ... ...

భాగవతప్రథమస్కంధ పంచమాధ్యాయము, నారదః॥ శ్లో॥ పారాశ ర్యమహాభాగ తత్త్వతఃకశ్చిదాత్మ నాజిజ్ఞాసితం సుసంపన్నమపితేమ హదద్భుతం। కృతవాన్ భారతంయ స్త్వంసర్వార్థపరిబృంహితం। తథాపిశోచస్యాత్మా నమకృతార్థఇవప్రభో। వ్యాసః। అస్త్యే వమేసర్వమిదంత్వయోక్తం। తథాపిచాత్మా పరితుష్యతేమే। త న్మూలమవ్యక్తమగాధబోధం పృచ్ఛామహేత్వాత్మభవాత్మభూ తం। సవైభవాన్ వేదసమస్తగుహ్యముపాసితో॥ యఃపురుషఃపు రాణః॥ యీలాగు సకలశ్రుతి పురాణభారతాదులు నిర్మించిన్నిత త్తదాజ్ఞానముఁదెలియక మోహపడంగా నారదుఁడువచ్చి తెలుప గా భాగవతముచేసెననివుండె గనుక నతనికిన్ని భ్రమప్రమాద ములుగలవు, యీవ్యాసులు కాశీనివాసముచేసికొని ఉండగా నొ కనాడతనితాలిమి పరీక్షింపవలసి అన్నపూర్ణాదేవి రెండునాళ్లె క్కడా భిక్షముపుట్టకుండాజేసితె నుపవాసములుండి ఆకటికితా ళలేక కాశీనివాసులైన బ్రాహ్మణులకు శాపముబెట్టదలంచితే అ న్నపూర్ణ కనుపించుకొని శిష్యులకున్నతనికి నన్నముపెట్టి, తృప్తి నొందినతర్వాత నీవొకనాటి ఆకలికితాళలేక నీలాగు కోపముచే సితివికనుండ నహుఁడవుగావు పొమ్మని యాగ్రహించితె కా శీ విడవజాలనని విచారపడగా యీపంచక్రోశ మధ్యమందుండక నవతలనుండుము నీమాత్రమున కదేకాశీ అయ్యీనని అనుగ్రహ ముచేసెను, యిప్పుడు కాశీచొరనవకాశములేక వెలుపలనే ఉ న్నాడు, యీకథ కాశీఖండాదులందు జూచికొనేది, ఇందుకు తామసత్వ మోహకత్వాదులారోపించి కల్లనగూడదు, యిప్పుడు న్న వ్యాసకాశియని క్షేత్రపకీర్తనమున ప్రత్యక్షసిద్ధమై యు

స్నది గనుక, అటకుమునుపు వ్యాసాంబరీష అని, పరమభాగవతుల లోనగ్రగణ్యుడు గనుక విష్ణుభక్తి పరవశమున పరతత్వజ్ఞానము లేక, నదైవం కేశవాత్పరం। అని, శిక్షబడియుండగా ఆయవసరము నవచ్చి విష్ణువు ఆనందికేశ్వరాదులనిక్షించి తనభుజాస్తంభనమును వారింపలేక సర్వోత్తమత్వాద్యుడైన పరమేశ్వరుడుండగాను అజ్ఞాన మునసీలాగనవచ్చునా అని, తననే దండించి నేటనుండి అయినా నా యనశరణవరణముచేసి బ్రదుకుమని చెప్పె గనుక నాటనుండి విష్ణు భక్తివిడిచి శివభక్తుడై కాశీక్షేత్రనివాసుడై తలవెరచి ఉన్నాడు, కాశీఖండపంచనవతితమాధ్యాయము, నిశామయమహాభాగ త్వంమైత్రావరుణేమునె । పారాశర్యో మునివరోయథామోహాముపేయ్యతి।అథకాశీఖండే।శుణ్వంతుమునయస్సర్వే దేవతాః క్షీణ కల్మషాః । సత్యంసత్యంపునస్సత్యంనదైవం కేశవాత్పరం । ఇత్యుక్తమాత్రేసహసానందినా స్తంభితౌభుజౌ ॥ ఇత్యాది, శ్రీవిష్ణురువాచ॥శ్లో॥అవలేపేనదుర్బుద్ధేత్వయాదుర్భాషితంమహత్ । మమాపినాథమాక్షిప్యశివంమాంయత్ప్రశంససె । తత్వంమేవచనం వ్యాసశ్రుణుమూఢయథార్థవత్ । అహమేవజగత్కర్తామమ కర్తామహేశ్వరః । తస్యదేవాదిదేవస్యకర్తాకోపినవిద్యతే। దేవతానామహందేవోదేవోస్మాకంమహేశ్వరః।శివస్యపూజ్యతేలిం గంసర్వదేవాసురైర్నరైః । శివేనపూజితః కోవావదంతుప్రతివాదినః । తస్మాత్త్వంశరణంయాహిజీవితంతుయదచ్ఛసి।ఇత్యుక్త్వాం తర్థేనివిష్ణుర్వ్యాసోపిభయవిహ్వలః । జగామశరణం దేవంసర్వభావేనశంకరం । సంత్యజ్యతృణవద్దేవాన్ బ్రహ్మవిష్ణ్వాదికాంస్తథా । వ్యాసస్తుతి, యస్యాస్తిశక్తిస్సతు వావదీతుప్రాధ్వీకరో త్వంగుళి[illegible]పురా[illegible] । కఃపూజితో వాశిశిఖ రణక్తైర్నాభిః

తో భూతపతిః సురైర్వా। ఇత్యాద్యష్టకం ద్రష్టవ్యం । అథ కాశీఖండే॥ శ్లో॥ నాన్యం దైవం వేద్మ్యహం శ్రీమహేశాన్నాన్యం దైవం స్తౌమిశంభో ర్నుతే హం। నాన్యం దైవం వాచయామి త్రినేత్రాత్సత్యం సత్యం సత్యమేవం మృషాన॥ స్కాందః॥ శ్లో॥ ఇమం స్తవమమహాపుణ్యం యద్దైవం కృతవాన్ త్స్వయం । పారాశర్యస్తదారభ్య శంభుభక్తి పరోభవత్ । లింగం వ్యాసేశ్వరం స్థాప్య ఘంటాకర్ణహ్రదాగ్రతః । విభూతిభూషణో నిత్యం నిత్యం రుద్రాక్షధారకః । రుద్రసూక్తజపో నిత్యం నిత్యం లింగార్చకో భవత్ । సకృత్వా క్షేత్రసన్యాసా త్యాగీనాద్యాపి కాశికాం । తత్వం క్షేత్రస్య విజ్ఞాయ నిర్వాణ శ్రీప్రదాయినః॥ ఇత్యాది ప్రసంగవిస్తారము చూడ కోనేది. ... ... ...

—(*) తారకమంత్రం. (*)—

ఇక వ్యాసుడన్నట్టుంవలెనె బ్రహ్మరుద్రాది దేవతలున్నూ బుషులున్నూ కేశవుడె పరతత్వమని పలికినారు. అందు, మొదట కాశీపతియైన రుద్రుని వాక్యములే తెలిపెదము. పాద్మోత్తర భాగమందు రామవిశ్వరూపదర్శన సమయమందు, రుద్రుడు, ‹‹ఆవాం మమజగత్పూజ్యౌ మమపూజ్యౌ యువాం సదా । త్వన్నామ జాపినీ గౌరీ త్వన్మంత్రం జపవానహం । ముముక్షోర్మణికర్ణికాయామధోదక నివాసినాం । అహం దిశామి తే మంత్రం తారకబ్రహ్మనామకం । శ్రీరామ రామ రామేతియత్తత్తారకముచ్యతే । అతస్త్వం జానకీనాథ పరబ్రహ్మసునిశ్చితం । త్వన్మాయా మోహితాస్సర్వేన త్వాం జానంతి తత్వతః । ఇత్యుక్తశ్శంభునా రామః ప్రసాద ప్రవణో భవేత్ । అని, ‹‹రకారాదీని నామాని శృణ్వతో మమ పార్వతి। మనః ప్రసన్నతామేతి రామనామాభిశంకయా. శ్రీరామరామరామేతి రమే రామే మ

నోరమె । సహస్రనామతస్తుల్యం రామనామ వరాననె॥ అని, లింగపు
రాణము॥ శ్లో॥ లోకపూజ్యో మహాత్మా చ తారకబ్రహ్మనామకః। రా
మోరాజీవనయనః సురద్విజనమస్కృతః । అస్మత్స్వామీ జానకీశో
యోగిధ్యేయపదో మహాన్ । రమంతే యోగినోఽనంతే సత్యానందచి
దాత్మని । ఇతి రామపదేనాసౌ పరబ్రహ్మాభిధీయతే॥ అని, యీలాగున
శివుడే తనకు యిష్టదైవతము శ్రీరాముడని అనేకస్థలములయందు బలి
కెగనుక వ్యాసవచనము దప్పదు. వేదమందున్ను, దాశరథాయ విద్మ
హే సీతావల్లభాయ ధీమహి । తన్నో రామః ప్రచోదయాత్ । యన్నా
మైన సహస్రనామసదృశం నిరవధిగుణగ్రామే । అనిన్ని, శ్రీరామోప
నిషత్తు॥ శ్రీరామస్య మనుం కాశ్యాం జజాప పరమేశ్వరః। అని, ఇత్యా
దులు గలవుగనుక కాశీలో రుద్రుడుపదేశము జేసే తారకమంత్ర
మీ రామమంత్రమే కాని ప్రణవము గాదనిన్ని యీలాగే భారతరా
మాయణ భాగవతాదులందున్ను కేశవుడే పరతత్త్వమని సకలము
నులు జెప్పినారుగనుక వ్యాసవాక్యము సత్యమని నిర్ణయించికొ
న్నారు ఇందుకు సమాధానము చెప్పెదము. శ్రీరాముని శివుడు స్తో
త్రము చేసినా, గౌరి తన్నామజపము చేసినా, కాశీలో నుపదేశించే
మంత్రము రామమంత్రమైనా అవుగాక, అందువలన, "న దైవం కేశవా
త్పరం" అనే వచనప్రతిషేధపరిహారమునకేదియు నుపయోగింపదు.
శివపరతత్త్వనిర్ణయమునకు దహాని గాదు. స్వావతారప్రశంసగనుక
రామోత్కర్షము రుద్రోత్కర్షమే గాని వేరుగాదు, యిందుకు లెస్స
గా దెలిపెము. యెటువలెనంటే, రామశబ్దము విష్ణువాచకమై లేగ
దా తమపాస్యత్వాదిధర్మము విష్ణుసంబంధమయ్యేది మొదట విష్ణు
వాచక[illegible] లేదుగనుక మే రమంతే, సత్యానంద

చిదాత్ముఁడైనపరమశివునకే వాచకము, యేలాగంటే. "రమంతే యోగినోవిశ్వా నివాయత్రబ్రహ్మణిసరామః। అనేవ్యుత్పత్తిచేతబ్రహ్మమైనరుద్రపరము. అయితే విష్ణువే పరబ్రహ్మమగును. అతనికే, యీవ్యుత్పత్తిచేతవాచకమగును. శివునికేవాచకమని విశేషలక్షణములేదుగదా అంటే శివపరమైనందుకు హేతువుగలదు. కాశీలో రామతారకమంత్రముజపించుచు ముక్తులైనవారు విష్ణుసారూప్యమొందుటలేదు. శివసారూప్యమొందుదురు. ఆలాగే," కాశ్యామవశ్యంత్యజతామిహాంగంశరీరిణాం నాస్తిపునశ్శరీరం। యద్యస్తికంఠేగరళంలలాటేవిలోచనంచంద్రకళాకిరీటే।అని,వామనపురాణమందు విష్ణువాక్యం॥ శ్లో॥తత్రాస్తేనగరీపుణ్యాఖ్యాతావారాణసీశుభా। యస్యాంహిభోగినోధీశ ప్రియాంతిభవదాలయం।భూతిలబ్ధా విలాసిన్యాభుజంగపరివారితాః। చంద్రభూషితదేహాశ్చయస్యాంత్వామివశంకర।అనియున్నదికనుక శివపరమాయెను.ఇకఁడవారొక పరిహారము సంపాదించికొన్నారేమనిన, కాశిలో రామమంత్రము జపింపుచుచు దేహత్యాగముచేసినవారు విష్ణురూపముగాక రుద్రరూపముగా గారణమేమని శంకించికొని, కాశిలో పంచత్వమునొందినవారికి క్రమముక్తిగాని సద్యోముక్తిలేదు. అదేలాగంటే, ఆక్షేత్రమందు మొదట బ్రహ్మవిష్ణువునుగూర్చి బహుయజ్ఞములుచేసి ప్రసన్నుఁజేసికొని ఆవిష్ణువును ప్రతిష్ఠించి పూజసేయుచుండగా శివుఁడు బ్రహ్మహత్యావిమోచనార్థమైవచ్చి విష్ణువునుభజించితే నాక్షేత్రము రుద్రునకిచ్చి బ్రహ్మచేత నతనిబ్రతిష్ఠింపించెగనుక నకఁడ మొదట దేహావసానమందు మొదటమంత్రోపదేశకర్తయైన విష్ణువు తనవిష్ణుక్షేత్రమందుయజ్ఞ

ములు చేసినాడుగనుక విశ్వనాథలింగమును ప్రతిష్ఠించినాడుగ
నుక బ్రహ్మస్వరూపమై ఆవెనుక బ్రహ్మరుద్రులకున్న మంత్ర
ముకున్ను దేవతయైన విష్ణురూపమై యీలోకములనుండి కడపట
పరమపదమును జెందుదురు. అదికనుక రామనామ మావిష్ణుపర
మేగాని మరొకవిధముగాదని పరిహరించికొన్నారు. ఇందుకు పు
రాణేతిహాసాదివచనప్రమాణములేదుగనుకను వైదికలౌకికవిరు
ద్ధమైనదిగనుకను కుయుక్తిఅనిపించికొనును. ఆలాగేఆయెనా సక
లమంత్రజాపకులకున్ను తమకు మంత్రోపదేశముచేసిన ఆచార్య
రూపమున్ను తామధిష్టించిన క్షేత్రకర్తరూపమున్నుగావలయు
ను. పురుషోత్తమాదిదివ్యదేశములందు శరీరత్యాగముచేసినవారు
న్నుమొదటను అన్న్యైవిగ్రహములబ్రతిష్ఠించిఅక్కడనుపదేశములు
చేసిన బ్రహ్మేంద్రప్రద్యుమ్నాదులసారూప్యము నొందవలయును
అక్కడ క్రమముక్తిగాని సాక్షాన్మోక్షములేకపోవును. ఇట్లనియే
శాస్త్రములనునిరూపించుటలేదుగనుక నిదియుక్తియుక్తముగాదు.
యీలాగు క్రమముక్తిచెప్పెదను కావచ్చెనా ఆమంత్రముతారక
మేకాకపోవును. అథవా అయినా యిటువంటి తారకమంత్రము
శ్రేష్ఠమున్నుగాకపోవును. సద్యోముక్తికరమై యింతకన్నను తర్పా
ష్టమైనదొకటి గలుగవలె గనుక ఇదిగాక శ్రుత్యాది విరోధము
న్నుదెలిపెదము. శ్రుతియందు॥యథాక్రతురస్మిన్లోకేపురుషోభ
వతి। తథేతఃప్రేత్యభవతి। అని, యిందుకర్థము. అస్మిన్లోకే।
యీలోకమందు, పురుషః। పురుషుడు, భవతి।అగుచున్నాడో,
ఇతః। ఇక్కడనుంచి, ప్రేత్య। శరీరమువిడిచి, తథాభవతి। అ
టువంటి వాడగుచున్నాడు, అనగా సవసానకాలమందు యే

రూపము దలంచికొనుచు ప్రాణము విడుచుచున్నాడో, ఆరూప మగుననుట.ఆలాగె భగవద్గీతలందు,॥శ్లో॥యంయంవాపిస్మరన్ భావంత్యజత్యంతెకళేబరం । తంతమాప్నోతి కౌంతెయ సదాతద్భావభావితః । ప్రదేశాంతరము, "దేవాన్ దేవయజోయాంతి మద్భక్తాయాంతిమామపి"॥అనిన్ని, ఇత్యాదిప్రమాణములచేత నెటువంటిరూపమును స్మరించికొనుచు దేహమువిడుచుచున్నాడో అటువంటివాడగుననిన్ని, దేవాన్ దేవయజోయాంతి । అని, యేదేవతనుపాసించినవారా దేవతనుబొందుదురనిన్ని సద్యస్స్వరూపప్రాప్తి విధింబడెగాని క్రమముక్తివాసనామాత్ర ప్రసంగమున్ను లేదు గనుక వారియుక్తి ప్రమాణవిరుద్ధమాయెను, అదిగనుక రామమంత్రమేకాశిలోనవసానకాలమందు జంతువులకుపదేశించె తారకమంత్రమాయె నారామశబ్దవాచ్యుడున్ను శివుడేకాని ఇతరుడుకాడు. రామమంత్రమునకు,శివవాచకత్వమువినాగా నితరముసంభవింపదు. తన్మంత్రజాపకులకు శివభజనమువినాగా నితరముసంభవింపదు. తద్భజనమువినాగా సద్యఃశివస్వరూపప్రాప్తిన్ని సంభవింపనేరదు. అదిగనుక రామమంత్రమునకు ముఖ్యవృత్తినివాచ్యుడు పరమశివుడెసిద్ధము. ఆదెకడిమాట, రామశబ్దము విష్ణువాచకమె అవు

—(*) రాముడుశివాంశం. (*)—

నంటె, అవుగాక,అయితె, సాత్త్వాద్విష్ణువాచకమా;అవతారవాచకమా; యీరెంటిలో మొదటిప్రకారమంటె విష్ణువాచకపర్యాయపదములందు నిఘంటుకారు లుపపాదించుటలేదు గనుక సాత్త్వాద్విష్ణువాచకముగాదు సహస్రనామములలో పఠించినారంటె, శివసహస్రనామములందు పఠించినారు గనుక సమానము, ఇకన

వతారవాచకమనిరా పరశురామ రఘురామ బలరాములలో నై
వరివాచకమో అందరికినా? అయితే నందులో పరశురామబలరా
ముల నితరావతారములవలెనే భజించెదిలేదు గనుక వారిమచ్చ
ట్టుండెను. ఇక రఘురామవాచకమంటెనగును. అయితే,"రా
మోహంతుభవిష్యామి"అనిన్ని"అహందాశరథిర్భూత్వా"అనిన్ని
యాజ్ఞవల్క్యాదులకు ప్రత్యక్షమై రుద్రుడు వారిగూర్చి తానుదాశ
రథినైపుట్టి మీకు మోక్షము ప్రసాదించెదనెను. మరిన్ని, వంపావి
రూపాక్షునిగూర్చి తపముచేసిన బ్రాహ్మణునికి శూద్రునికిన్ని
విరూపాక్షుడు ప్రసన్నమై తానుసుందరరామావతారమెత్తు లా
ను మీరాకాలమందు మతంగుడున్ను వాలినైపుట్టుచున్నారు అ
ప్పుడు క్రమాన మీయిద్దరికిదర్శన బాణపాతములచేత మోక్షమి
చ్చేదననిపలికెను. యీవృత్తాంతము హరివంశశేష ధర్మములందు॥
శ్లో॥రామోదాశరథిర్భూత్వా జటావల్కలవాన్ప్రభో । హనిష్యా
మిశరేణాశువిదూరాద్దృష్టిగోచరే । శంకరః సర్వభక్తానాంత
థారామత్వమాప్తవాన్ ॥ అని, ఆదిగనుక రాముడు కేవలవిష్ణ్వ
వతారముగాదు । పరబ్రహ్మరూపపరమశివాంశజుడు । ఇందు
కు । విష్ణోరర్ధంమహాభాగకౌసల్యాజనయత్సుతం । అనేరామా
యణవాక్యవిరోధములేదు । యెటువలెనంటె । అష్టాభిర్లోక
పాలానాంమాత్రాభిర్నిర్మితోనృపః । అన్నట్టువలెనేపాలనము
విష్ణుకార్యముగనక - విష్ణ్వంశయోగమున్నుగలదని ప్రతిపాదించు
టగాదాన్ప్ర్యము నిర్ణయించికోవలెగనక । లేదన్నట్టాయెనా।
వేదోపబృంహణార్థమై రచింపబడిన హరివంశవాక్యమునకప్రా
మాణ్యమువచ్చును। మరియునీలాదేవిపద్మపురాణమందు॥శ్లో॥సీతాల

శ్రీమద్భగవాన్విష్ణుః సీతాగౌరీభవాంభివః । సీతాదేపీచరుద్రాణీభవాన్రుద్రోమహాబలః । అనివిష్ణురుద్రాంశయోగమే ప్రతిపాదించెను । రుద్రాంశప్రాధాన్య ప్రకటనార్థమై పునరుక్తిన్నిప్రయోగించియున్నది। అదిగనక రామావతారవిషయమై విష్ణ్వంశము ప్రధానమున్ను రుద్రాంశముప్రధానమున్ను గాతెలిసికొనేది।ఆలాగే శేషధర్మచతుశ్చత్వారింశాధ్యాయము॥ శ్లో॥ రామోహంతుభవిష్యామి విష్ణ్వంశేనసమన్వితః।దశాననపురోగాణిహనిష్యేమానిసంయుగె।అని। సత్వాంరామమహాబాహో శంకరోలోకశంకరః। వధార్థంరాక్షసేంద్రాణాం జాతోరఘుకులేశుభే । అని।అర్జునునందునరుని అంశమూనింద్రునంశమూ గలుగవర్ణించినట్టువలెనె తెలిసికొనేది । ప్రాధాన్యేనవ్యపదేశాభవంతి అనెన్యాయముచేత పాంచభౌతికమైనశరీరఘటాదిపదార్థములందు పార్థివత్వతైజసత్వాది వ్యవహారమువలెనె రుద్రాంశాధిక్యమును విచారించగా రాముడురుద్రావతారమనిపించికొనును । ఇదిగనక రామునికిశివుని వేషమువంటి వేషమేపురాణములందు వర్ణించినారు।శ్లో॥యదాశత్రుభయెచోరభయె రాజభయెతథా।ధ్యాత్వారఘుపతింక్రుద్ధం కాలానలమివాపరం।పీతకృష్ణాజినధరంభస్మోద్ధూళితవిగ్రహం।ఆకర్ణసశరాకృష్టకోదండభుజమండలం । జానకీలక్ష్మణోపేతం జటామకుటమండితం । అని।యోగవాసిష్ఠము రామంత్రినేత్రంసోమార్థ ధారిణంశూలినంపరం।భస్మోద్ధూళితసర్వాంగంకపర్దినముపాస్మహె । మత్స్యపురాణెద్వాదశాధ్యాయె। తతోదశరథోజాత స్తస్యపుత్రచతుష్టయం । నారాయణాత్మకాస్సర్వేరామస్తస్యాగ్రజోభవత్ । సుభవభూన్మహావిష్ణుః పరమే

శ్వరః। భూమావ్కృతావతారోభూత్స్వయంసాక్షాత్పరఃశివః।అని మానవియ్యసంహితైకత్రింశాధ్యాయము॥శ్లో॥ రామోథభరతశ్చైవ తృతీయోలక్ష్మణస్తథా । చతుర్థశ్చైవశత్రుఘ్నోరామఃపర శివాంశజః । సీతాతస్యాభవద్భార్యా పార్వత్యంశసముద్భవా। జనకేనపురాగౌరీతపసాతోషితాయతః।అజయద్దేవదేవేశంజగద్గురుముమాపతిం। వైకుంఠేవాసనూప్నోతిదశపూర్వైర్వదశాపరైః। అని।రామోపాసకులకుజెప్పినవైకుంఠప్రాప్తి - శివలోకప్రాప్తి మార్గభూతార్చిరాదిదేవతా ప్రాప్తిలక్షణముగాగాని విష్ణులోక ప్రాప్తిరామనామానుష్ఠాన విషయమనికాని సమాధానముచేసికోదగినది । లేకుంటె ప్రాగుక్తానేకశ్రుతిపురాణాది వాక్యవిరోధము దుష్పరిహార్యమగును । అదిగనుకతనయవతారమహిమముతాము వర్ణించికొనుటాయెగనక రుద్రునికాధిక్యహాని గాదు? ఇంతవర్యంతమున్న పూర్వపక్షిమతసిద్ధాంతమె అంగీకరించిఅది అన్యథాసిద్ధముగావ్యవహరించితిమి। యిప్పుడువారిసిద్ధాంతమె మొదలుముట్టనిరసిస్తున్నారము। యెటువలెనంటెవాస్తవానవిచారించితె రామమంత్రముతారకముగాదు శ్రీకాశీలోరుద్రుడుపదేశించెది రామ మంత్రమున్నుగాదు। యెటువలెనంటె ప్రణవపర్యాయనామనిర్వచనప్రకరణమందు। ఆత్మజ్యోతిస్సకృదావర్తతేవ ఏవసపవహిప్రాణాన్సకృదుచ్చారిత మాత్రమూర్ధ్వమున్నమయతీత్యోంకారః। ససర్వాన్ ప్రాణాన్ పరమాత్మని ప్రణిపాతయతీతిప్రణవః । ససర్వాన్ప్రాణాన్ పరమాత్మని ప్రణయతినమయతీత్యే తస్మాత్ప్రణవశ్చతుర్ధావస్థితః । ఇతిసర్వమమోవేద్యో వస్సర్వయోనిస్స

సర్వవాక్యాత్ ప్రణవాత్మకం । ఓం దేవేభ్యః వాచేతిసంవక్త్వా సర్వేభ్యోమఖఃభయేభ్యః సంతారయతీతితారణాత్తారం । సర్వేదేవాఅస్మిన్నీశతీతిఃష్ణుః। సర్వాణిబృంహయతీతిబ్రహ్మా।సర్వాణ్వ్యాప్నోతీతివ్యాపయతీతి వ్యాపనాద్వ్యాపీమహాదేవః । అని, అథర్వసిరస్సునందు నిర్వచించెను. యీలాగే సర్వవేదాంతము లందు నిర్ణయించియున్నది. అదిగనుక తారకమనంగా రూఢి యోగములచేత ముఖ్యవృత్తిని ప్రణవమేకాని యితర మంత్రములుకానేరవని నిర్ణయింపబడెను. గౌణవృత్తినైతే సకలమంత్రములు న్నాపచారికప్రసంగమందు, తారకములేఅనిపించికొనును.“యంబ్రహ్మవేదాంతవిదోవదంతి” అనిన్ని, “అసావాదిత్యోబ్రహ్మ”అనిన్ని, యీలాగుప్రశంసాప్రకరణములందు సకలదేవతలుబ్రహ్మమనిపించికొన్నట్టువలెనే,శ్రీరామరామరామేతి।ఏతత్తారకముచ్యతే।అన్నరుద్రవాక్యముగాతెలిసికొనేది. కాకున్నట్టాయెనా, యిది శ్రుతివిరుద్ధముగనుక పురాణవాక్యములచేత వేదమునకుసంకోచత్వమువచ్చును. అదిగనుకనే ప్రణవయుక్తరామమంత్రము తారకమని తాము పిరికితనాన యుక్త్యంతరముగల్పించికొని సమర్థించికొనుటను నిరసింపబడెను. ప్రణవయోగసామర్థ్యమునగాని నిరుపాధికముగా తారకముగాదాయెగనుక, అదెక్కడిమాటంటే శ్రుత్యుక్తములైన తిరుమంత్రములనెడి, నారాయణాష్టాక్షర్యాది మంత్రములు తారకములుగాకపోవును. అయితే నిష్టాపత్తిన్నిగాదు. తదుపాసనవలన పరమపురుషార్థమైనమోక్షమున్ను లేకపోవుచున్నది. ఆయష్టాక్షరీమంత్రము పంచసంస్కారములలోనిది. అయితే తమకావశ్యకమైనదిగనుక ఇటువలె తారకపదవాచ్యము ప్రణవమంత్రమని తెలిపితిమే ఇక కాశీ

—*కాశీలో తారకోపదేశము.*—

లో ముమూర్షువులైనజంతువులకు రుద్రు డుపదేశించేమంత్రము
న్ను ప్రణవమే కాని మరొకటిగాదు. అందుకు ప్రమాణము జాబా
లోపనిషత్తు । అత్రహిజంతోర్ముమూర్షోః। ప్రాణేషూత్క్రమమాణే
షురుద్రస్తారకంబ్రహ్మేత్యాచష్టే । అని, యిందుకుపబృంహణము,
పరాశరపురాణపంచదశాధ్యాయము॥ శ్లో॥ అత్రైవోత్క్రమమాణ
స్యజంతుమాత్రస్య కేవలం। వేద వేదాంతసారస్యప్రణవాఖ్యస్యపా
ర్వతీ। బ్రహ్మణస్త్వర్థభూతోహం సంసారద్రావకో౽చిరాత్।
కృపయామామకంరూపం పరిపూర్ణ పరామృతం । ఆనందయతిచి
ద్రూపం తారకంతమసఃపరం। స్వయంభాతంనిరాభాతం దాస్యా
మిప్రత్యగాత్మనా ॥ అని, ఆరుద్రుడే పార్వతినిగూర్చి యీలాగు
తెలిపెను. కాశీఖండం ॥ సంవర్ణ్యతేకైః కిలకాశికేయంజంతోస్థి
తస్యాత్రయతోంతకాలే। పచేళ్లిమైః ప్రాక్తనపుణ్యభారైరోంకార
మోంకారయతీందుమౌళిః । అని, మరిన్నిసప్తపంచదశాధ్యాయ
ము॥ శ్లో॥ అతోత్రక్రమణకాలేహంస్వయమేవద్విజోత్తమాః। దిశా
మి తారకంబ్రహ్మప్రణవాఖ్యమనుత్తమం ॥ అని, ఇత్యాది శ్రుతి
పురాణవాక్యవిరుద్ధమైన రామమనుతారకత్వ ప్రతిపాదక పద్మపు
రాణాది వాక్యములప్రమాణములుగనుక అర్థవాదములుగా దె
లిసికొనేది. అయితే శ్రీరాముని పరబ్రహ్మమనిన్ని రామమంత్ర
ము తారకమనిన్ని వర్ణించేటందుకేమి గారణమంటే, చెప్పేము
ఆప్రశంసావాక్యములందే॥ శ్లో॥ రమంతేయోగినోనంతేసత్యానం
దేచిదాత్మని । ఇతిరామపదేనాసౌపరబ్రహ్మాభిధీయతే ॥ అని, గౌణ
త్వము తెలుపుచున్నది. యేలాగంటే, సత్యానందేచిదాత్మని। అనం

గా, "సత్యంజ్ఞానమనంతంబ్రహ్మ" అనె, బ్రహ్మలక్షణము వేదాంతమాత్రము దెలుపుచున్నది. గనుక సత్యానందజ్ఞానస్వరూపుడైన యేబ్రహ్మమందైనానేమి యోగీశ్వరులురమింతురో, ఆబ్రహ్మము పేరు రాముడనిపించును, రమః క్రీడాయాం అనె, ధాతువుమీదను, కర్తరిచకారకెసంజ్ఞాయాం అనె, పాణిని సూత్రముచేతనధికరణకారకార్థమందు, ఘఞ్ అంతమైరమంతెఅస్మిన్నితిరామః॥ అనేశబ్దము నిష్పన్నముఆయె గనుక రామశబ్దమున్నుబ్రహ్మవాచకమగును, ఇతిరామపదెన అనంగా, ఇటువలె పరబ్రహ్మవాచకమైన రామశబ్దముచేత ననుట, యీలాగంటె రామశబ్దాభిధాను డౌటబట్టి, అసౌ । ఈరాముడు, పరబ్రహ్మాభిధీయతె । పరబ్రహ్మమనిపించికొనును, పేరు సగభాగమనేనానుడిచేతను, అది గనుక నామమాత్రముగాని స్వరూపాన బ్రహ్మమనుటగాదు, యీలాగు నామనిర్వచన పూర్వకముగా గౌణత్వమె తెలిపెగాని నిరుపాధికముగా ముఖ్యవృత్తిని బ్రహ్మమనుటలేదు, అదిగనుక పరబ్రహ్మవాచక రామశబ్దవాచ్యపురుషునందు రామశబ్దవాచ్యత్వరూపసాధర్మ్యముచేత పరబ్రహ్మనిష్ఠతారక శబ్దవాచ్యత్వరుద్రాది దేవతాపూజ్యత్వ బ్రహ్మపదవాచ్యత్వాది గుణముల నారోపించి, వాచ్యవాచకయోరభేదాత్ । అనె న్యాయముచేత స్తుతిసేయుట. యీలాగున బ్రహ్మత్వారోపణమే హేతువు, అవతారోత్కర్షణము మూలవిగ్రహ నిష్ఠోత్కర్షారోపణము వినాగా సంభవింపనేరదు. అయితె విష్ణ్వంశయోగమున్నుగలదు గనుక తన్నిష్ఠ పరబ్రహ్మత్వాద్యారోపణమే అవునంటిరా, మొదటికివిష్ణునందె ముఖ్యవృత్తిని బ్రహ్మత్వము లేనందున పూర్వప్రకరణమం

దు నేర్పరదినారము గనుక నికఁడెచెప్పిన సత్యానందాదిలక్షణ
ము పరమశివధర్మముగాని విష్ణుధర్మముగాదు గనుక నదిగూడదు
అయితే రామునిగూర్చి నీవు నాకు పాస్యుడవు గౌరినీ నామజపము
చేసును. నేనునీనామస్మరణము సేతున్న,అని, ఇత్యాది స్తుతులుచేసె
గనుక రుద్రుడు పాసకుడున్ను రాముడు పాస్యుడున్నాయె గదా
అంటే, నీలాగంటిస్తుతులు, భృత్యామాత్య శిష్యపుత్రాదులందు
సంభవించుగనుక నింతమాత్రమునను పాస్యోపాసకత్వ నిర్ణ
యము గానేరదు, రాముడు తనఅంశజుడు గనుక నత్యంతప్రియభ
క్తుడు గనుక వాత్సల్యముచేత కసివోక గౌరవముచేసుట గానిస్వా
భావికముగాదు, అంశజుడైనందుకు ప్రమాణపురస్సముగా దెల్పి
తిమి. ఇశభక్తుడైనందుకు దెలిపేము. అగస్త్యునిచేత శైవదీక్షితు
డై శివునిగూర్చి తపస్సుచేసి ప్రసన్నుడైన శివునివలన వరలబ్ధుడై
గీతాశాస్త్రోపదేశమాయెను. విశ్వరూపదర్శనముచేసెను, అని.
పాద్మపూర్వభాగమందు శివగీతలందు చెప్పిఉన్నది. ప్రసిద్ధము
గనుక విస్తరమేలనని వ్రాయమైతిమి, జైమినిభారతమందు కౌస
ల్యావాక్యము.॥శ్లో॥వసిష్ఠప్రముఖా రామమాంవదంతిచయద్వచః।అ
చ్ఛేద్యోయమభేద్యోయమక్లేద్యోయంసుతస్తవ। తదిదానీంవృథా
మన్యేబాణైర్భిన్నోసిరాఘవ। అథవాశివభక్తంత్వామాహుః కే
చిన్మునీశ్వరాః। అని, రాముడు పరమశివాంశజుడు గనుక నే
రామధ్యానమున్ను శివరూపముగానే సేయవలెనని యోగవాసిష్ఠ
మందు జెప్పియున్నది. "రామంత్రినేత్రంసోమార్ధధారిణంశూలి
నంపరం।భస్మోద్ధూళితసర్వాంగంకపర్దినముపాస్మహే"అని,రా
మేశ్వరాద్యనేకలింగప్రతిష్ఠాపకత్వమున్ను అచ్ఛాలింగవిగ్రహో

దులందుప్రత్యక్షసిద్ధమైయున్నది «శివలింగప్రతిష్ఠాతాసర్వావగుణవర్జితః" అని, రామాష్టోత్తరశతనామస్తోత్రమందునున్నది. యీలాగున నేయుద్ధకాండమందు, «అత్రపూర్వంమహాదేవఃప్రసాదమకరోత్ప్రభుః" అన్ని,ఉత్తరకాండమందు, «నైవపశ్యామిభైషజ్యమంతరేణ వృషధ్వజంతస్మాద్యజ్ఞేనమహతాపూజయామోమహేశ్వరం" అనిన్ని, ఇత్యాదిప్రమాణములచేతశివునిగూర్చితపస్సున్ను లింగప్రతిష్ఠలున్నుయజ్ఞములున్నుచేసేననియుండె గనుకరాముడు ఉపాసకుడున్ను రుద్రుడు ఉపాస్యుడున్నాయెను. అయితె పాద్మలైంగ్యాది వచనములచేత రాముడేఉపాస్యుడని తోచుచున్నది గదాఅంటే, అవాప్తసకలకాముడైనఈశ్వరునికి మనుష్యావతారమైనిజాంశమైనరాముని గొలిచేటందుకు నిమిత్తములేదు, అట్లైనా శివుడు రామోపాసకుడైనందుకు లక్షణమేమి ? అది విష్ణురామకృష్ణులకువలెను దీక్షాలక్షణ మెటువంటిది ఆచార్యుడెవరు ? ఉపాసన యెటువంటిది ? లాంఛనమెట్టిది ? ఇత్యాద్యుపాసనాధర్మాచరణమునకు ప్రమాణములేదు గనుకను, సర్వసాధారణమైన వాఙ్మాత్రస్తుతిజేసెనని యున్నది. గనుకను సామాన్యధర్మముకంటే విశేషధర్మము బలవంతముగనుకను దీక్షాలింగపూజాతపోవరవరణాది విశేషధర్మనిరతుడైన శ్రీరాముడే విశేషాకారాన శివభక్తుడగుగాని స్వామిభృత్యాదులకు పరస్పరసాధారణధర్మమైన ప్రశంసామాత్ర నిరతుడైన రుద్రుని రామభక్తుడని సాధించేటందుకు పూర్తిచాలదు. అదెక్కడిమాటంటే, సనకనారదభృగుకుచేలాది ప్రశంసా ప్రసంగమున్ను విష్ణువుకు ఉపాసకత్వాది నికర్షసంపాదకమే అవును, ఇత్యాది బాధకప్రసంగము

మరిన్ని విస్తరముగా కృష్ణకైలాసయాత్రా ప్రసంగమందు దాహ
రించినాము చూచికొనేది. “శ్రీరామస్యమనుంకాశ్యాం జజాపపర
మేశ్వరః” అనే రామోపనిషద్వాక్యమున్ను గుణవాదముగానే
తెలియబడెను. ప్రణవోపదేశ ప్రతిపాదక జాబాలాది బహుతర
శ్రుతివాక్య విరోధము గలిగియున్నది గనుకను అనాదిసిద్ధమైన
కాశీస్థలమం దుపదేశించే తారకమంత్రము ప్రవర్తమానవైవస్వ
తమన్వంతరగత త్రేతాయుగస్థ రామావతార వాచకరామమం
త్రమనుట యుక్తియుక్తముగాదు ప్రమాణమున్నుకాదు, రామా
వతారమునకంటే, బహుపూర్వకాలమునాటివాడైన హరిశ్చం
ద్రునిచారిత్రమందు వర్ణించిన కాశీస్థలమందున ఆకాలమందురు
ద్రు డుపదేశించే మంత్రమేదో తెలియవలెను. ఇదిగాక ఆరామా
వతారకాలమందున్ను వారణాసీ ప్రశంస గలిగియున్నది. రా
మాయణగతసారమేయోపాఖ్యానమందు॥శ్లో॥ ఎతచ్ఛ్రుత్వాతు
రామోవైవిస్మయోత్ఫుల్లలోచనః। శ్వాప్యగచ్ఛన్మహాతేజాగ్ఘాతవ
వాగతస్తతః। మనస్వీపూర్వజాతిజ్ఞో జాతిమాత్రేణదూషితః। వా
రణస్యాంతదాశ్వావైప్రాయంచోపావిశత్స్వయం॥ అని, యిక్క
డ నయోధ్యానగరము ముక్తిక్షేత్రమై యుండగానున్ను, అక్క
డనే మోక్షదాతైన శ్రీరాముడు సాక్షాత్కారమున నుండగా
నున్ను జాతిస్మరత్వము గలదిన్ని జ్ఞానముగలిగినదైన్ని నటువంటి
శునకమయోధ్యానగరవాస రామదర్శన స్మరణములువిడిచి మో
క్షాపేక్షను శివక్షేత్రభూతకాశికా గమనము చేసె గనుక అనాది
సిద్ధమైన కాశియందు ఉపదేశించే మంత్రము. రామమంత్రేతరమ
ని స్పష్టమాయెను. ఇటుగనుక నిందుచేతనే రుద్రాదులజిహ్వ

లు వ్యాసభుజములువలెనే స్తంభింపవాయెను అని, వారుప్రయోగించినటువంటి హేళనయుక్తిన్ని నిరసింపబడెను. యెటువలెనంటె, వ్యాసులు ప్రమాణస్వరూపముగా శివాలయద్వారదేశమందు భుజములెత్తి నిబంధింపవచ్చితే నది అబద్ధప్రసంగము గనుక సహింపక భుజాస్తంభనమాయెను. రుద్రాదులు వాత్సల్యమున నుత్ప్రేక్షించి ప్రశంసించినారు గనుక నక్కడ దోషప్రసక్తిలేదు, అలాగె, స్మృతి ॥ ననర్మయుక్తంవచనం హినస్తినస్త్రీషురాజన్‌నవివాహకాలె ప్రాణాత్యయె సర్వధనాపహారెపంచానృతాన్యాహురపాతకాని॥ ఇతిసర్వంశివం॥

---

గద్య॥ ఇది శ్రీమత్సనాతననాథునాతనవీరశైవపాశుపతగణసంస్మరణసౌరభసంవాసితచేతస్సమాహితశ్రీమదవటూరివీరభద్రిగురుభద్రపాదారవిందకందనానందమకరందబిందుకందళితశ్రీమద్గురులింగోద్భవభజనధురీణతాపరిణతాప్రతిమప్రతిభావైభవధౌరెయబుద్ధిరాజయ్యనప్రధానతనూభవ పేరయనామధేయసూరిప్రణీతంబైన సాత్వికబ్రహ్మవిద్యావిలాసనిరసన సమాఖ్య గ్రంథంబునందు.

సర్వంబునుపకాదశప్రకరణము,ఓంతత్సత్.

---

